# ఎ. చేహొవ్

# కథలు





"ప్రగతి" ప్రచురణాలయం

మాస్కో

అనువాదం: రాచమల్లు రామచంద్రారెడ్డి

**А. П. Чехов**

**РАССКАЗЫ**

*на языке телугу*

# విషయసూచిక

# అంతోన్ చేహొవ్ కథలు

తన మరణానికి ముందు రాసిన చివరి కథ 'పెండ్లికూతురు' (1903)లో చేహొవ్ ఒక యువతిని వర్ణిస్తాడు. కథ తొలి భాగంలో, ఆమె ఒకనాడు వేకువకు ముందే మేల్కొని, తోటలోకి చూస్తుంది. "దట మైన తెల్లని పొగమంచు నిశ్శబ్దంగా లైలాక్ పొదలను సమీపించింది, వాటిని ఆవరించే ఉద్దేశం వున్నట్లు." అదే బరువైన తెల్లని పొగమంచు ఆ అమ్మాయి హృదయాన్ని ఆవరించినట్లుంది. తన నిశ్చల, లక్ష్యరహిత జీవితానికి అంతం గానీ, మార్పు గానీ వుండబోదని ఆమె అనుకుంటుంది. కానీ యింతలో తెల్లవారుతుంది. "పక్షులు కిటికీకింద చెట్ల కొమ్మలో కిచకిచ మంటున్నాయి, తోటలోని పొగమంచు విరిసింది, వసంతపు సూర్యకాంతి అన్నిటికీ బంగారు పూత పూసింది, ప్రతిదీ చిరునవ్వులలో ఓలలాడినట్లుంది." యిది కేవలం ప్రకృతిలో వచ్చిన మార్పు కాదు. నాద్యాలో కూడా మార్పు వచ్చింది — యీ స్వయంసంతృప్తమైన క్షుద్ర జీవితంతో శాశ్వతంగా తెగదెంపులు చేసుకోవాలని ఆమె నిశ్చయానికి వచ్చింది.

చేహొవ్ చివరి కథలోని యువతిలో వచ్చిన మార్పు ఆ రచయిత కృషికి సంకేతంగా వుందని మనం సముచితంగా అనవచ్చు.

అంతోన్ చేహొవ్ 1860లో, తగన్‌రోగ్ అనే రష్యన్ పట్టణంలో జన్మించినాడు. యిరవై యేండ్ల వయసులో ఆయన మాస్కో విశ్వవిద్యాలయంలోని వైద్య కళాశాలలో చేరినాడు. అప్పుడు ఆయన వార్తాపత్రికలకూ, పత్రికలకూ కథానికలూ, స్కెచ్చిలూ, సమకాలిక విషయాలమీద వ్యంగ్య రచనలూ రాయసాగినాడు.

1880లు రష్యాలో ప్రగతి వ్యతిరేక కాలం, "హేతువాద"పు సూచన యేది కనిపించినా మనుషులను హింసించే కాలం. ప్రగతి వ్యతిరేకత, చిక్కని పొగమంచు లాగ, దేశాన్ని ఆవరించింది. యీ కాలంనాటి చేహొవ్ కథలు ధనార్జన కొరకూ, స్వీయ పురోగతి కొరకూ అంకితమైన అనామక వ్యక్తుల గురించి రాసినవి. "బలి

సిన'' అధికార్ల పటాటోపాన్నీ, సంకుచిత మనస్తత్వాన్నీ, ''చిక్కిపోయిన''వాళ్ల అణకువనూ, దాస్యభావపు వినమ్రతనూ ఆయన యీసడిస్తాడు. యీ ప్రపంచంలో మనిషికి కచ్చితంగా సాంఘిక హోదానుబట్టి గౌరవాగౌరవాలు కలుగుతాయని చేహొవ్ అంటాడు ('గుమాస్తా మరణం,' 1883; 'బురఖా,' 1884; మొదలైనవి).

చేహొవ్ బహిరంగంగా పాఠకునికి విజప్తి, అతన్ని ఒప్పించడానికి ప్రయత్నమూ చేయడు. పాఠకునికి యిలా చెప్పడానికి ఆయన కథను మొత్తంగా ఉపయోగించుకుంటాడు: నిజమైన మనిషిగా వుండడానికి నీ కెందుకు భయం? యెందుకు నీవు నీకంటె పైనున్నవాళ్లను మాత్రమే గౌరవిస్తూ, నీకంటె కింద వున్నవాళ్లమీద అంత బాహాటంగా ఉమ్మివేస్తావు? ఆనందాన్ని కొలిచేది హోదాలతోనూ, బిరుదు చిహ్నాలతోనూ, డబ్బు సంచులతోనూనా? హోదాల, బిరుదుల బ్యూరాక్రటిక్ నిచ్చెనను అంత ఆత్రంగా యెందుకు యెగ్రబాకుతున్నావు?

చేహొవ్యొక్క అత్యంత జనప్రియమైన తొలి కథలలో ఒకటైన 'ఊసరవెల్లి' (1884) జీహుజూర్ తత్వానికి పాఠ్యగ్రంథం లాంటిది. మార్కెట్‌వద్ద ఒక మనిషిని కుక్క కరిచింది. డ్యూటీలో వున్న పోలీసు నిర్దాక్షిణ్యమైన ''కేసు'' విచారణ ప్రారంభించి, తమ కుక్కలను వూరిమీద వదలిపెట్టినవాళ్లను తిడుతుంటాడు. ఆ కుక్క జనరల్‌దని జనంలో యెవరో చెప్తారు. ఊసరవెల్లి రంగులు మార్చినట్లు తన అభిప్రాయాలు వేగంగా మార్చుకోగల పోలీసు అప్పుడు కుక్క కరిచిన మనిషిని తిడతాడు. తరువాత, అది జనరల్ కుక్క కాదని మరెవరో అంటారు. అప్పుడు, కుక్క యజమానికి గుణపాఠం నేర్పాలి, అని పోలీసు అంటాడు. కుక్క యజమాని సాంఘిక అంతస్తుమీద అంతా ఆధారపడుతుంది: అతను గొప్పవాడైతే, చేసింది ఒప్పు; అతను అడుగున వుంటే, కోర్టు విచారణకు గురి అవుతాడు.

చేహొవ్ హాస్యం కరకైనది, ధీసమన్వితమైనది. ఆయన కవితార్ద్రతా, ఆయన హృదయాన్ని చూరగొన్న పాత్రలూ, ఆయన విశ్వాసాలూ ప్రచ్ఛన్నంగా వుంటాయి; అనుభూతుల ప్రదర్శన ఆయనకు యిష్టం లేదు. తాను మెచ్చుకునేవాళ్లను గురించి ఆయన రాయడు. అపహసించదగిన అన్నిటిమీదా ఆయన తన తీక్ష్ణ, వ్యంగ్య దృష్టిని మళ్లిస్తాడు.

1890తో ప్రారంభమైన దశాబ్దిలో, చేహొవ్ రచయితగా పరిణతి నందుకున్నప్పుడు, ఆయన హాస్య, వ్యంగ్య కథలూ, స్కెచ్చిలూ విసర్జించి, గురుతరమైన పెద్ద కథలు రచించినాడు ('చప్పిడి కథ,' 1889; 'ఆరవ వార్డు,' 1892; 'రెండంతస్తుల యిల్లు,' 1896, మొదలైనవి).

చేహొవ్ కథల ప్రధాన విషయం సమకాలిక సమాజం గురించీ, ఆశలూ, కలలూ యెండిపోయే వాతావరణం గురించీ అయింది. 'ఇయోనిచ్' (1898) అనే కథలోని డాక్టరుకు ఒక చిన్న పట్టణంలో ఉద్యోగం వస్తుంది. నగరంలో కెల్ల విద్యా, ప్రజ్ఞా సంపన్నమైన తూర్కిన్ కుటుంబంతో అతనికి పరిచయం కలుగుతుంది. త్వరలో అతను మంత్రముగ్ధునిలా వాళ్ల ప్రభావానికి లోనౌతాడు. వాళ అమ్మాయి కాత్యను అతను ప్రేమించి, ఆమెను వివాహమాడడానికి వాళ్ల అనుమతి కోరుతాడు. కానీ అతని ప్రేమ అతని ఉపేక్షతో నిత్యం పోరాటం చేస్తున్నది. డాక్టర్ ఇయోనిచ్ కథ ఉపేక్షకూ, హృదయ రాహిత్యానికీ క్రమక్రమంగా లోబడిన మనిషి కథ. చేహొవ్ అన్నట్లు, డాక్టర్ ఇయోనిచ్ హృదయంలో పూసిన లైలాక్ పూలమీద వ్యాపించే చిక్కని పొగమంచు లాంటిది అది.

'కుక్కను వెంటబెట్టుకున్న మహిళ' (1899) బహుశా చేహొవ్ కథల్లో కెల్ల ప్రజా ప్రియమైనది. యిది పద్దైదు పుటలే వున్నా, అనేక ఉద్గ్రంథాల విలువ గల చిన్న కళాఖండం. దీనిలోని ప్రధాన పాత్ర దిమ్త్రీ గూరొవ్ డాక్టర్ ఇయోనిచ్‌కి వ్యతిరేకం. గూరొవ్, యాల్టా ఊరిలోని ఒక వేసవి కేంద్రంలో, అన్నా సెర్గేయెవ్నాను కలుసుకుంటాడు, కుక్కను వెంటబెట్టుకున్న మహిళను. యిది వాళ్ల ప్రేమ కథ.

చేహొవ్ కథలు ఉద్విగ్నంగా, సంక్షుభితంగా వుంటాయి, సుకుమారంగా వుంటాయి. వాటిలో ఉపదేశాలూ, మందలింపులూ వుండవు. అవి యెంతో సాఫీగా నడిచే కథలు. అవీ, 'జలపక్షి,' 'వాన్య మామయ్య,' 'ముగ్గురు అక్కచెల్లెండ్లు,' 'చెర్రితోట' అనే నాటకాలూ పాఠకులలోనూ, ప్రేక్షకులలోనూ ఆనాడు వుండిన జీవితంపట్ల అసంతృప్తి కలిగించి, జీవితం యెలా వుండవలసిందీ చెపుతాయి.

అంతోన్ చేహొవ్ 1904లో మరణించినాడు. ఆయన చిత్రించిన సమాజం సుదూర గతానిది. విప్లవ పూర్వపు రష్యా చాయ లేవీ యిప్పుడు లేవు. ఫాక్టరీ సొంతదార్లూ లేరు, వర్తకులూ లేరు, పోలీసులూ లేరు. "బలిసినవాళ్లూ," "చిక్కిపోయినవాళ్లూ" అనే సమాజ విభజన యికయే మాత్రమూ లేదు. చేహొవ్ పాత్రలు గతానికి చెందినవి.

మరి, చేహొవ్ యెందుకు యీనాటి రష్యాలో అంత ప్రజా ప్రియుడుగా వున్నాడు? దశ లక్షల సంఖ్యలో అచ్చయ్యే ఆయన పుస్తకాలు దుకాణాల్లో దొరకడం యెందుకు అంత కష్టం? కారణాలు చాలా వున్నాయి.

చేహోవ్‌ను సోవియట్ రష్యాలోనూ, ప్రపంచంలోనూ యెందుకు ప్రేమిస్తారంటే, ఆయన. యెప్పుడూ నిరలంకృత సత్యం చెప్పడానికి ప్రయత్నించినాడు గనుక!

ఆయన్ను యెందుకు ప్రేమిస్తారంటే, ఆయన చెప్పే సత్యం యెప్పుడూ నిరావేశ ప్రశాంతి కాదు, హృదయరహిత విజత కాదు; అది యెప్పుడూ ఆయన విశ్వాసంలో భాగంగా వుండింది గనుక.

''తాను వాస్తవంగా యెలా వున్నదీ మానవునికి చూపిస్తే, అతను బాగు పడతాడు,'' అని చేహోవ్ అన్నాడు.

ఆయన్ను యెందుకు ప్రేమిస్తారంటే, తన సొంత జీవితం గానీ, తన పాత్రల జీవితాలు గానీ యెంత కష్టంగా వున్నా సరే, ఆయన తన ప్రత్యక్ష పరిసరాలను మాత్రమే చూడలేదు, ఆయన భవిష్యత్తుయొక్క నిశ్శబ్ద పదధ్వనులు కూడా విన్నాడు గనుక, పసిగట్టినాడు గనుక.

చేహోవ్ మహా ప్రజ్ఞగల రచయిత. రచనలో, తనలాగే ప్రజ్ఞగల పాఠకుని ఉద్దేశించినట్లూ, అతని భావుకత్వంమీదా, గ్రహణ శక్తిమీదా నమ్మకం వున్నట్లూ ఆయన యెప్పుడూ కనపడతాడు. ఆయన యెప్పుడూ రక్షక ధోరణి వహించలేదు; అందివ్వడంద్వారానూ, చిన్న పిల్లలకూ, మందబుద్ధులకూ యెంతో ఓర్పుతో, వివరాలతో బోధించడానికీ, వివరించడానికీ ప్రయత్నించడంద్వారానూ ఆయన యెప్పుడూ పాఠకులను అవమానించలేదు. పాఠకుడు తనను అర్థం చేసుకుంటాడనీ, తన గ్రంథాల పుటలలో పాఠకుడు దారి తప్పడనీ చేహోవ్‌కు నమ్మకం వుండింది.

చేహోవ్ సందేశం సత్యాన్నీ, ఆశనూ అనుసరించడం.

# గుమాస్తా మరణం

ఒక ప్రశస్తమైన రాత్రి, ఇవాన్ దీమ్రితిచ్ చెర్వ్యకోవ్ అనే ప్రశస్తమైన గుమాస్తా ఫస్ట్ క్లాస్‌లో రెండవ వరసలో కూర్చొని, బైనాకులర్స్ సాయంతో 'కార్నెవీల్ గంటలు' అనే నాటకాన్ని ఆనందిస్తూ వుండినాడు. అతను రంగస్థలాన్ని తిలకిస్తూ, తనకంటె అదృష్టవంతుడైన మానవుడు భూప్రపంచంలో లేడని అనుకుంటూ వుండగా, హఠాత్తుగా.... ''హఠాతు గా'' అనేది చౌకబారు నుడికారం అయింది; కానీ జీవితం నిండా హఠాత్ ఘటనలు వుండగా రచయితలు దానిని వాడ కుండా యెలా వుండగలరు? కనుక, హఠాత్తుగా అతని ముఖం ముడుచుకపోయింది, కండ్లు ఆకాశంవైపు తేలిపోయినాయి, ఊపిరి స్తంభించింది... బైనాకులర్లనుండి ముఖం పక్కకు తిప్పకొని, కుర్చీలో వంగి, అతను — అఛ్ఛూ్మ! అనగా, అతను తుమ్మినాడు. మరి, ప్రతి వొకరికీ యిష్టం వచ్చినచోట తుమ్మే హక్కు వుంది.

రైతులూ, పోలీసు యిన్‌స్పెక్టర్లూ, గవర్నర్లు కూడా తుమ్ముతారు. ప్రతి వొకరూ తుమ్ముతారు — ప్రతి వొకరూ. చెర్వ్యకోవ్‌కు మనస్సంకోచ మేమీ కలగ లేదు; అతను చేతిగుడ్డతో ముక్కు తుడుచుకొని, సుసంస్కారి లాగా, తన తుమ్ము యెవరికైనా యిబ్బంది కలిగించిందేమో అని చుట్టూ చూసినాడు. అప్పుడు నిజంగా కలిగింది అతనికి మనస్సంకోచం. మొదటి వరసలో, సరిగ్గా అతనికి ముందర కూర్చొని, ఒక చిన్న వృద్ధుడు అతనికి కనిపించినాడు, తన బట్టతలా, మెడా, గ్లౌతో తుడుచుకుంటూ, యేదో ణుక్కుంటూ. అతను రవాణా మంత్రిత్వ శాఖకు చెందిన సివిల్ జనరల్ బ్రిజాలొవ్ అని చెర్వ్యకోవ్ గుర్తించినాడు.

"ఆయనమీద నేను తుమ్మినానే!" అనుకున్నాడు చెర్వ్యకోవ్. "ఆయన మా అధికారి కాని మాట నిజమే, కానీ యిది చాలా అనుచితమైన పని. నేను క్షమాపణ చెప్పుకోవాలి."

చెర్వ్యకోవ్ చిన్న పొడిదగ్గుతో ముందుకు వంగి, జనరల్ చెవిలో చెప్పినాడు:

"క్షమించండి, సార్. నాకు తుమ్ము వచ్చింది.... నేను ఉద్దేశించలేదు...."

"పోనీలే."

"మీరు తప్పక క్షమించాలి. నేను.... అది ముందుగా అనుకున్నదికాదు!"

"యిక వూరుకో, దయయుంచి! నాటకం విననీ!"

చెర్వ్యకోవ్ కాస్త యిబ్బంది పడి, వెర్రి చిరునవ్వు నవ్వి, రంగస్థలంమీదికి దృష్టి మళ్లించడానికి ప్రయత్నించినాడు. అతను నటులను చూస్తూవుండినాడు, కానీ భూప్రపంచంలో కెల్లా అదృష్టవంతుణ్నని అతనికి యిప్పుడు అనిపించలేదు. అతన్ని పశ్చాత్తాపం పీక్కుతినింది. విరామ సమయంలో అతను బ్రిజాలొవ్‌వద్దకు వెళ్లి, కాసేపు తచ్చాడి, చివరకు ధైర్యం కూడగట్టుకొని, యిలా గొణిగినాడు:

"నేను మీమీద తుమ్మినాను సార్.... క్షమించండి.... మరి.... నేను అనుకోలేదు...."

"ఓ, యేమిటిది.... నేను మరచిపోయినాను, నీవింకా దాన్ని పట్టుకోవాల్నా?" అన్నాడు జనరల్. చిరాకుతో అతని క్రింది పెదవి వణకింది.

"మరచిపోయినానని అంటున్నాడు. కానీ ఆయన కన్నులలోని ఆ చూపు నాకు తృప్తిగా లేదు," అనుకున్నాడు చెర్వ్యకోవ్, జనరల్ వున్నవైపు అపనమ్మకంతో చూస్తూ. "నాతో మాట్లాడడం ఆయనకు యిష్టం లేదు. ఆయనకు నేను వివరించాలి, నాకా ఉద్దేశం లేదని.... అది ప్రకృతి ధర్మమని; లేకపోతే, నే నాయన మీద ఉమ్మెయ్యా అనుకున్నానని ఆయన అనుకోవచ్చు. యిప్ప డలా అనుకోక పోయినా, తరువాత అనుకోవచ్చు!..."

చెర్‌వ్యకోవ్ యింటికి పోయినప్పుడు, తన అసంస్కార ప్రవర్తను భార్యకు చెప్పినాడు. తన కథను ఆమె మరీ తేలికగా తీసుకున్నట్లు అతనికి అనిపించింది. ఆమె క్షణం సేపు ఆందోళన చెందిన మాట నిజమే, కానీ బ్రిజాలొవ్ "మన" అధికారి కాదని తెలుసుకొని ఆమె నిబ్బరం కోలుకుంది.

"అయినా, మీరు వెళ్లి క్షమాపణ చెప్పుకోవాలి. లేకపోతే, మీకు నలుగురిలో ప్రవర్తించడం తెలియదని ఆయన అనుకుంటాడు," అని ఆమె చెప్పింది.

"అదే మరి! నేను క్షమాపణ చెప్పుకోడానికి ప్రయత్నించినాను, కానీ ఆయన చిత్రంగా ప్రవర్తించినాడు. అర్థమున్న మాట మాట్లాడలేదు. పైగా, సంభాషణకు వ్యవధే లేదు."

మరుదినం చెర్‌వ్యకోవ్ తన కొత్త ఆధికారిక కోటు ధరించి, దారిలో క్రాపు చేయించుకొని, తన ప్రవర్తనను వివరించడానికి బ్రిజాలొవ్ వద్దకు వెళ్లినాడు. జనరల్ రిసెప్షన్ గదినిండా అర్జీదార్లు వుండినారు, జనరల్ కూడా వుండినాడు అక్కడ, అర్జీలు స్వీకరిస్తూ. కొద్దిమందితో మాట్లాడి, తర్వాత జనరల్ కన్ను లెత్తి చెర్‌వ్యకోవ్‌ను చూసినాడు.

"సార్, రాత్రి, 'ఆర్కేడియ' నాటకశాలలో, మీకు జ్ఞాపక ముంటుంది," అని గుమాస్తా ప్రారంభించినాడు. "నాకు — తుమ్ము వచ్చింది — మీకు క్షమాపణ — చెప్పుకున్నాను...."

"అబ్బే, అదేముందిలే!" అంటూ జనరల్ పక్కనున్న అర్జీదారునివైపు తిరిగి "యేమిటి మీ విషయం?" అన్నాడు.

"నేను చెప్పేది వినిపించుకోవడం లేదు!" అనుకొని చెర్‌వ్యకోవ్ వివర్ణుడైనాడు. "ఆయన కోపంగా వున్నా డన్నమాట.... దీన్ని యింతటితో వదలిపెట్టకూడదు.... ఆయనకు వివరించాలి...."

జనరల్ చివరి అర్జీదారుని చూసిన తర్వాత తన ప్రైవేటు గదిలోకి పోడానికి మళ్లినప్పుడు, చెర్‌వ్యకోవ్ అతని వెంటబడినాడు, యిలా గొణుగుతూ:

"క్షమించండి సార్, నా హృదయపూర్వకమైన పశ్చాత్తాపమే నాకు మిమ్మల్ని బాధించే సాహసం యిస్తున్నది...."

జనరల్ యేడ్వబోయేవానిలా ముఖం పెట్టి, అతన్ని వెళ్లిపొమ్మన్నట్లు చేయి వూపినాడు.

"అయ్యా, తమరు నన్ను పరిహాసం చేస్తున్నారు!" అంటూ అతను గుమాస్తా ముఖంమీద గది తలుపు మూసేసుకున్నాడు.

''పరిహాసమా! యిందులో వినోదం నాకేమీ కనిపించదే. ఆయనకు అర్థం కాదా? జనరల్ కూడా ఆయన. సరే, నా క్షమాపణలతో యిక ఆ పెద్దమనిషిని బాధించను. యెక్కడైనా చావనీ! ఒక ఉత్తరంముక్క రాసి పడేస్తాను, ఆయన వద్దకిక పోనేపోను! పోను — అంతే!'' అనుకున్నాడు చెర్వ్యకోవ్.

యింటికి పోతూ అలా అనుకున్నాడు అతను. కానీ ఉత్తరం రాయలేదు. యెంత ఆలోచించినా అతనికి ఉత్తరం యెలా రాయాల్నో తోచలేదు. అందువలన అతను మరుదినం జనరల్‌వద్దకు వెళ్ళవలసి వచ్చింది, పరిష్కారం చేసుకోడానికి.

జనరల్ అతనివైపు ప్రశ్నార్థకంగా చూసినప్పుడు అతను చెప్పసాగినాడు:

''నిన్న మిమ్మల్ని బాధించింది, మీరు సూచించినట్లు, మిమ్మల్ని పరిహాసించడానికి కాదు. తుమ్మి, మీకు యిబ్బంది కలిగించినందుకు మీకు క్షమాపణలు చెప్పకోడానికి వచ్చినాను.... యిక పరిహాసమంటే, అలాంటిది నా ఊహలోనే వుండదు. అంత సాహసమా నాకు! పరిహాసం చేయాలని మేము అనుకుంటే, యిక గౌరవం అనేది వుండదు.... పెద వాళ్ళపట్ల గౌరవం అనేది వుండదు....''

జనరల్‌కు ఆగ్రహంతో ముఖం కందగడ్డ అయింది. ఆవేశంతో వణకుతూ, ''దాటు బయటికి!'' అని గర్జించినాడు.

చెర్వ్యకోవ్ భయంతో కొయ్యబారి, ''యేమన్నారు?'' అని మెల్లగా గొణిగినాడు.

''దాటు బయటికి!'' అని జనరల్ మళ్ళీ అన్నాడు, కాలు నేలమీద తాడిస్తూ.

చెర్వ్యకోవ్‌కు తన లోపల యేదో పుటుక్కుమన్నట్లు అనిపించింది. అతను వాకిలిదాకా వెనక్కి అడుగులు వేసుకుంటూ పోయి, వీధిలోకి నడిచి, వీధుల్లో తిరిగినాడు; కానీ అతనికి యేమీ వినిపించనూ లేదు, కనిపించనూ లేదు. అతను యాంత్రికంగా వచ్చి యింట్లో పడినాడు, అలాగే, అధికారిక కోటుతోనే, సోఫాలో పండుకొని ప్రాణం విడిచినాడు.

1883

# ఊసరవెల్లి

కొత్త చలికోటు తొడుక్కున్న ఒచుమేలొవ్* చేతిలో ఒక కట్ట పట్టుకొని మార్కెట్ దాటినాడు. అతని వెనుక యెర్ర జుట్టు జవాను నడిచినాడు, స్వాధీనం చేసుకున్న గూస్‌బెర్రీ పండ్లు అంచుదాకా వున్న జల్లెడను మోసుకుంటూ. చుట్టూ అంతా నిశ్శబ్దం.... మార్కెట్‌లో ఒక్క పిట్ట లేదు.... చిన్న దుకాణాల, హోటళ్ల వాకిళ్లు, ఆకలి గొన్న నోళ్లలాగా, ప్రపంచంవైపు విచారపూరితంగా తెరచుకొని వున్నాయి. వాటి దగ్గర బిచ్చగాళ్లు కూడా లేరు.

హఠాత్తుగా ఒక కంఠధ్వని ఒచుమేలొవ్ చెవుల పడింది. "అయితే కరుస్తా వన్నమాట, గలీజు కుక్కా! దాన్ని వదలిపెట్టకండి, అబ్బాయిలూ! యీ రోజుల్లో కరవడం చెల్లదు. పట్టుకోండి! ఆయ్!"

---

* ఒచుమేలొవ్ అంటే వెర్రివాడు. — సం.

కుక్క మూలుగు వినిపించింది. ఒచుమేలొవ్ శబ్దం వచ్చిన దిశలో చూసినాడు. ఆతనికి కనిపించింది యిది: పిచూగిన్ అనే వర్తకుని కలప అడితీనుండి ఒక కుక్క మూడు కాళ్లమీద పరుగెత్తుకుంటూ వచ్చింది. గంజి పెట్టిన ప్రింటు చొక్కా, గుండీలు పెట్టుకోని వేస్టుకోటూ తొడుక్కున్న ఒక మనిషి దాన్ని వెంట బడినాడు. అతని దేహమంతా ముందుకు వంగింది. ఆ మనిషి తొట్రుటుకొని, కుక్క వెనక కాలు ఒకటి పట్టుకున్నాడు. మరొక మూలుగు వచ్చింది, మళ్లీ ఒక కేక: ''దాన్ని వదలిపెట్టవద్దు!'' దుకాణాలలోనుండి నిద్ర ముఖాలు వెలికి వచ్చినాయి, రెప్పపాటులో నేల యీనినట్లు కలప అడితీచుటూ జనం ప్రోగైనారు.

''శాంతి భంగంలా వుంది సార్!'' అన్నాడు జవాను.

ఒచుమేలొవ్ అటు తిరిగి, గుంపు వద్దకు నడిచినాడు. సరిగ్గా అడితీ గేటు ముందర అతనికి పైన చెప్పిన గుండీలు పెట్టుకోని వేస్టుకోటు మనిషి కనిపించి నాడు. ఆ మనిషి తన కుడిచేయి పైకెత్తి, రక్తం కారే వ్రేలును జనానికి చూపిస్తూ వుండినాడు. ''నీకు శాస్తి చేస్తాను, సైతాన్!'' అనే భావం అతని మత్తు ముఖంమీద స్పష్టంగా కనిపిస్తూవుండింది, ఆ వ్రేలు విజయ పతాక లాగ వుండింది. ఆ మనిషి కంసాలి హ్ర్యూకిన్ * అని ఒచుమేలొవ్ గుర్తించినాడు. గుంపుకు సరిగ్గా మధ్యన, ముందరి కాళ్లు దూరదూరంగా పెట్టుకొని, దోషి కూర్చొని వుంది, దేహమంతా వణకుతూ — అది తెల్లని బొరోయ్ కుక్క, కొన దేలిన ముక్కూ, వీపున పసుపురంగు మచ్చా గలది. దాని తడి కన్నులలో నిస్సహాయతా, భయమూ నిండివుండినాయి.

ఒచుమేలొవ్ గుంపులోకి తోసుకుంటూ పోయి, ''యేమి టిదంతా?'' అని అడిగినాడు. ''యేమి చేస్తున్నా విక్కడ? యెందుకు వ్రేలు యెత్తిపెటి నావు? యెవరు అరిచింది?''

హ్ర్యూకిన్ పిడికిట్లోకి దగ్గుతూ ప్రారంభించినాడు:

''నేను దారివెంట పోతూవుండినాను. మేకపిల్లలాగ మెల్లగా పోతూవుండినాను. కలప గురించి నాకు యీ మీత్రియ్ మీత్రిచ్‌లో కాస్త పని వుండింది. హఠాత్తుగా, నిష్కారణంగా, ఆ పాడుది నా వ్రేలు కరిచింది. క్షమించండి, సార్, మరి నేను పనిచేసుకునేవాణ్ణి.... నాది చాలా సున్నితమైన పని. నాకు నష్ట పరిహారం యిప్పిం

---

* హ్ర్యూహ్ర్యూ — పంది అరుపు. — సం.

చండి — బహుశా వారందాకా నే నీ(వేలు కదిలించలేకపోవచ్చు. మనం (కూర మృగాలను భరించాలని చట్టంలో లేదు గదండి, సార్. (ప్రతిదీ యిలా కరవడం మొదలుపెడితే, బతుకు దుర్భరంగా వుంటుంది....''

''ఊఁ.... సరే,'' అన్నాడు ఒచుమేలొవ్ కఠినంగా, దగ్గుతూ, కనుబొమలు ముడివేస్తూ. ''సరే, సరే.... యెవరి దీ కుక్క? దీన్ని యింతటితో వదలిపెట ను. కుక్కలను వూరిమీద వదలేవాళ్లకు బుద్ధిచెప్పాలి! నియమాలకు లోబడదలచుకోని పెద్దమనుషులమీద చర్య తీసుకోవాలి! జరిమానా పడుతుంది బద్మాష్‌కు — కుక్కలనూ, నానా రకాల పశువులనూ వీధుల్లో తిరగనివ్వడమంటే యేమిటో వానికి తెలియజెప్తాను! యేది యేద్దైందీ వానికి చూపిస్తాను!'' అతను జవానువైపు తిరుగుతూ కొనసాగించినాడు: ''ఎల్దీరిన్, యిది యెవరి కుక్కో కనుక్కో, రిపోర్టు తయారు చెయ్. కుక్కను వెంటనే తుదముటి ంచాలి. యిది పిచ్చి కుక్కేమో.... యెవరి దీ కుక్క, చెప్పండి?''

''యిది జనరల్ జిగాలొవ్ దనుకుంటాను,'' అని జనంలోనుండి ఒక గొంతు వినిపించింది.

''జనరల్ జిగాలొవ్‌దా? ఎల్దీరిన్, నా కోటు విప్పాలి.... అబ్బ, యెంత ఉక్కగా వుంది! వర్షం వచ్చేటట్లుంది.'' అతను (హ్ర్యూకిన్‌వైపు తిరిగి అన్నాడు: ''ఒక విషయం నాకు అర్థం కాలేదు — అది నిన్ను కరవడం యెలా జరిగింది? దానికి నీ (వేలు యెలా దొరికింది? అంత చిన్న కుక్క, నీవేమో గు(రంలా వున్నావు! నీ (వేలికి యెక్కడో చీల గీచుకొని వుంటుంది, డబ్బు సంపాయించవచ్చునని తరువాత నీకు ఆలోచన వచ్చివుంటుంది. మీ సంగతి నాకు తెలుసు — వట్టి వెధవలు!''

''అతను కాలే సిగరెట్‌తో తమాషాకు దాని మూతి కాల్చినాడు సార్. అది కాటేసింది, అదేం తెలివితక్కువదా! ఆ (హ్ర్యూకిన్ యెప్పుడూ యేదో ఒక తుంటరి పని చేస్తుంటాడు!''

''ఒరేయ్ మెల్లకన్నుగా, యెందుకురా అబద్ధాలు! నేను సిగరెట్టుతో కాల్చడం నీవు చూడలేదుగా, మరి యెందుకు అబద్ధాలు? ఈయన అన్నీ తెలిసినవాడు. యెవరు అబద్ధమాడేదీ, యెవరు పచ్చి నిజం చెప్పేదీ యీయన తెలుసుకుంటాడు. నేను అబద్ధమాడుతూ వుంటే, నన్ను కోర్టులో విచారించండి! చట్టంలో యేముంందంటే.... మానవులందరూ సమానమని. పోలీసు డిపార్టుమెంటులో నాకూ ఒక తమ్ముడున్నాడు, నీకు తెలియదేమో....''

''వాదించవద్దు!''

"ఊహూం, అది జనరల్ కుక్క కాదు," అని జవాను గంభీరంగా అభిప్రాయ ప్రకటన చేసినాడు. "జనరల్‌కు అలాంటి కుక్క లేదు. ఆయన కుక్కలన్నీ వేట కుక్కలు."

"నీకు బాగా తెలుసా?"

"బాగా తెలుసు సార్."

"నీమాట నిజమే! జనరల్ కుక్కలన్నీ ఖరీదైనవి, జాతికుక్కలు. యిదేమో – చూడు యెలా వుందో! అసహ్యపు గజ్జికుక్క! యిలాంటి వాటిని యెందుకుంచుకోవాలి యెవరైనా? నీకేమైనా తిక్కా? యిలాంటి కుక్క మాస్కోలోనో, పీటర్స్‌బుర్గ్‌లోనో వుంటే, దాన్ని యేంచేస్తారో తెలుసా? చట్టాన్ని యెవరూ పట్టించుకోరు – దాన్ని క్షణంలో లాగిపారేస్తారు. హ్ర్యూకిన్, నీకు అన్యాయం జరిగింది. నా మాట విను, దీన్ని యింతటితో వదలెయ్యవద్దు. వానికి బుద్ధి చెప్పాలి! తప్పక చెప్పాలి...."

జవాను తనలో తాను అనుకున్నట్లుగా అన్నాడు: "యింతకూ అది జనరల్‌దే కావచ్చు. చూస్తూనే చెప్పలేముగా. ఆమధ్య అలాంటి కుక్కనే ఆయన పెరట్లో చూసినాను."

"అది నిస్సందేహంగా జనరల్‌దే!" జనంలోనుండి అప్పటి ంతు వినిపించింది.

"హుం! ఎల్దిరిన్, కోటు తొడుక్కోవాలి.... చలి వేస్తున్నది. నాకు వణుకు వస్తున్నది. దీన్ని జనరల్ యింటికి తీసుకపోయి, అక్కడ అడుగు. నాకు కనిపిస్తే పంపినానని చెప్పు. బయటికి వదలవద్దని వాళ్లతో చెప్పు. యిది ఖరీదైన కుక్క కావచ్చు. ప్రతి గాడిదా దీని మూతికి సిగరెట్లు పెడితే, త్వరలో పాడౌతుంది యిది. కుక్క సుకుమారమైన జంతువు. నీవింక చెయ్యిదించు వెధవా! నీ వెధవ వ్రేలు అందరికీ చూపించడం మానుకో! తప్పు నీదే...."

"అడుగో, జనరల్ వంటమనిషి వస్తున్నాడు, అడుగుదాం.... ఓయ్, ప్రోహోర్, యిలారా. యీ కుక్కను చూడు.... మీదేనా యిది?"

"భలేవాళ్లే! యిలాంటిది మాకెప్పుడూ లేదు!"

"యిక అడగ నక్కర లేదు," అన్నాడు ఒచుమేలొవ్. "యిది దారితప్పిన కుక్క. యిక్కడ నిలబడి మాట్లాడుతుంటే యేం లాభం? దారితప్పిన కుక్క అన్నానుగా, దారి తప్పిందే. దాన్ని చంపేసి, యిక ఆ విషయం ముగించండి."

"యిది మాది కాదు," అంటూ ప్రోహోర్ కొనసాగించినాడు. "యిది జనరల్ తమ్మునిది. ఆయన యిటీవల వచ్చినాడు. మా జనరల్‌కు బొర్జాయ్ కుక్కలమీద యిష్టంలేదు. ఆయన తమ్మునికి యిష్టం...."

''యేమిటీ, జనరల్ తమ్ముడు వచ్చినాడా? వ్లదీమిర్ ఇవానిచ్?'' అంటూ ఆవేశపడినాడు ఒచుమేలొవ్, ముఖమంతా పరవశత్వపు చిరునవ్వు చేసుకొని. ''చిత్రంగా వుందే! నాకు తెలియనే లేదు. యిక్కడే వుండిపోతాడా?''

''అవును.''

''చిత్రం! ఆయన్ను చూడాలనుకున్నాను. కానీ నాకు తెలియనేలేదు. అయితే యిది ఆయన కుక్కన్న మాట? బ్రహ్మాండం! యెత్తుకో దీన్ని.... ముచ్చటైన బుల్లి కుక్క! వాని వ్రేలు కొటేసినావ్? హాహాహా! యిదుగో, వణకవద్దు! గ్ర్ – గ్ర్.... చిట్టిముండకు కోపం వచ్చింది.... ఓ, యేం కుక్క!''

ప్రొహొర్ కుక్కను పిలుచుకొని కలప అడితీనుండి వెళ్లిపోయినాడు. జనం హ్ర్యూకిన్‌ను చూసి నవ్వినారు.

''యెప్పుడో ఒకసారి నీ పని చూస్తాను!'' అంటూ ఒచుమేలొవ్ అతన్ని బెదిరించి, చలికోటు చుట్టూ కప్పుకొని మార్కెట్‌లో తన ప్రయాణం కొనసాగించినాడు.

1884

# బురఖా

ఒక సోషల్ క్లబ్బులో ధర్మకార్యార్థం విచిత్ర వేషాల నృత్య పార్టీ, లేదా స్థానిక యువతీమణుల భాషలో బాల్ పరే, యేర్పాటుచేయబడింది.

అర్ధరాత్రి పంద్రెండు గంటలు. నృత్యం చేయని మేధావులు, బురఖాలు లేనివాళ్లు — వాళ్లు అయిదుమంది వుండినారు — రీడింగు రూంలోని పెద్ద టేబుల్ చుటూ కూర్చొని, తమ ముక్కులూ, గడ్డాలూ వార్తాపత్రికలలో ముంచేసి, చదువుకుంటూ, తూగుతూ — మాస్కో, పీటర్స్‌బుర్గ్ వార్తాపత్రికల ప్రత్యేక విలేకరి మాటల్లో చెప్పాలంటే (అతను మహా ఉదార హృదయుడు) — "ధ్యానం చేస్తూ వుండినారు."

నృత్యశాలనుండి సంగీతం తేలియాడుతూ వస్తూవుండింది. వెయిటర్లు ప్లేట్ల

గలగలలతో యెడతెరపి లేకుండా వాకిలి ముందర ధణధణ వస్తూపోతూ వుండినారు. కానీ రీడింగు రూం లోపల ప్రగాఢ నిశ్శబ్దం రాజ్యం చేస్తూ వుండింది.

హఠాత్తుగా, పొగగొట్టంలోనుంచి వచ్చినట్లున్న సన్నని, ముద్ద కంఠధ్వని ఆ నిశ్శబ్దాన్ని భంగం చేసింది.

"యిక్కడ సుఖంగా వుంటుంది. రండి! యిలా."

తలుపు తెరచుకుంది. విశాలమైన భుజాలుగల దిట్టమైన వ్యక్తి, గుర్రబ్బండి వాని దుస్తులలో, టోపీలో నెమలి యీకలతో, బురఖా ధరించి, రీడింగు రూంలో ప్రవేశించినాడు. అతనివెంట బురఖాలలో వున్న యిద్దరు మహిళలూ, ట్రే పట్టుకొని ఒక వెయిటరూ వచ్చినారు. ట్రేలో ఒక లావు పానీయం సీసా, మూడు యెర్రవైన్ సీసాలూ, కొన్ని గ్లాసులూ వుండినాయి.

"యిటు. యిక్కడ చల్లగా వుంటుంది," అన్నాడు ఆ వ్యక్తి. "ట్రే టేబుల్ మీద పెటు. కూర్చోండి యువతులారా. మరి, అయ్యలారా, తమరు దయ చేయండి.... తమరు మాకు అడ్డం వున్నారు."

అతను టేబుల్‌మీదనుండి కొన్ని పత్రికలను కిందికి తోసివేస్తూ, కొద్దిగా ఊగినాడు.

"యిక్కడ పెట్టు. యిక, చదివే పెద్దమనుషులారా, మీరు బయటికి వెళ్లండి. మీ పత్రికలకూ, రాజకీయాలకూ యిది సమయంకాదు. వాటిని పక్కన పెట్టే సేయండి!"

"మీరు కొంచెం శాంతించండి, అని కోరుతున్నాను," అన్నాడు ఒక మేధావి, బురఖా వ్యక్తిని తన కళ్లద్దాలగుండా పరిశీలిస్తూ. "యిది రీడింగు రూం— పానశాల కాదు.... తాగడాని కిది స్థలం కాదు."

"యెవ రన్నారు? టేబుల్ నిలకడగా వుండదా, లేక మిద్దెకప్పు మీద పడు తుందా? చిత్రం! కానీ మాటలుపెట్టుకోడానికి నాకు తీరిక లేదు. పత్రికలు వదలేయండి.... యింతసేపూ చదివినారుగా, దానితో తృప్తిపడండి. యిప్పటికే మీకు తెలివి యెక్కువైంది, పైగా మీకు కండ్లు చెడిపోతాయి, కానీ అంతకంటె ముఖ్యమైన దేమిటంటే—నేను ఒప్పకోను, అంతే."

వెయిటర్ టేబుల్‌మీద ట్రే పెట్టి, వాకిలివద్ద నిలబడినాడు, చేతిమీద తుండుగుడ్డతో. మహిళలు వెంటనే యెర్రవైన్ పని ప్రారంభించినారు.

"యిలాంటి పానీయాలకు బదులు వార్తాపత్రికలు కోరుకునే తెలివిపరులు వున్నా రన్నమాట," అన్నాడు నెమలి యీకల వ్యక్తి, గ్లాసులో పానీయం పోసుకుంటూ.

''గౌరవనీయులారా, నా నమ్మకం యేమిటంటే, మీకు పానీయాలకు డబ్బు లేకనే వార్తాపత్రికలమీద అంత ప్రీతి. నిజమేనా? హాహా! వాళ్ళ చదవడం చూడండి.... మీ వార్తాపత్రికల్లో యేమి రాసినారు? కళ్లద్దాల మనిషీ! కాస్త వార్తలు చెప్పు! హాహా! చాలించు యిక! నీ వేషాలు కట్టిపెటు! పానీయం పుచ్చుకో!''

నెమలి యీకల మనిషి చేయి జాపి కళ్లద్దాల మనిషి చేతుల్లోని పత్రికను లాగిపారవేసినాడు. ఆ మనిషి, ముఖం మార్చిమార్చి యెర్రబడుతూ, పాలిపోతూ వుండగా, యితర మేధావులవైపు అచ్చెరువుతో నిలజూసినాడు; వాళ్ళూ అతనివైపు అలాగే చూసినారు.

''మీ స్థానం మీరు విస్మరిస్తున్నారండీ,'' అని అతను అరిచినాడు. ''రీడింగు రూంను మీరు కల్లుదుకాణంగా మారుస్తున్నారు. అల్లరి చేయడమూ, యితరుల చేతుల్లోనుండి వార్తాపత్రికలు గుంజుకోవడమూ చేయవచ్చు ననుకుంటున్నారు మీరు. యిలాంటివి నేను సహించను! మీరు యెవరితో మాట్లాడేదీ మీకు తెలియదు. నేను బాంకి మేనేజర్ జెస్త్యకోవ్‌ను.''

''నీవు జెస్త్యకోవ్ అయినా నాకేమీ లెక్క లేదు. నీ వార్తాపత్రికలను గురించి నే నేమనుకునేదీ యిదుగో చూడు.''

అంటూ ఆ మనిషి పత్రికను పైకెత్తి ముక్కలు ముక్కలుగా చింపేసినాడు.

జెస్త్యకోవ్ ఆగ్రహంతో కొయ్యబారి, గొంతులోనే గొణుక్కున్నాడు: ''యేమి టండీ దీని అర్థం? మహా చిత్రంగా వుంది, యిది, యిది.... కేవలం విస్మయకరం!''

''ఓ, కోపం వచ్చింది వీరికి!'' అంటూ ఆ మనిషి పకపక నవ్వినాడు. ''అమ్మ బాబోయ్, నా కెంత భయంగా వుందని! నా కాళ్ళ యెలా వణకుతున్నాయో చూడండి! గౌరవనీయులైన పెద్దమనుషులారా, నేను చెప్పేది వినండి. హాస్యాలు అటుంచి, నాకు మీతో మాట్లాడాలని లేదు.... యీ యువతులతో నేను ఒంటిగా వుండదల చుకున్నాను, నేను ఖుషీ చేసుకోవాలి. కనుక, దయయుంచి, యిబ్బంది కలిగించ కుండా, వూరక వెళ్లండి. అదుగో వాకిలి. మిస్టర్ బెలెబూహిన్! దాటు బయటికి! యెందు కలా మోర యెత్తుతున్నావ్? నేను వెళ్లమంటే, వెళ్లాలి! పరుగు పుచ్చుకో, నిన్ను గెంటెయ్యక ముందే.''

''యేమన్నావ్?'' అని అడిగినాడు అనాథ శరణాలయం కోశాధికారి బెలెబూహిన్, జేవురించిన ముఖంతో, భుజాలు కుదిస్తూ. ''నాకు అర్థం కావడం లేదు. ఒక పొగరుబోతు గదిలో దూరి, హఠాత్తుగా నానా హంగామా ప్రారంభించినాడు.''

"యేమన్నావ్? పొగరుబోతనా!" గద్దించినాడు నెమలి యీకల మనిషి, కోపంతో వివశుడై, టేబుల్‌మీద పిడికిళ్లతో బాదుతూ; ప్లేటులోని గ్లాసులు యెగిరిపడినాయి. "నీవు యెవరితో మాట్లాడుతున్నావో తెలుసా? నాకు బురఖా వుందని, నీ యిష్టం వచ్చినట్లు అనవచ్చు ననుకున్నావు గదూ. నీవు గర్విష్ఠివి కాదూ! నేను బయటికి దాటమంటే దాటాలి! బాంకి మేనేజరు కూడా వెళ్లాలి. మొత్తం మూక అంతా వెళ్లండి. ఒక్క వెధవ కూడా గదిలో వుండకూడదు! ఊం, లేవండి — మీ పందుల దొడ్డికి మీరు వెళ్లండి."

"ఆ సంగతి చూద్దాంగా," అన్నాడు జెస్త్యకోవ్, కంపించిపోతూ. ఆ కంపంతో అతని కళ్లద్దాలకే చెమట పట్టినట్లుంది. "నీకు చూపిస్తాను! ఏయ్, క్లబ్బు మేనేజర్‌ను పిలువు!"

ఒక నిముషంలో యెర్రజుట్టు క్లబ్బు మేనేజర్ వచ్చినాడు, కోటు రొమ్మున నీలం రిబ్బను ముక్క అలంకరించుకొని, నృత్యాయాసంతో గసపెడుతూ.

"దయయుంచి గది వదలండి," అంటూ అతను ప్రారంభించినాడు. "యిది తాగే స్థలం కాదు. దయచేసి అల్పాహారాల గదికి వెళ్లండి."

"నీ వెక్కడనుండి వూడిపడినా వోయ్?" అని అడిగినాడు బురఖా వ్యక్తి. "నేను నిన్ను పిలవలేదే?"

"అధిక ప్రసంగం వద్దండీ, దయచేసి వెళ్లండి."

"యిటు చూడు, మిత్రమా.... నీకు సరిగ్గా ఒక నిముషం వ్యవధి యిస్తున్నాను.... నీవు మేనేజర్‌వు గనుక, యిక్కడ ముఖ్యమైన వ్యక్తివి గనుక, యీ కళాకారులను బయటికి తోలెయ్. మా యువతీ రత్నాలకు కొత్తవాళ్ల మధ్య వుండడం యిష్టం లేదు.... వాళ్లు సిగ్గుపడుతున్నారు; మరి నేనేమో డబ్బు ఖర్చు పెట్టినాను, వాళ్ల నగ్న సౌందర్యం చూడడానికి...."

"యిది పందుల దొడ్డి కాదని యీ మొద్దుకు తెలిసినట్లు లేదు!" అని బిగ్గరగా అరిచినాడు జెస్త్యకోవ్. "యెవ్‌స్త్రాత్ స్పిరిదోనిచ్‌ని పిలవండి!"

"యెవ్‌స్త్రాత్ స్పిరిదోనిచ్!" క్లబ్బు మార్మోగింది. "యెవ్‌స్త్రాత్ స్పిరిదోనిచ్ యెక్కడ?"

పోలీసు దుస్తులలో వున్న వృద్ధుడు యెవ్‌స్త్రాత్ స్పిరిదోనిచ్ ఆలస్యం లేకుండా వచ్చినాడు.

"దయయుంచి గది వదలండి," అన్నాడు అతను కరకుగా, భీకరమైన కండ్లు మిటకరిస్తూ, రంగు వేసిన మీసాల కొనలు టకటకలాడిస్తూ.

‘‘నే నెంతగా జడుసుకున్నానని!’’ అంటూ ఆ వ్యక్తి ఉల్లాసంగా నవ్వసాగినాడు. ‘‘నిజం, దేవుని తోడు! బాప్‌రే, యెంత తమాషా అయిన ఆకారం! పిల్లి మీసాలూ, మిడిగుడ్లూ.... హాహాహా!’’

‘‘బదులు మాటలు అక్కర్లేదు!’’ గొంతెత్తి అరిచినాడు యెవ్‌స్త్రాత్ స్పిరిదోనిచ్, కోపంతో వణకిపోతూ. ‘‘బయటికి నడు, లేదా గెంటేయిస్తాను!’’

రీడింగు రూమంతా అల్లకల్లోల మైంది. యెవ్‌స్త్రాత్ స్పిరిదోనిచ్ యెర్రగా కందగడ్డలాగా అయి, కేకలు వేసినాడు, కాలు నేల తాడించినాడు. జెస్త్యకోవ్ కేకలు వేసినాడు. బెలెబూహిన్ కేకలు వేసినాడు. మేధావు లందరూ కేకలు వేసినారు. కానీ వాళ్ళ కంఠాలన్నీ బురఖా మనిషి బొంగురు ముద్ద కంఠంకింద అణగిపోయినాయి. సార్వత్రికమైన కల్లోలంలో నృత్యం ఆగిపోయి, అతిథు లందరూ నృత్యశాలలోనుండి రీడింగు రూంలోకి గుమికూడినారు.

యెవ్‌స్త్రాత్ స్పిరిదోనిచ్ దర్పం కొరకు అప్పుడు క్లబ్బు ఆవరణలో వుండిన పోలీసుల నందరినీ అక్కడికి పిలిపించి, రిపోర్టు రాయడానికి కూర్చున్నాడు.

‘‘రాసుకో!’’ అన్నాడు ముసుగు మనిషి, పేనాకింద తన వేలు దూరుస్తూ. ‘‘అయ్యో, యిక నా గతి యేమౌతుంది? పాపం నా గతి! నాబోటి అనాదను యెందుకు నాశనం చేస్తారు? హాహా! కానీండి అయితే! రిపోర్టు తయారైందా? అందరూ సంతకాలు చేసినారా? యిక చూడండి! ఒకటి, రెండు, మూడు....’’

అతను లేచి, నీల్గి నిలబడి, బురఖా లాగి పారవేసినాడు. తన కైపు ముఖం వెల్లడించి, దాని ప్రభావం వాళ్లమీద యెలా వుందో అని అందరినీ కలయజూసి, అతను కుర్చీలో మళ్లీ కూలబడి, విరగబడి నవ్వసాగినాడు. దాని ప్రభావం అసాధారణంగానే వుండింది. మేధావులు భయకంపిత దృక్కులతో ఒకరి నొకరు చూసుకొని, పాలి పోయినారు; కొంతమంది బుర్రగోక్కోవడం కూడా కనిపించింది. యెవ్‌స్త్రాత్ స్పిరిదోనిచ్ తెలియక ఘోరమైన తప్పు చేసినవానిలాగా గొంతు సవరించుకున్నాడు.

ఆ అల్లరి మనిషిని అందరూ గుర్తించినారు. అతను వంశ పారంపర్యంగా గౌరవనీయుడైన ప్యతిగోరొవ్, స్థానిక కోటీశ్వర ఉత్పత్తిదారుడు, రౌడీతనానికీ, దానశీలతకూ, స్థానిక పత్రికలు విసుగు లేకుండా నిరంతరం అన్నట్లు, విద్యాభిమానానికీ పేరుకెక్కినవాడు.

క్షణం సేపు ఆగి ప్యతిగోరొవ్ అన్నాడు: ‘‘మరి, పోతారా యిక?’’

మేధావులు నోరెత్తకుండా రీడింగు రూంలోనుండి మునిగాళ్లమీద బయటికి నడిచినారు. ప్యతిగోరొవ్ తలుపు తాళం వేసుకున్నాడు.

తరువాత యెవ్‌స్త్రాత్ ప్యతిగోరొవ్ రీడింగు రూంలోకి వైన్ తెచ్చిన వెయ్‌టర్‌ను భుజం పట్టుకొని వూపుతూ అడిగినాడు: ''అతను ప్యతిగోరొవ్ అని నీకు తెలుసు. ఒక మాటైనా నీవెందుకు చెప్పలేదు?''

''చెప్పవద్దన్నారు లెండి.''

''చెప్పవద్దన్నారు! ఒకనెల జైల్లో పెడతా నుండు దొంగవెధవా, అప్పుడు తెలుస్తుంది, చెప్పవద్దనడానికి అర్థ మేమిటో. పో అవతలికి!'' మేధావులవైపు తిరిగి అతను కొనసాగించినాడు: ''మీ రందరూ మంచి బుద్ధిమంతులయ్యా. యెంత డవ చేసినారు! ఒక్క పదినిముషాలు రీడింగు రూం వదలి వుండలేరా? సరే, అదునులో దిగినారు, యెలా బయటపడతారో మీ యిష్టం. అయ్యా, మీ పద్ధతులు నాకేమీ నచ్చలేదు, భగవంతుని సాక్షిగా చెపుతున్నాను, నాకేమీ నచ్చలేదు....''

మేధావులు కాలు నిలవకుండా క్లబ్బులో తిరిగినారు, దిగులుగా, మొగాలు దిగవేసుకొని, పశ్చాత్తాపంతో, ఒకరితో ఒకరు గుసగుసలాడుతూ, విపత్తును పసి గట్టినవాళ్లలాగా. వాళ్ల భార్యలూ, బిడ్డలూ ప్యతిగోరొవ్‌కు ''అవమానం'' జరి గిందనీ, కోపగించుకున్నాడనీ తెలిసి, మూతులు ముడుచుకొని, యిండ్లకు బయలు దేరసాగినారు. నృత్యం ఆగిపోయింది.

తెల్లవారు జామున రెండు గంటలకు ప్యతిగోరొవ్ రీడింగు రూంలోనుండి బయటికి వచ్చినాడు. అతను చిత్తుగా తాగినాడు. నృత్యశాలలోకి పోయి అతను వాద్యగాళ్ల పక్కన కూర్చొని, సంగీతం వింటూ తూగసాగినాడు. చివరకు విషాద పూరితంగా అతని తల వాలింది, గురక ప్రారంభమైంది.

''సంగీతం ఆపండి!'' అని మేనేజరు వాద్యగాళ్లకు కేకవేసినాడు. ''ష్.... యెగోర్ నీలిచ్ నిద్రపోతున్నాడు.''

''యెగోర్ నీలిచ్, మిమ్మల్ని యింటికి తీసుకెళ్ల మంటారా?'' అని బెలె బూహిన్ అడిగినాడు, కోటీశ్వరుని చెవిదాకా వంగి.

ప్యతిగోరొవ్ పెదవులు ముందుకు సాచినాడు, బుగ్గమీద వాలిన యీగను పారదోలడానికి ప్రయత్నిస్తున్నట్లు.

''మిమ్మల్ని యింటికి తీసుకెళ్ల మంటారా?'' బెలెబూహిన్ మళ్లీ అడిగినాడు. ''లేక మీ బండిని యిక్కడికి తెమ్మన మంటారా?''

''ఏయ్? యేమిటి? హా! నీవా.... యేమిటీ?''

''మిమ్మల్ని యింటికి తీసుకెళ్తాను.... వేళైంది.''

''యింటికి. నేను యింటికి పోవాలి.... నన్ను తీసుకెళ్ళు.''

సంతృప్తితో ముఖం కళకళలాడగా బెలెబూహిన్ ప్యతిగోరొవ్‌ను పట్టుకొని నిలబెట్టినాడు. యితర మేధావులు పరుగెత్తుకుంటూ వచ్చినారు, ముఖాల నిండా చిరునవ్వులతో. అందరూ కలిసి వంశపారంపర్యంగా గౌరవనీయుడైన పౌరుని పట్టుకొని, అపారమైన జాగ్రత్తతో బండిదాకా నడిపించుక పోయినారు.

''కళాకారుడు మాత్రమే, యెంతో ప్రజ్ఞ గలవాడు మాత్రమే అంతమందిని బోల్తా కొట్టించగలడు,'' అంటూ జెస్త్యకోవ్ ఉల్లాసంగా వదరుతూ వుండినాడు, కోటీశ్వరుని బండిలోకి యెక్కించేటప్పుడు. ''నాకు నిజంగా అచ్చెరువు కలిగింది యెగోర్ నీలిచ్. నేను నవ్వు పట్టలేకుండా వున్నాను, యిప్పటికీ.... హాహాహా.... మేమందరమూ ఉద్రేకపడి యెంత గొడవ చేసినాము! హాహాహా! నేను నాటకశాలలో కూడా యింతగా యెప్పుడూ నవ్వలేదంటే నమ్మండి. యెంత హాస్యకళా చాతుర్యం! యీ మరపురాని సాయంత్రం నాకు జన్మంతా జ్ఞాపకముంటుంది.''

ప్యతిగోరొవ్‌ను సాగనంపిన తర్వాత మేధావులకు సంతోషమూ, ఊరటా కలిగినాయి.

''ఆయన నాతో కరచాలనం చేసినాడు,'' అని జెస్త్యకోవ్ ఆనందాతిరేకంతో బడాయి కొట్టినాడు. ''అనగా అంతా సరిగా వుందన్నమాట. ఆయనకు కోపమేమీ లేదు.''

''అని ఆశిద్దాం!'' యెవ్‌ప్రాత్ స్పిరిదోనిచ్ నిట్టూర్చినాడు. ''అతను బద్మాష్, దుష్టుడు — కానీ మనకు ఉపకారి. జాగ్రత్తగా వుండాలి!''

# సీతాకోకచిలుక

ఓల్గ ఇవానొవ్నా మిత్రులూ, పరిచితులూ అందరూ ఆమె పెండ్లికి పోయినారు.

"అతన్ని చూడండి — అతనిలో యేదో వుంది, వుంది కదూ?" అన్నది ఆమె మిత్రులతో, భర్తవైపు తల వూపుతూ. ఒక మామూలు మనిషిని, యే విశేషమూ లేనివాణ్ణి, పెండ్లిచేసుకోడానికి తాను యెలా ఒప్పుకున్నదీ వివరించడానికి ఆమె తహతహలాడుతున్నట్లుంది.

ఆమె భర్త ఓసిప్ స్తెపానొవిచ్ దీమొవ్ డాక్టరు, సలహాదారుడనే బిరుదు గలవాడు. అతను రెండు ఆస్పత్రులలో పనిచేస్తాడు, ఒకదానిలో నాన్‌రెసిడెంట్ డాక్టరుగానూ, మరొకదానిలో శవాలు కోసేవాడుగానూ. ఉదయం తొమ్మిదినుండి పండ్రెండుదాకా ఔట్‌పేషంట్లను చూసి, తన వార్డు చూసుకునేవాడు, అపరాహ్ణం గుర్రపు ట్రాంలో రెండవ ఆస్పత్రికి వెళ్లి, అక్కడ మరణించిన రోగులను శవపరీక్ష

చేసేవాడు. అతని ప్రైవేటు ప్రాక్టీసు చాలా చిన్నది, సంవత్సరానికి సుమారు అయిదు వందల రూబుళ్లు వచ్చేది. అంతే. అతన్ని గురించి చెప్పవలసింది యింకేమీ లేదు. కానీ ఓల్గ ఇవానొవ్నా, ఆమె మిత్రులూ, పరిచితులూ మామూలు మనుషులు కాదు. వాళ్లలో ప్రతివొకరూ యేదో ఒక విధంగా విశిష్టత గలవాళ్లు, కేవలం అనామకులు కాదు, యిప్పటికే పేరు సంపాయించుకొని, కొంత ప్రసిద్ధి పొందినవాళ్లు, లేదా, యింకా ప్రసిద్ధులు కాకపోయినా, ఉజ్వలమైన భవిష్యత్తు గలవాళ్లుగా కనిపించేవాళ్లు. ఒకడు నటుడు, అతని నిజమైన నటనప్రజ్ఞ యిప్పటికే గుర్తింపు పొందింది. అతను నాజూకైనవాడు, తెలివిపరుడు, ఉచితానుచితజ్ఞుడు, మనోహరమైన వాచికం గలవాడు; అతను ఓల్గ ఇవానొవ్నాకు వక్తృత్వం నేర్పుతూ వుండినాడు. మరొకడు సంగీత నాటకాలలో గాయకుడు, లావుపాటి, సరదా అయిన మనిషి. అతను నిట్టూరుస్తూ, ఓల్గ ఇవానొవ్నాకు గట్టిగా చెప్పేవాడు, ఆమె తన్ను తాను పాడుచేసుకుంటున్నదని — ఆమె అంత సోమరి కాకపోతే, ఒక్కసారి పూనుకుంటే, మంచి గాయకురాలు అవుతుందని. వీళ్లు కాక యింకా పలువురు కళాకారులు వుండినారు. వాళ్లలో ముఖ్యుడు ర్యాబొవ్‌స్కియ్. అతను జీవిత చిత్రాలూ, జంతువులూ, ప్రకృతి చిత్రాలూ చిత్రించేవాడు. ఆ మహా అందమైన పాతికేండ్ల యువకుని చిత్రాలు ప్రదర్శనలలో పేరు తెచ్చుకున్నాయి; అతని తాజా చిత్రానికి అయిదు వందల రూబుళ్లు వచ్చినాయి. అతను ఓల్గ ఇవానొవ్నా బొమ్మలకు మెరుగులు పెట్టేవాడు; ఆమె చిత్రకళ ఒక దారికి రావచ్చునని అతను యెప్పుడూ అనేవాడు. తరువాత — ఒక సెల్లో వాద్యగాడు వుండినాడు. అతను సెల్లో "యేడ్చే" టట్లు వాయించేవాడు. తనకు తెలిసిన ఆడవాళ్లలోకెల్లా ఓల్గ ఇవానొవ్నా ఒక్కతే తనకు పక్కవాద్యం వాయించ గలిగిందని బాహాటంగా ప్రకటించేవాడు. యిక — నవలికలూ, నాటకాలూ, కథలూ రాసిన రచయిత వుండినాడు, యువకుడు, కానీ అప్పటికే ప్రసిద్ధుడు. యింకా యెవరు? ఆఁ — వసీలియ్ వసీల్‌యెవిచ్ వుండినాడు, సౌజన్యవంతుడైన భూస్వామి, ఔత్సాహిక పుస్తక చిత్రకారుడు, విన్యేట్ చిత్రాల సృష్టికర్త. అతనికి పురాతన రష్యన్ శైలిపట్లా, పురాణ గాథలపట్లా నిజమైన అభినివేశం వుండింది. అతను కాగితంమీదా, పింగాణీమీదా, గాజుమీదా అద్భుతాలు సృష్టించేవాడు. వీళ్లందరూ కళాసంపన్న, విజ్ఞానవికసిత సమాజం, అదృష్టదేవత ముద్దుబిడ్డలు, వినయశీలురూ, సుసంస్కారులూ అయినప్పటికీ, తాము జబ్బు పడినప్పుడు మాత్రమే డాక్టర్లు అనేవాళ్లు వున్నారని జ్ఞాపకం వచ్చేవాళ్లు, దీమొవ్ అనే పేరు వీళ్ల చెవులకు సీదొరొవ్, తరాసొవ్ అనే పేర్ల లాగ అతిసాదాగా విని

పిస్తుంది. వీళ్ల మధ్య దీమొవ్ పరాయివాడుగా, అక్కరలేనివాడుగా, అల్పవ్యక్తిగా కనిపించినాడు, నిజాని కతను చాలా పొడవుగా, విశాల భుజుడుగా వుండినప్పటికీ. అతని కోటు మరొకరి కోసం కుట్టినట్లుంది, అతనిగడ్డం వర్తకుని గడ్డంలాగుంది. నిజమే, అతను రచయితో, చిత్రకారుడో అయివుంటే, ఆ గడ్డం మూలంగా అతను జోలాలాగ కనిపిస్తాడని అందరూ అనేవాళ్లు.

నటుడు ఓల్గ ఇవానొవ్నాతో అన్నాడు — లేత బంగారు రంగు జుట్టుతో, తెల్లని పెళ్లికూతురు దుస్తులలో ఆమె అచ్చంగా వసంతంలో మృదు సుమ భరిత మైన సన్నని చెర్రీ వృక్షంలా వుందని.

"నేను చెప్పేది వినండి," అన్నది ఓల్గ ఇవానొవ్నా, అతని చేయి పట్టు కుంటూ. "యిది యెలా జరిగిందో తెలుసా? వినండి, నే చెప్పేది వినండి.... మా నాన్నా, దీమొవూ ఒకే ఆస్పత్రిలో పనిచేసేవాళ్ల గదూ. పాపం మా నాన్న జబ్బు పడినప్పుడు, దీమొవ్ రేయింబగలూ ఆయన మంచంపక్కనే వున్నాడు. అంత స్వార్థత్యాగం! వినండి, ర్యాబొవ్స్కియ్! మీరు వినండి రచయితా, మీకు చాలా ఆసక్తికరంగా వుంటుంది. యింకా దగ్గరికి రండి. అంత స్వార్థత్యాగం, అంత నిష్కపటమైన సానుభూతి. నేను కూడా రాత్రిళ్లు నిద్రపోలేదు, మా నాన్న దగ్గర కూర్చునేదాన్ని. ఉట్టిపాటుగా — ఆ దృఢ యువకుని హృదయం నేను చూరగొన్నాను — అంతే జరిగింది! నా దీమొవ్‌కు పరవశమైన ప్రేమ కలిగింది. విధి యెంత చిత్రంగా వుంటుంది! మా నాన్న చనిపోయిన తర్వాత దీమొవ్ అప్పు డప్పుడు నన్ను చూడడానికి వచ్చేవాడు, అప్పుడప్పుడు బయట కలుసుకునేవాళ్లం. ఒక రోజు — యేం జరిగిందనుకున్నారు — హఠాత్తుగా, చాటునుండి రాయి విసరినట్లు, పెండ్లి ప్రతిపాదన చేసినాడు! ఆ రాత్రంతా యేడ్చినాను, నాకు కూడా పిచ్చిప్రేమ కలిగింది. యిప్పుడు చూస్తే, నేను పెండ్లైన స్త్రీని. అతనిలో యేదో బలీయమైనది, శక్తివంతమైనది, మొండిది, యేదో వుంది, కదూ? అతని ముఖం యిప్పుడు కొంచెం అటు తిరిగి వుంది, వెలుతురు అతని ముఖానికి బొత్తిగా అనుకూలంగా లేదు. అతను పూర్తిగా మనవైపు తిరిగినప్పుడు, అతని నొసలు ఒకసారి చూడండి. అలాంటి నొసలును యేమంటావ్ ర్యాబొవ్స్కియ్? దీమొవ్, నిన్ను గురించి మాట్లాడు తున్నాం," అంటూ ఆమె మగన్ని కేకవేసింది. "యిలా రా! ర్యాబొవ్స్కియ్‌తో కరచాలనం చెయ్.... ఆఁ, అదీ! మీరిద్దరూ స్నేహితులుగా వుండాలి."

దీమొవ్ అమాయకంగా, సరసంగా చిరునవ్వు నవ్వుతూ ర్యాబొవ్స్కియ్‌కి చేయి అందించినాడు.

"సంతోషం," అన్నాడు అతను. "కాలేజిలో నాతోపాటు ఒక ర్యాబొవ్‌స్కీయ్ వుండేవాడు. అతను మీకేమీ బంధువు కాదనుకుంటాను."

## II

ఓల్గ ఇవానొవ్నాకు యిరవై రెండేండ్లు, దీమొవ్‌కు ముప్పై ఒకటి. పెండ్లి అయిన తర్వాత వాళ్ల జీవితం అద్భుతంగా వుండింది. ఓల్గ ఇవానొవ్నా తానూ, తన మిత్రులూ వేసిన రేఖాచిత్రాలు డ్రాయింగురూం గోడల నిండా పెట్టేసింది, ఫ్రేములతోనూ, ఫ్రేములు లేకుండానూ; పియానోచుట్టూ, ఫర్నిచర్‌చుట్టూ చైనా గొడుగులూ, చిత్రకారుల శ్టాండులూ, రంగురంగుల వస్త్రాలూ, బాకులూ, చిన్న విగ్రహాలూ, ఫోటోలూ కళాత్మకమైన కలగూరగంపగా పెట్టింది. భోజనాల గదిలో ఆమె చౌక రంగుల పటాలూ, తాట బూట్లూ, కొడవండ్లూ గోడకు వ్రేలదీసి, మూలన కొడవలీ, గునపమూ పెట్టి, భోజనాల గదికి రష్యన్ వాతావరణం కల్పించింది. పడక గది కప్పునూ, గోడలనూ ఆమె నల్లని బట్టతో కప్పి, గది గుహలా కనిపించేటట్లు చేసి, మంచాలకుపైన వెనిస్ లాంపు వ్రేలగట్టి, వాకిలివద్ద గండ్రగొడ్డలి పట్టుకున్న బొమ్మను పెట్టింది. యువ దంపతులు అందమైన గూడు యేర్పరచుకున్నారని అందరూ అన్నారు.

ఓల్గ ఇవానొవ్నా రోజూ ఉదయం పదకొండింటికి లేచి, పియానో వాయించేది, లేదా, యెండ కాస్తూవుంటే, తైలవర్ణాలతో చిత్రాలు వేసేది. పండ్రెండు దాటిన కాసేపటికి ఆమె తన దర్జీవద్దకు వెళ్లేది. ఆ దంపతులకు డబ్బు చాలా కొద్దిగా, వాళ్ల అవసరాలకు బొటాబొటిగా చాలినంత మాత్రమే వుండింది; మరి ఆమె నిత్యం కొత్త దుస్తుల్లో పసందుగా కనిపించా లంటే, ఆమే, దర్జీ రకరకాల యుక్తులకు దిగవలసి వచ్చేది. వాళ్లు యెన్నోసార్లు కేవలం అద్భుతాలు సాధించేవాళ్లు — పాత అద్దకం ఫ్రాకూ, కాసిన్ని సిల్కు ముక్కలూ, లేసూ కలిపి పరమ సమ్మోహనకరమైనదాన్ని సృష్టించేవాళ్లు — అది దుస్తు గాదు, స్వప్న సౌందర్యం, అనిపించేటట్లు. దర్జీవద్దనుండి ఓల్గ ఇవానొవ్నా మామూలుగా తన మిత్రురాలైన ఒక నటివద్దకు వెళ్లేది. అక్కడ వుండగా యేదైనా మొదటి రాత్రి ప్రదర్శనకో, యెవరి "ఉపకారార్థ"మైనా యిచ్చే ప్రదర్శనకో టికెట్లు సంపాయించడానికి ప్రయత్నించేది. నటివద్దనుండి ఆమె ఒక కళాకారుని స్టుడియోకు వెళ్లేది, లేదా

చిత్రాల ప్రదర్శనకు వెళ్లేది, అక్కడనుండి యెవరైనా ప్రసిద్ధ వ్యక్తి వద్దకు వెళ్లేది, ఆ వ్యక్తిని తన యింటికి ఆహ్వానించడానికో, లేక మర్యాదార్థమో, లేక వూరక పిచ్చాపాటీ మాట్లాడడానికో. ప్రతిచోటా ఆమెకు సరదా అయిన హార్దిక స్వాగతం లభించేది, తన మంచితనం గురించీ, మధుర ప్రవర్తన గురించీ, అసాధారణత్వం గురించీ నమ్మకం కలిగించబడేది.... ప్రసిద్ధులనీ, గొప్పవాళ్లనీ ఆమె యెవరిని అంటుందో వాళ్లు ఆమెను తమలో ఒకరినిగా, తమతో సమానురాలినిగా స్వీకరించేవాళ్లు; ఆమెకు గల ప్రజ్ఞలతో, అభిరుచితో, మనఃపరిపాకంతో ఆమె యేదైనా గొప్పది సాధించగలదు, తన ప్రతిభను అన్ని మార్గాలలో వృధా చేయకపోతే, అని వాళ్లు అనేవాళ్లు. ఆమె పాడుతుంది, పియానో వాయిస్తుంది, తైలవర్ణాలతో చిత్రిస్తుంది, మట్టితో బొమ్మలు చేస్తుంది, ఔత్సాహిక నాటకాలలో నటిస్తుంది — యివన్నీ చేసేది యెలా పడితే అలా కాదు, నిజమైన ప్రజ్ఞతో. ఆమె యేది చేసినా సరే, లాంపులు తయారుచేసినా, ముస్తాబైనా, కేవలం యెవరికైనా టై కట్టినా, అది కళాత్మంగా, అందంగా, మనోహరంగా తయారయ్యేది. కానీ, అన్నిటికంటె యెక్కువగా ఆమె ప్రజ్ఞ కొట్టవచ్చినట్లు కనపడేది యెక్కడంటే, ప్రసిద్ధ వ్యక్తులతో మెరుపు మైత్రి చేసుకొని, వాళ్లతో సన్నిహితంగా మెలగగల ఆమె సామర్థ్యంలో. యెవరైనా యే కొంచెమైనా ప్రసిద్ధిబడసినా, లేక పదిమంది నోళ్లలో పడినా, మరుక్షణమే ఆమె అతనితో యెలాగో పరిచయం పుట్టించుకొని, వెంటనే మైత్రి చేసుకొని, అతన్ని తన యింటికి ఆహ్వానించేది. కొత్త పరిచయం కలిగిన ప్రతిసారీ ఆమెకు మహా ముఖ్యమైన దినం. ప్రఖ్యాతులను ఆమె ఆరాధించేది, వాళ్లను చూసి గర్వించేది, వాళ్లను గురించి ప్రతి రాత్రీ కలగనేది. ప్రసిద్ధుల పట్ల ఆమెకు దాహంలాంటిది వుండింది, ఆ దాహం యెన్నడూ తీరేది కాదు. పాత మిత్రులు అదృశ్యమై, విస్మృత మయ్యేవాళ్లు, వాళ్ల స్థానంలోకి కొత్తవాళ్లు వచ్చేవాళ్లు, కానీ త్వరలో వాళ్లతో కూడా ఆమెకు విసుగు కలిగేది, లేదా ఆశాభంగం కలిగేది, ఆమె కొత్త మిత్రుల కొరకు, కొత్త ప్రసిద్ధుల కొరకు తహతహతో వెదకడం ప్రారంభించేది, వాళ్లు దొరికినప్పుడు యితర్ల కోసం వెదకేది. యెందుకు?

నాలుగు, అయిదు గంటలమధ్య ఆమె యింటివద్ద భర్తతో కలిసి భోంచేసేది. అతని సరళత్వమూ, లోకజ్ఞానమూ, ప్రసన్నతా ఆమెకు పరవశత్వం కలిగించేవి. ఆమె పదేపదే యెగిరి అతని మెడచుట్టూ చేతులు వేసి, అతనిమీద ముద్దులు కురిపించేది.

''నీవు విజ్ఞునివి దీమొవ్, ఉదాత్త మనస్కునివి,'' అనేది ఆమె. ''కానీ,

నీలో ఒక తీవ్రమైన లోపంవుంది. నీకు కళలలో బొత్తిగా ఆసక్తి లేదు. సంగీతాన్నీ, చిత్రలేఖనాన్నీ నీవు పూర్తిగా ఉపేక్షిస్తావు.''

''అవి నాకు అర్థం కావు,'' అన్నాడు అతను నమ్రతతో. ''నా జీవితమంతా నేను ప్రకృతిశాస్త్రంలోనూ, వైద్యశాస్త్రంలోనూ కృషిచేసినాను; కళల విషయం యెత్తుకోడానికి నాకు యెప్పుడూ తీరిక లేదు.''

''అది దారుణం, దీమొవ్!''

''యెందుకు? నీ మిత్రులకు ప్రకృతిశాస్త్రం గురించీ, వైద్యశాస్త్రం గురించీ యేమీ తెలియదు; దానికి నీవు వాళ్లను నిందించవే. యెవరి అభిరుచులు వాళ్లవి. నాకు ప్రకృతి చిత్రాలూ, సంగీత నాటకాలూ అర్థం కావు, కానీ నేననుకునే దేమంటే: కొంతమంది తెలివిపరులు తమ యావజ్జీవితాలూ వాటికి అర్పిస్తున్నారు, మరికొంత మంది తెలివిపరులు వాటికొరకు అపారమైన డబ్బు ఖర్చుపెడుతున్నారు. కనుక అవి అవసరం అయివుండాలి. నాకు అవి అర్థం కావు; కానీ అంతమాత్రాన నేను వాటిని ఉపేక్షిస్తున్నానని అర్థం కాదు.''

''నీ నిష్కపటమైన చేయి వొత్తనీ!''

భోజనం తర్వాత ఓల్గ ఇవానొవ్నా మిత్రుల యిండ్లకు వెళ్లేది, తరువాత నాటకశాలకో, సంగీతశాలకో వెళ్లి, అర్ధరాత్రి తర్వాత గానీ యింటికి వచ్చేది కాదు.

బుధవారం సాయంత్రాలు ఆమె యింటివద్ద అతిథులను స్వీకరించేది. అప్పుడు పేకాట గానీ, నృత్యం గానీ వుండేది కాదు, అందరూ కలిసి కళలతో పొద్దుబుచ్చే వాళ్లు. సుప్రసిద్ధ నటుడు వాచికాభినయం చేసేవాడు, గాయకుడు పాడేవాడు, చిత్రకారులు ఓల్గకు గల అసంఖ్యాకమైన ఆల్బంలలో బొమ్మలు గీసేవాళ్లు, సెల్లో వాద్యగాడు సెల్లో వాయించేవాడు, గృహిణి స్వయంగా రేఖా చిత్రాలు గీసేది, మట్టితో బొమ్మలు చేసేది, పక్క వాద్యాలు వాయించేది. వాచికానికీ, జంత్రానికీ, గాత్రానికీ మధ్యన వాళ్లు సాహిత్యం గురించీ, నాటకశాల గురించీ, చిత్ర కళ గురించీ మాట్లాడుకునేవాళ్లు, చర్చించుకునేవాళ్లు. వాళ్లలో ఆడవాళు వుండరు; యెందుకంటే, నటీమణులూ, తన దర్జీ తప్ప, ఆడవాళ్లందరూ తృణ ప్రాయులనీ, విసుగు పుట్టిస్తారనీ ఓల్గ ఇవానొవ్నా అభిప్రాయం. ప్రతి బుధవారమూ, వాకిలి గంట వాగినప్పుడల్లా ఆమె విజయోత్సాహపు ముఖంతో ''అతనే!'' అనేది; కొత్తగా ఆహ్వానింపబడిన యెవరో ఒక ప్రసిద్ధునికి సంకేతం ఆ సర్వనామం. దీమొవ్ యెప్పుడూ డ్రాయింగురూంలో వుండడు, అతను యెవరికీ జ్ఞాపకం కూడా వుండేవాడు కాదు. కానీ, సరిగ్గా పదకొండున్నరకు భోజనాల గదిలోకి వెళ్లే

వాకిలి తెరచుకునేది, దీమొవ్ వాకిట్లో ప్రత్యక్షమై, తన ప్రసన్న, సౌజన్యపు చిరు నవ్వుతో, చేతులు రుద్దుకుంటూ,

"భోజనానికి రండి," అనేవాడు.

అందరూ భోజనాల గదిలోకి వరుసగా వచ్చేవాళ్లు. ప్రతిసారీ వాళ్ల కండ్లకు అవే పదార్థాలు కనిపించేవి: రొయ్యలూ, పంది మాంసం, లేదా దూడ మాంసం, చేపలూ, చీజూ, చేపగుడ్లూ, ఊరబెట్టిన పుట్టగొడుగులూ, వోద్కా, రెండు జాడీల వైనూ.

"ఓ, నాగృహ సార్వభౌమా!" అని ఓల్గ ఇవానొవ్నా పరవశత్వంతో చేతులు నలుపుకుంటూ అనేది. "నీవు కేవలం మోహనమూర్తివి! అందరూ యిలా చూడండి యితని నొసలు! దీమొవ్, నీ పార్శ్వ రేఖ మాకు చూపించు. చూడండి అందరూ — బెంగాల్ వ్యాఘ్రంలాంటి ముఖం, లేడిపిల్ల లాంటి సాధు, దయార్ద్ర ముఖ భంగిమ! ఓ, నా వజ్రాల గని!"

అతిథులు దీమొవ్‌వైపు చూపులు విసరి, "నిజంగా మంచివాడే యితను," అనుకుంటూ భోంచేసేవాళ్లు, కానీ కాసేపట్లో అతన్ని మరచిపోయి, నాటకశాల గురించీ, సంగీతం గురించీ, చిత్రకళ గురించీ మాట్లాడుకుంటూ వుండేవాళ్లు.

యువ దంపతులు ఆనందంగా వుండినారు, వాళ్ల జీవితం సాఫీగా నడిచింది. నిజమే, వాళ్ల మధుమాసపు మూడవ వారం అంత ఆనందంగా గడవలేదు; నిజాని కది విషాదంగా వుండింది. దీమొవ్‌కు ఆస్పత్రిలో ఎరుసిపెలాస్ అనే జబ్బు అంటు కొని, అతను ఆరు రోజులు మంచంలో వుండవలసి వచ్చింది, అందమైన నల్లని జుట్టు అడుగుకు కత్తిరించుకోవలసి వచ్చింది. ఓల్గ ఇవానొవ్నా అతని మంచం పక్కన కూర్చొని తీవ్రంగా యేడ్చింది; కానీ అతనికి కొంచెం నయమైన తర్వాత అతని తలకు తెల్లని గుడ్డ కట్టి, అరబ్బుగా అతని వర్ణ చిత్రం వేయసాగింది. యిద్దరికీ అది మహా తమాషాగా వుండింది. అతను పూర్తిగా కోలుకొని మళ్లీ ఆస్పత్రికి పోవడం ప్రారంభించిన మూడు రోజులకు అతనికి కొత్త దౌర్భాగ్యం సంభవించింది.

'నాకు అదృష్టం లేదు బుజ్జీ," అన్నాడు అతను ఆమెతో ఒకనాడు భోజనంవద్ద. "యీ రోజు నాలుగు శవాలు కోయవలసి వచ్చింది. నాకు ఒకేసారి రెండు వేళ్లు తెగినాయి. యింటికి వచ్చినాక మాత్రమే గమనించినాను."

ఓల్గ ఇవానొవ్నాకు భయమైంది. అతను చిరునవ్వు నవ్వి, అది చాలా స్వల్ప విషయమనీ, శవపరీక్షలో చాలాసార్లు తనకు చేతులు తెగినాయనీ చెప్పినాడు.

“నేను పనిలో లీనమై పోతాను బుజ్జీ, అప్పుడు నా కేదీ జ్ఞాపకముండదు.”

చీము కూడుతుందేమో అని ఓల్గ ఇవానొవ్నా ఆందోళన చెందింది, అది జరగకుండా వుండాలని ప్రతి రాత్రీ భగవంతుని ప్రార్థించింది. ప్రమాదం లేకుండా అది గడచిపోయింది. విషాద స్పర్శా, ఆందోళన స్పర్శా లేని పాత ఆనందమయ ప్రశాంత జీవితం మళ్లీ మొదలైంది. వర్తమానం అద్భుతంగా వుంది, త్వరలో వసంతం రాబోతున్నది, ఆమడ దూరాననుండి చిరునవ్వులు విరజిమ్ముతూ, వంద ఆహ్లాదాలు వాగ్దానం చేస్తూ. యీ ఆనందం అనంతంగా కొనసాగుతుంది. ఏప్రిల్, మే, జూన్ మాసాలు మాస్కోకు చాలా దూరాన గ్రామీణ గృహంలో గడుపుతారు, అక్కడ షికార్లూ, రేఖాచిత్రాలూ, చేపలవేటా, కోకిలలూ వుంటాయి, తరువాత జూలైనుండి శరదృతువు దాకా వోల్గనదిమీద కళాకారుల విహారయాత్ర వుంటుంది; ఆ యాత్రలో ఓల్గ ఇవానొవ్నా తప్పకుండా పాల్గొంటుంది. ఆమె అప్పటికే ప్రయాణానికి రెండు ముతక నూలు దుస్తులు తయారుచేసుకుంది, రంగులూ, కుంచెలూ, కాన్వాసూ, కొత్త పాలెట్ కొనింది. ఆమె చిత్రలేఖనం యెలా సాగేదీ చూడడానికి ర్యాబొవ్స్కియ్ దాదాపు రోజూ ఆమె యింటికి వచ్చేవాడు. ఆమె తన కృషిని అతనికి చూపించినప్పుడు, అతను జేబులలోకి లోతుగా చేతులు దూర్చి, పెదవులు బిర్రుగా బిగబట్టి, మూల్గుతూ యిలా అనేవాడు:

“ఊం, ఊం.... అది సాయంకాలపు వెలుగు కాదని ఆ మేఘం మొత్తుకుంటు న్నది. అగ్రరంగం కాస్త గజిబిజిగా వుంది; యిక, యేదో వెలితి వుంది — యేమి టంటే, మీకు తెలుసుగా.... ఆ గుడిసె నలగదొక్కబడి, దీనంగా శోకిస్తున్నట్లుంది.... ఆ మూలన వెలుతురు తగ్గిస్తే మేలు. అయినా, మొత్తంమీద యిది అంత అధ్వా న్నంగా లేదు.... నాకు సంతృప్తిగా వుంది.”

అతను యెంత నిగూఢంగా మాట్లాడితే అంత సులభంగా అతని భావం ఓల్గ ఇవానొవ్నాకు అర్థమయ్యేది.

## III

విట్ సోమవారంనాడు సాయంత్రం దీమొవ్ బయటికి వెళ్లి, తన భార్యకు తీసుకపోవడానికి కొన్ని మిఠాయిలూ, తినుబండారాలూ కొన్నాడు. అతను ఆమెను చూడక రెండు వారాలైంది, ఆమె లేని వెలితి అతనికి చాలా బాధగా వుండింది.

రైలులోనూ, తరువాత చిక్కని చెట్లమధ్య ఆమె యిల్లు కనుక్కోడానికి వెదకే టప్పుడూ అతనికి కడుపులో పేగులు పీకినాయి; రాత్రికి భార్యతో కలిసి తీరికగా భోంచేయవచ్చుననీ, తరువాత పడకమీద వాలిపోవచ్చుననీ అతను కలలుగన్నాడు. చేపగుడ్లూ, చీజూ, కాల్చిన చేపలూ గల పొట్లం చూసి అతను ఊరట పొందినాడు.

అతను యిల్లు కనుక్కొని గుర్తుపట్టేటప్పటికి పొద్దు గూకింది. వయసు మళ్లిన పనిమనిషి అతనితో చెప్పింది, అమ్మగారు యింట్లో లేరనీ, కాసేపట్లో రావచ్చుననీ. యిల్లు మహా అనాకర్షణీయమైన కట్టడం, యెత్తులేని కప్పు, గోడలకు చౌకబారు కాగితం, నేల హెచ్చుతగ్గులుగా వుంది యెక్కడ చూసినా తెరపలతో, గదులు మూడే వున్నాయి. ఒక గదిలో ఒక మంచం వుండింది. మరొక గదిలో కాన్వాసులూ, రంగు కుంచెలూ, మురికి కాగితం ముక్కా, కుర్చీలమీదా, కిటికీలలోనూ మగవాళ్ల కోట్లూ, టోపీలూ వుండినాయి. మూడవ గదిలో దీమొవ్‌కు ముగ్గురు కొత్తవాళ్లు కనిపించినారు — యిద్దరు గడ్డాల చామన చాయవాళ్లు, మూడవవాడు శుభ్రంగా క్షౌరం చేసుకున్న లావుపాటి మనిషి, నటుడై వుంటాడు. టేబుల్‌మీద సమొవార్‌లో నీళ్లు మరుగుతున్నాయి.

నటుడు దీమొవ్‌వైపు అయిష్టంగా చూసి, బొంగురు గొంతుతో అడిగినాడు: "యేం పని? ఓల్గ ఇవానొవ్నాను చూడడానికా? ఒక నిముషం ఆగండి, వస్తుంది."

దీమొవ్ కూర్చొని కాచుకున్నాడు. ఒక చామన చాయ మనిషి నిద్రమత్తు నిర్లిప్తతతో అతనివైపు చూస్తూ, కప్పులో టీ పోసుకొని, "టీ తాగుతారా?" అని అతన్ని అడిగినాడు.

దీమొవ్‌కు ఆకలిగానూ, దప్పిగానూ వుండింది; కానీ తన ఆకలి తీవ్రతను తగ్గించడం యిష్టం లేక అతను టీ వద్దన్నాడు. కాసేపట్లో అడుగుల సవ్వడీ, పరిచితమైన నవ్వూ వినిపించినాయి. తలుపు ధణేల్ మన్నది, ఓల్గ ఇవానొవ్నా గదిలోకి దూకింది, పెద్ద టోపీతో, చేతిలో ఒక పెట్టెతో. ఆమె వెనుక, యెరుపెక్కిన చెక్కిళ్లతో, పొంగి పొరలే ఉత్సాహంతో ర్యాబొవ్‌స్కియ్ వచ్చినాడు, పెద్ద గొడుగూ, మడత కుర్చీ పట్టుకొని.

"దీమొవ్!" కేకవేసింది ఓల్గ ఇవానొవ్నా, సంతోషంతో జేవురించిన ముఖంతో. తలా, చేతులూ అతని రొమ్ముకు ఆనించి, "దీమొవ్!" అని మళ్లీ అన్నది. "నీవే గదూ! యిన్నాళ్లు నీవెందుకు రాలేదు? యెందుకు చెప్పు? యెందుకు చెప్పు?"

"యెప్పుడు వచ్చేది బుజ్జీ? నాకు యెప్పుడూ తీరిక వుండదు. యెప్పుడైనా తీరిక వుంటే, అనుకూలమైన రైలు వుండనే వుండదు."

"ఓ, నిన్ను చూడడం యెంత ఆనందంగా వుందని! రాత్రంతా నీవు కలలో వచ్చినావు, రాత్రంతా. నీకేమైనా జబ్బో, యేమో అని భయమైంది. ఓ, నీవు యెంత బంగారు బాబువో! యిప్పుడు నీవు రావడం యెంత అదృష్టమో తెలుసా? నీవు నా ముక్తిదాతవు! నీవొక్కనివే నన్ను రక్షించగలవానివి," అంటూ ఆమె నవ్వుల మధ్య కొనసాగించింది, మగని టై విప్పుతూ, మళ్లీ కట్టుతూ. "స్టేషన్‌లోని టెలిగ్రాఫ్ ఆపరేటర్‌ది పెండ్లి — చికెల్‌దేయెవ్ అతని పేరు. అందమైన కుర్ర వాడు, మొద బ్బాయి కాదులే, అతని ముఖంలో యేదో స్థిరత్వమూ, పట్టుదలా కనిపిస్తాయి. వరాంజియన్ యువకుని చిత్రం వేయడానికి అతన్ని కూర్చోమనవచ్చు. వేసవికి యిక్కడికి వచ్చిన మా బృంద మందరికీ అతనంటే యిష్టం, అతని పెండ్లికి వస్తామని మాట యిచ్చినాము.... అతను డబ్బు లేనివాడు, ఒంటరివాడు, బిడియస్తుడు, అతనికి సానుభూతి చూపకపోవడం మహా పాపం. చర్చిలో ప్రార్థన అవుతూనే పెండ్లి, చర్చినుండి అందరూ నేరుగా పెండ్లికూతురు యింటికి పోతారు.... వనమూ, పక్షుల పాటలూ, గడ్డిమీద యెండ పొడలూ, మరే, తళ తళలాడే పచ్చని గడ్డిమీద రంగుల పొడలలా మేము అందరమూ — ఓ, అపూర్వంగా వుంటుంది, ఫ్రెంచి ఎక్స్‌ప్రెషనిస్టుల చిత్రంలా. మరి, దీమొవ్, చర్చిలో నేను యే బట్టలు వేసుకోవాలి?" అన్నది ఓల్గ ఇవానొవ్నా విషాదం ఓడే ముఖం పెట్టి. "నా కిక్కడ యేమీ లేవు, యేమే గాని లేవు. బట్టలు లేవు, పూలు లేవు, గ్లౌలు లేవు.... నీవే నన్ను రక్షించాలి! నన్ను రక్షించడానికే భగవంతుడు నిన్ను పంపినాడు. నా ప్రేమ మూర్తివి గదూ, నాతాళం చెవులు తీసుకొని యింటికి వెళ్లి, బట్టల బీరువాలోని లేత యెరుపు దుస్తు పట్టుకరా. నీకు తెలుసు అది, యెదురుగ్గా వ్రేలాడుతుంటుంది.... యిక, సామాన్ల గదిలో నేలమీద రెండు అట్ట పెట్టెలు వుంటాయి. పైది మూత తీస్తే అందులో అన్నీ సిల్కు ముక్కలే కనిపిస్తాయి, రకరకాలవి, వాటి అడుగున పూలు కనిపిస్తాయి. పూలన్నీ జాగ్రత్తగా, మహా జాగ్రత్తగా తీసుకో, నలిగిపోకుండా జాగ్రత్త, నా బంగారు కొండా, వాటిలో యేదైనా ఒకటి నేను యేరుకుంటానులే తరువాత. మరి, నాకొక జత గ్లౌలు కొనుక్కురా."

"సరే," అన్నాడు దీమొవ్. "రేపు వెళ్లి పంపిస్తాలే."

"రేపా?" అన్నది ఓల్గ ఇవానొవ్నా, కొయ్యబారిన ముఖంతో అతనివైపు చూస్తూ. "రేపు నీవు వేళకు రావడం సాధ్యం కాదు! మొదటి రైలు రేపు ఉదయం తొమ్మిదికి బయలుదేరుతుంది, పెండ్లి పదకొండుకు. వద్దు నా బంగారు బుజ్జీ, నీ వివాళే వెళ్లాలి, వెళ్లక తప్పదు! రేపు స్వయంగా నీవు రాలేకపోతే, అన్నీ యెవరి

తోనైనా పంపు. వెళ్ళు యిక.... రైలు కాసేపట్లో వస్తుంది. ఆలస్యం చేయవద్దు, బాబూ.''

''సరే.''

''నిన్ను పోనివ్వడం నాకెంత బాధగా వుందని!'' అన్నది ఓల్గ ఇవానొవ్నా; ఆమె కండ్లలో నీరుబికింది. ''టెలెగ్రాఫ్ ఆపరేటర్‌కు మాట యివ్వడం యెంత తెలివి తక్కువ!''

దీమొవ్ ఒక బిస్కట్ కొరుక్కొని, ఒక గ్లాసు టీ దిగమింగి, వినమ్రంగా చిరునవ్వు నవ్వి, స్టేషన్‌కు వెళ్ళినాడు. చేపగుడ్లూ, చీజూ, కాల్చిన చేపలూ భోజనమైనాయి ఆ యిద్దరు చామన చాయ మనుషులకూ, లావుపాటి నటునికీ.

## IV

ఒక ప్రశాంతమైన జూలై వెన్నెల రాత్రి ఓల్గ ఇవానొవ్నా వోల్గా స్టీమర్ డెక్కుమీద నిలుచుకొని, కాసేపు నీళ్లవైపూ, కాసేపు మనోహరమైన నదీ తీరం వైపూ చూస్తున్నది. ఆమె పక్కన ర్యాబొవ్‌స్కియ్ నిలబడి చెపుతున్నాడు, ఆ నీళ్ల మీద కనిపించే నల్లని నీడలు నీడలు కాదనీ, అవొక స్వప్నమనీ, అన్నీ మరచిపోవడం, మరణించడం, ఒక స్మృతిగా మారిపోవడం మంచిదనీ — మన జీవితాలు వ్యర్థమనీ, ఉన్నతమైన, శాశ్వతమైన, బ్రహ్మానందకరమైన దేదో మరొకటి వుందనీ మనకు తెలియజేసే యీ మిలమిలలాడే యింద్రజాల సౌందర్యపు నీళ్లచేతా, యీ అనంతమైన ఆకాశంచేతా, యీ శోకభర, విచారపూరిత నదీ తీరాలచేతా పరివేష్టింపబడి, ఒక స్మృతిగా మారిపోవడం మంచిదనీ. గతం తృణప్రాయం, భవిష్యత్తు వుత్తది, మళ్లీ యెన్నటికీ రాబోని యీ అనిర్వచనీయమైన రాత్రి కూడా త్వరలో అంత మౌతుంది, అనంత కాలంలో కలిసిపోతుంది — కనుక యెందుకు బతకడం?

ఓల్గ ఇవానొవ్నా కాసేపు ర్యాబొవ్‌స్కియ్ గొంతూ, కాసేపు రాత్రి నిశ్శబ్దమూ వింటూ, తనలో తాను అనుకొన్నది, తాను అమరజీవిననీ, తన కెప్పటికీ మరణం వుండదనీ. యింతవరకు తాను చూసిన దేనితోనూ పోలిక లేని యీ తళుకులీనే జలమూ, యీ ఆకాశమూ, యీ నది వొడ్డులూ, యీ నల్లని నీడలూ, తన ఆత్మనంతా ఆక్రమించిన యీ అకారణ ఆనందమూ, అన్నీ ఆమెకు చెప్పినాయి,

ఆమె యేనాడో ఒకనాడు గొప్ప కళాకారిణి అవుతుందనీ, యెక్కడో, ఆ దూరానికి ఆవల, వెన్నెల రాత్రికి ఆవల, అనంత అవధులలో తన విజయమూ, యశస్సూ, ప్రజానురాగమూ తనకోసం కాచుకున్నాయనీ.... దూరంలోకి దీర్ఘంగా, రెప్ప లార్చకుండా ఆమె నిలజూసినప్పుడు అక్కడ ఆమెకు జన సమూహాలూ, దీపాలూ, గంభీర సంగీతపు ధ్వనులూ, ఉత్సాహపు కేకలూ, తెల్లని దుస్తులలో తానూ, అన్ని దిక్కులనుండీ తనమీద వర్షించే పూలజల్లులూ కనిపించినట్లైంది. తన పక్కన, కమ్మీమీద ఆనుకొని, ఒక మహా పురుషుడు, మహా ప్రజ్ఞాశాలి, కారణజ న్ముడు, నిలబడివున్నాడని ఆమె అనుకొంది.... యింతవరకు అతను చేసినదంతా అద్భుతంగా, నవనవోన్మేషంగా, అసాధారణంగా వుంది, యికముందు, యేండ్లు గడిచి అతని ప్రజ్ఞ పరిణతి నందుకున్నప్పుడు, అతని కృషి యశస్కరంగా, అమేయ మైనంత గొప్పదిగా వుంటుంది, యిదంతా అతని ముఖంలోనూ, అతని ఆత్మ వ్యక్తీకరణ పద్ధతిలోనూ, ప్రకృతిపట్ల అతని వైఖరిలోనూ కనిపిస్తున్నది. నీడలనూ, సాయం సంధ్యా వర్ణాలనూ, వెన్నెల తళతళలనూ వర్ణించడానికి అతనికి ప్రత్యేకమైన సొంత భాష వుంది; ప్రకృతిమీద అతని సమ్మోహన శక్తి దాదాపు దుర్వారమైనది. అతను అందగాడు కూడా, అతను అద్వితీయుడు, అతని జీవితం, స్వతంత్రమైన, స్వేచ్ఛాయుతమైన, భవ బంధాలు లేని అతని జీవితం, విహంగమ జీవితం లాగుంది.

"చలి యెక్కుతున్నది," అన్నది ఓల్గ ఇవానొవ్నా. ఆమె వణకింది.

ర్యాబొవ్‌స్కియ్ ఆమెకు తన కోటు కప్పి, విషాద స్వరంతో అన్నాడు:

"నేను మీ అధీనంలో వున్నా ననిపిస్తున్నది. నేను మీ బానిసను. యీనాడు యేమిటి మిమ్మల్నింత సమ్మోహనకరంగా చేసింది?"

అతను యెడతెగకుండా ఆమె వైపే నిలజూస్తూవుండినాడు, యెప్పుడూ పక్కకు చూడకుండా. అతని కన్నులలో యేదో భయంకరమైనది వుండింది. అతనివైపు చూడడానికి ఆమెకు భయమైంది.

"నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను, పిచ్చిగా," అతను గుసగుస చెప్పినాడు, ఆమె చెంపదాకా వంగి. "మీరు ఊఁ అంటే చాలు, నేను బతకడం మానుకుంటాను, కళను విసర్జిస్తాను...." గొణిగినాడు అతను, ప్రగాఢంగా సంచలించిపోయి. "నన్ను ప్రేమించండి, నన్ను ప్రేమించండి...."

"అలా మాట్లాడ కండి," అన్నది ఓల్గ ఇవానొవ్నా, కన్నులు మూసు కుంటూ. "అది ఘోరం. దీమొవ్ సంగతి యేమిటి?"

"దీమొవ్ సంగతి యేమైతేనేం? దీమొవ్ సంగతి యెందుకు? దీమొవ్‌తో నాకేంపని? వోల్గ నది, చంద్రుడు, సౌందర్యం, నా ప్రేమ, నా తన్మయత్వం, కానీ దీమొవ్ వద్దు.... ఓ, నా కేమీ తెలియదు.... నా కేమీ తెలియదు.... నాకు గతం అక్కరలేదు, నాకు ఒక్క క్షణం మాత్రం యివ్వండి.... ఒక్క స్వల్ప క్షణం!"

ఓల్గ ఇవానొవ్నా గుండె ప్రచండంగా కొట్టుకుంది. ఆమె తన మగని గురించి ఆలోచించడానికి ప్రయత్నించింది, కానీ గతమంతా, తన పెండ్లీ, దీమొవూ, తన బుధవారం సాయంత్రాలూ, అంతా ఆమెకు అల్పంగా, తృణప్రాయంగా, నిస్తేజంగా, నిరర్థకంగా, మహా దూరపు విషయంగా కనిపించింది.... యేమైనా – దీమొవ్ సంగతి యేమైతేనేం? దీమొవ్ సంగతి యెందుకు? దీమొవ్‌తో తన కేంపని? దీమొవ్ అనే మనిషి నిజంగా వున్నాడా, అతను వట్టి కల కాదా?

"అతను అనుభవించిన ఆనందం అతనిలాంటి సాదా మనిషికి చాలు," అని ఆమె తనతో తాను చెప్పుకుంది, చేతులతో ముఖం కప్పుకుంటూ. "అక్కడ వాళ్ళు నన్ను విమర్శించనీ, వాళ్ళు నన్ను శపించనీ, నేను నాశన మౌతాను, అవును, నాశన మౌతాను, కేవలం వాళ్ళమీద కసితో.... మనిషి ఒకసారి అన్నీ చవిచూడాలి. భగవంతుడా, యెంత భయంకరం, యెంత మనోహరం!"

"యేమంటావ్? యేమంటావ్?" గుసగుసలాడినాడు చిత్రకారుడు, ఆమె చుట్టూ చేతులు వేసి, మెల్లగా అతన్ని తోసివేయడానికి ప్రయత్నించే ఆమె చేతులను ఆత్రంగా ముద్దుపెట్టుకుంటూ. "నీవు నన్ను ప్రేమిస్తున్నావా? ప్రేమిస్తున్నావా? ఓ, యేమి రాత్రి! యెంత అనిర్వచనీయమైన రాత్రి!"

"అవును, యేమి రాత్రి!" గుసగుస మన్నది ఆమె, కన్నీళ్లతో మెరిసే అతని కన్నులలోకి చూస్తూ. తరువాత ఆమె వడిగా చూపులు పక్కకు తిప్పుకొని, అతని చుట్టూ చేతులు వేసి, అతన్ని పెదవులమీద దృఢంగా ముద్దుపెట్టుకుంది.

"యింకో నిముషంలో కీనెష్మ చేరుతాము," అని డెక్కు ఆవలివైపునుండి యెవరో అన్నారు.

బరువైన అడుగుల చప్పుడు వినిపించింది. అలా వెళ్తూవుండిన అల్పాహారశాల మనిషి అతను.

"యిదుగో," ఓల్గ ఇవానొవ్నా అతన్ని పిలిచింది, ఆనందం పట్టలేక నవ్వుతూ, యేడుస్తూ. "మాకు కాస్త వైన్ పట్టుకరా."

చిత్రకారుడు ఆందోళనతో పాలిపోయి, బెంచీమీద కూర్చున్నాడు, మెప్పూ, కృతజ్ఞతా నిండిన కన్నులతో ఓల్గ ఇవానొవ్నావైపు చూస్తూ. తరువాత అతను కండ్లు మూసుకొని, బరువైన చిరునవ్వుతో అన్నాడు:

"నేను అలసిపోయినాను."

అతను కమ్మీమీద తల మోపినాడు.

V

సెప్టెంబర్ రెండవ తేదీ వెచ్చగా ప్రశాంతంగా వుండింది, కానీ మసకగా వుండింది. ఉదయం వోల్గనదిమీద పల్చని పొగమంచు వుండింది, తొమ్మిది గంటల తర్వాత తుంపర ప్రారంభమైంది. అది వెలుస్తుందనే ఆశ యేమాత్రమూ కని పించలేదు. ఉదయ భోజనంవద్ద ర్యాబొవ్‌స్కియ్ ఓల్గ ఇవానొవ్నాతో చెప్పినాడు, చిత్రలేఖనం మహా అసంతృప్తికరమైన, విసుగు కలిగించే కళ అనీ, తాను చిత్రకారుడే కాదనీ, తనకు ప్రజ్ఞ వుందని బుద్ధిహీనులు తప్ప యెవరూ నమ్మరనీ. హఠాత్తుగా, యేమీ సూచన యివ్వకుండా అతను కత్తి తీసుకొని, తన అత్యంత విజయవంతమైన రేఖాచిత్రాన్ని చీల్చివేసినాడు. ఉదయ భోజనం తర్వాత అతను కిటికీ దగ్గర దిగులుగా కూర్చొని, నదివైపు చూసినాడు. వోల్గ యిప్పుడు తళతళ మనడం లేదు, మసకగా, నిస్తేజంగా, నిర్లిప్తంగా వుంది. విషాద, నిర్జీవ శరదృతువు సమీపిస్తున్నదని ప్రతిదీ సూచించింది. నది గట్టులమీది పచ్చని రత్నకంబళాలూ, రత్నాలలాంటి సూర్యకిరణ ప్రతిబింబాలూ, నీల స్ఫటికంలాంటి ఆకాశమూ, ప్రకృతి యొక్క సుకుమార సౌందర్యం సమస్తమూ వోల్గనుండి వొలిచివేయబడి, వచ్చే వసంతందాకా పెట్టెలో భద్రపరచబడినట్లుంది. కాకులు నదిమీద ఆడుతూ, "కావు, కావు" అంటూ నదిని ఆటపట్టించినట్లుంది. ర్యాబొవ్‌స్కియ్ వాటి కూతలు విని తనలో తాను అనుకున్నాడు: తన చిత్రకళా శక్తినంతా ఖర్చుపెట్టే సినాడు, తన ప్రజ్ఞ నశించింది, ప్రపంచంలో ప్రతిదీ ఆనవాయితీగా, సాపేక్షంగా, మతిహీనంగా వుంది, యీ స్త్రీతో తాను సంబంధం పెట్టుకొని వుండనే కూడదు.... ఒక్క మాటలో చెప్పాలంటే, అతని మనస్సు బాగా లేదు.

గదిని రెండు భాగాలుగా విభజించే దడికి ఆవల మంచంమీద కూర్చొనివుంది ఓల్గ ఇవానొవ్నా, తన అందాల లేత బంగారు జుట్టును వ్రేళ్ళతో చిక్కు తీసు కుంటూ, తాను తన యింటి డ్రాయింగురూంలో, పడకగదిలో, భర్త పఠనాల యంలో వున్నట్లు ఊహించుకుంటూ. ఊహా విహంగంమీద ఆమె నాటకశాలకు వెళ్ళింది,

తన దర్జీ వద్దకు వెళ్లింది, తన ప్రసిద్ధ మిత్రుల వద్దకు వెళ్లింది. యిప్పుడు వాళ్ళు యేం చేస్తుంటారో? వాళ్లెప్పుడైనా తనను జ్ఞాపకం చేసుకుంటారా? రుతువు మొదలైంది, తన బుధవారం సాయంత్రాల గురించి ఆలోచించవలసిన సమయం వచ్చింది. మరి దీమొవ్? ప్రియతమ దీమొవ్! తనను యింటికి రమ్మని అతను యెంత వినమ్రంగా, యెంత పసితనపు ఆక్రందనతో ఉత్తరాలలో ప్రాధేయ పడుతున్నాడు! ప్రతినెలా అతను 75 రూబుళ్లు పంపుతున్నాడు; చిత్రకారులతో తాను వంద రూబుళ్ళు బదులు తీసుకున్నానని రాస్తే, అతను మరొక వంద పంపినాడు. యెంత మంచి ఉదారుడు! ఈ యాత్రతో ఓల్గ ఇవానొవ్నా అలసిపోయింది, ఆమెకు విసుగైంది. యీ రైతులకు దూరంగా, నదిలోనుండి వచ్చే నీసు వాసనకు దూరంగా వెళ్లిపోవాలనీ, రైతుల గుడిసెలలో వుంటూ, వూరూరూ తిరుగుతూ వుండగా తనను వెంటాడే యీ అపరిశుభ్రతా భావాన్ని విదలించుకోవాలనీ ఆమెకు మనసు పీకుతున్నది. సెప్టెంబర్ యిరవైదాకా వాళ్లతో కలిసివుంటానని చిత్రకారులకు ర్యాబొవ్‌స్కియ్ మాట యిచ్చివుండకపోతే, తాము యీ రోజే వెళ్లిపోయి వుండ వచ్చు. యెంత బాగుండేది!

"భగవంతుడా," మూలిగినాడు ర్యాబొవ్‌స్కియ్. "యీ జన్మలో సూర్యుడు బయటికి వస్తాడా? యెండ లేకుండా నేను యెండలోని ప్రకృతి దృశ్యం యెలా కొనసాగించేది?"

"మబ్బులు పట్టిన ఆకాశం గల రేఖాచిత్రం నీది ఒకటి వుంది," అన్నది ఓల్గ ఇవానొవ్నా, దడి అవతలినుండి యివతలికి వస్తూ. "జ్ఞాపకం లేదూ కుడి అగ్రరంగంలో వనమూ, యెడమవ ఆవుల మందా, బాతులూ వుండేది. యిప్పుడది పూర్తిచెయ్యండి.

"మీకు పుణ్య ముంటుంది!" చిత్రకారుడు ముఖం మాడ్చుకున్నాడు. "చెయ్యండి! నేనేం చెయ్యవలసిందీ నాకు తెలియనంత మూర్ఖ ణ్ణనుకున్నావా?"

"నాపట్ల యెంతగా మారిపోయినారు!" అని ఓల్గ ఇవానొవ్నా నిట్టూర్చింది.

"మంచి పని జరిగింది!"

ఓల్గ ఇవానొవ్నాకు ఒళ్లంతా పదిరింది. ఆమె స్టౌ వద్దకు పోయి, అక్కడ యేడుస్తూ నిలుచుకుంది.

"కన్నీళ్లు కూడానా! దేనికైనా పరిమితి వుండాలి. ఆపు! నాకు యేడ్వ డానికి వెయ్య కారణాలు వున్నాయి, కానీ నేను యేడ్వడం లేదు."

"కారణాలు!" ఓల్గ ఇవానొవ్నా వెక్కిళ్ళు పెట్టింది. "ముఖ్య కారణం,

నీకు నామీద వెగటు కలిగింది. వెగటు!'' వెక్కిళ్ళు యింకా యెక్కువైనాయి. ''అసలు సత్యం యేమిటంటే, మన ప్రేమకు మీరు సిగ్గుపడుతున్నారు. చిత్రకారులు గమనిస్తారని మీరు భయపడుతున్నారు. యెలా దాగుతుందనుకున్నారు? వాళ్లకు యెప్పటినుండో తెలుసు.''

''ఓల్గ, నిన్ను ఒక్కటే కోరుతున్నాను,'' అన్నాడు చిత్రకారుడు ప్రాధేయపడుతూ. ''ఒక్కటే — నన్ను ఒంటరిగా వదలిపెట్టు. నిన్ను నేను కోరేది అంతే.''

''మరి నన్నింకా ప్రేమిస్తున్నానని ప్రమాణంచేయండి.''

''యిది చిత్రహింస!'' పండ్లు బిగబట్టి కస్సుమంటూ చిత్రకారుడు యెగిరి నిలబడినాడు. ''నేను వోల్గలో నైనా పడిచస్తాను, లేదా పిచ్చెక్కిపోతాను! నన్ను ఒంటరిగా వుండనీయండి.''

''అయితే నన్ను చంపండి కానీ, నన్ను చంపండి!'' రోదించింది ఓల్గ ఇవానొవ్నా. ''నన్ను చంపండి!''

వెక్కివెక్కి యేడుస్తూ ఆమె మళ్లీ దడి చాటుకు పోయింది. గడ్డి కప్పుమీద చినుకులు సరసర మంటున్నాయి. ర్యాబొవ్‌స్కియ్ తల అణగబట్టుకొని, గదిలో చాలాసేపు అటూ యిటూ పచారుచేసినాడు. తరువాత అతను, యెవరితోనో వాదం ముగిస్తున్నట్లు తీర్మానపు ముఖ భంగిమతో, నెత్తిన టోపీ పెట్టుకొని, తుపాకి భుజాన వేసుకొని, గుడిసెలోనుండి వెళ్లిపోయినాడు.

అతను పోయిన తర్వాత ఓల్గ ఇవానొవ్నా చాలాసేపు మంచంమీద పండుకొని యేడ్చింది. విషం తీసుకోవాలనీ, ర్యాబొవ్‌స్కియ్ తిరిగివచ్చి తాను చచ్చి పడి వుండడం చూస్తే యెంతో బాగుంటుందనీ మొదట ఆమెకు ఆలోచన వచ్చింది. కానీ కాసేపట్లోనే ఆమె ఆలోచనలు తన డ్రాయింగురూంకూ, మగని పఠనాలయానికీ పరుగెత్తినాయి. తాను దీమొవ్ పక్కన నిశ్చలంగా కూర్చొని ప్రశాంతి, పరిశుభ్రతల సుఖం అనుభవిస్తున్నట్లు ఊహించుకుంది, తరువాత నాటకశాలలో కూర్చొని మజీనీ సంగీతం వింటున్నట్లు ఊహించుకుంది. నాగరికత కొరకూ, నగర ధ్వనుల కొరకూ, ప్రసిద్ధుల కొరకూ ఆమె గుండె తన్నుకలాడింది. ఒక పల్లె స్త్రీ గుడిసెలోకి వచ్చి, తీరికగా స్టౌ వేడిచేయ నారంభించింది, వంటకు సన్నాహంగా. రాజుకునే కట్టెల వాసన వచ్చింది, పొగతో గాలికి నీలిరంగు వచ్చింది. చిత్రకారులు బురద కొట్టిన బూట్లతో, వానకు తడిసిన ముఖాలతో వచ్చి, ఒకరి రేఖాచిత్రాలు ఒకరు చూసి, దుర్వాతావరణంలో కూడా వోల్గనది కొక మనోహరత్వం వుందనుకుంటూ తమ్ము తాము ఊరడించుకున్నారు. గోడమీది చౌక గడియారం

టిక్‌టిక్ మంటూ ఆడుతున్నది. చలి యీగలు సన్నగా బుజ్‌మంటూ, దేవుని బొమ్మల పక్కన వున్న మూలన మూగినాయి; బెంచీలకింద ఊదిన ఫైళ్లచుట్టూ బొద్దింకలు పారాడుతున్నాయి....

ర్యాబొవ్‌స్కియ్ పొద్దు పొద్దు గూకే వేళ గుడిసెకు తిరిగివచ్చినాడు. అతను టోపీ టేబుల్‌మీద విసరివేసినాడు, పాలిపోయి, నీరసించి, బురద బూట్లతోనే బెంచీమీద కూలబడి, కండ్లు మూసుకున్నాడు.

''అలసిపోయినాను,'' అన్నాడు అతను. కను రెప్పలు తెరిచే ప్రయత్నంలో అతని కనుబొమలు చిటచిటలాడినాయి.

ఓల్గ ఇవానొవ్నా, అతనికి ప్రీతిపాత్రురాలు కావాలనీ, తనకు నిజంగా కోపం లేదని తెలపాలనీ తహతహలాడుతూ, అతని వద్దకు వెళ్లి, నిశ్శబ్దంగా అతన్ని ముద్దుపెట్టుకుంది, అతని లేత గోధుమరంగు జుట్టులో దువ్వెన దూర్చింది. అతని తల దువ్వాలని ఆమెకు హఠాత్తు కోరిక కలిగింది.

చల్లని వస్తువేదో తనకు తాకినట్లు అతను ఉలికిపడి ''యేమిటిది?'' అంటూ కండ్లు తెరచినాడు. ''యేమిటిది? నా జోలికి రావద్దు, నిన్ను ప్రార్థిస్తున్నాను!''

అత నామెను యెడంగా తోసి, దూరంగా జరిగినాడు. అతని ముఖంలో విసుగూ, అసహ్యమూ కనిపించినాయి ఆమెకు. సరిగ్గా అప్పుడే ఆ పల్లెస్త్రీ కాబేజి పులుసు ప్లేటు జాగ్రత్తగా రెండు చేతులతోనూ పట్టుకొని అతని దగ్గరికి వచ్చింది; ఆమె మొద్దు బొటన వ్రేళ్లు పులుసుతో తడిసి వుండడం ఓల్గ ఇవానొవ్నా గమనించింది. కడుపు చుట్టూ బిగదీసిన స్కర్టు గల అపరిశుభ్రపు పల్లెస్త్రీ, ర్యాబొవ్‌స్కియ్ అంత ఆత్రంగా యెగబడిన కాబేజి పులుసూ, గుడిసే, సరళత్వంలో, కళాత్మక అవ్యవస్థలో మొదట అంత ఆహ్లాదకరంగా కనిపించిన యీ జీవితమూ యిప్పు డామెకు దారుణంగా కనిపించినాయి. హఠాత్తు అవమానానికి గురై ఆమె నిర్లిప్తంగా అన్నది:

''కొంత కాలంపాటు మనం విడిపోవాలి, లేకపోతే వట్టి విసుగుతో మనం పోట్లాడుకుంటూం. యిదంతా నాకు వెగటుగా వుంది! యీ రోజు నేను వెళ్లిపోతాను.''

''యెలా వెళ్తావ్? రెక్క లున్నాయా?''

''యీ దినం గురువారం. తొమ్మిదిన్నరకు స్టీమర్ వస్తుంది.

''ఆఁహాఁ? ఓ, ఔను.... సరే అయితే, వెళ్లు,'' అన్నాడు ర్యాబొవ్‌స్కియ్ మెల్లగా, నాప్‌కిన్ లేనందువల్ల టవల్‌తో మూతి తుడుచుకుంటూ. ''నీకిక్కడ

నిస్సారంగా వుంది. నిన్ను ఆపడానికి ప్రయత్నించేటంత స్వార్థపరుణ్ని కాదు నేను. వెళ్లు, యిరవయ్యవ తేదీ తరువాత మళ్లీ కలసుకుందాం.''

తేలికపడిన హృదయంతో ఓల్గ ఇవానొవ్నా సామాన్లు సర్దుకోసాగింది; సంతృప్తితో ఆమె బుగ్గలు యెర్రబడినాయి. ''నిజమా? త్వరలో నేను డ్రాయింగురూంలో కూర్చోవడమూ, పడకగదిలో నిద్రపోవడమూ గుడ్డ కప్పిన టేబుల్ మీద భోం చేయడమూ నిజంగా జరుగుతాయా?'' అనుకుంది ఆమె. భుజాలమీద వున్న బరువు తొలగిపోయినట్లైంది, చిత్రకారునిమీద ఆమె కిప్పుడు కోపమేమీ లేదు.

''నా రంగులూ, కుంచెలూ నీకోసం యిక్కడ వదిలేస్తాను ర్యాబుష,'' అని ఆమె అంది. ''యేమైనా మిగిలితే నీవు వెనక్కి పట్టుకరావచ్చు.... నేను లేనప్పుడు సోమరిగా వుండవద్దు, దిగులుపడుతూ కూర్చోకు — పనిచెయ్! మంచివానివి గదూ, ర్యాబుష!''

తొమ్మిది గంటలప్పుడు అతను ఆమెను సెలవు ముద్దుపెట్టుకున్నాడు — డెక్కుమీద చిత్రకారుల ముందర ముద్దుపెట్టుకోవడం యిష్టం లేక, అని ఆమెకు గట్టి నమ్మకం. ఓడ యెక్కే వేదికదాకా అత నామెను సాగనంపినాడు. కాసేపట్లో స్టీమర్ వచ్చింది, ఆమెను యెక్కించుకొని పోయింది.

రెండున్నర రోజులకు ఆమె యిల్లు చేరింది. టోపీ, వాన కోటూ తీసివేయకుండానే, ఆందోళనవలన బరువుగా ఊపిరి తీసుకుంటూ, ఆమె డ్రాయింగురూంలోకి వెళ్లింది, అక్కడినుండి భోజనాలగదిలోకి వెళ్లింది. దీమొవ్ చొక్కాలో, వేస్టుకోటు గుండీలు పెట్టుకోకుండా, టేబుల్ వద్ద కూర్చొనివుండినాడు, ఫోర్కుమీద కత్తికి పదును పెడుతూ; అతని యెదుట ప్లేటులో వేయించిన కోడి వుంది. మగనికి యేమీ తెలపగూడదనీ, దానికి తగిన సామర్థ్యమూ శక్తీ తనకు వున్నాయనీ దృఢమైన విశ్వాసంతో ఓల్గ ఇవానొవ్నా యింట్లో ప్రవేశించింది. కానీ ఆ ప్రఫుల్ల, సాధు, ఆహ్లాదభర దరహాసమూ, అతని కన్నులలో మెరిసే సంతోషమూ చూసి, యిలాంటి మనిషిని మోసగించడం నీచమనీ, యేహ్యమనీ ఆమెకు అనిపించింది, అపనిందలు వేయడమూ, దొంగతనం చేయడమూ, హత్యలు చేయడమూ యెలా తనకు సాధ్యం కాదో, యిదీ అలాగే తనకు సాధ్యం కాదని ఆమెకు అనిపించింది. తక్షణమే ఆమె నిర్ణయానికి వచ్చింది, జరిగిందంతా అతనికి చెప్పెయ్యాలని. అతను తనను కౌగలించుకొని, ముద్దుపెట్టుకున్నదాకా వుండి, ఆమె అతనిముందు మోకాళ్లమీద వాలి, తన చేతులతో ముఖం కప్పుకుంది.

''యేమిటిది? యేమిటిది బుజ్జీ?'' అతను మృదువుగా అడిగినాడు. ''నాకోసం అంత బెంగపెట్టుకున్నావా?''

ఆమె ముఖ మెత్తింది, సిగ్గుతో కెంపువారిన ముఖం, అతనివైపు దోషిలా చూసింది, ప్రాధేయపూర్వకమైన చూపు. సిగ్గుతో, భయంతో ఆమె సత్యం చెప్ప లేకపోయింది.

''యేమీ లేదు....'' అన్నది ఆమె. ''వూరక....''

''కూర్చుందాం పద,'' అంటూ అతను ఆమెను లేవనెత్తి, టేబుల్‌వద్ద కూర్చోబెట్టినాడు. ''ఆఁ, అలా.... కాస్త కోడి మాంసం తీసుకో. నీకు ఆకలి వేస్తున్నది, బంగారు బుజ్జీ.''

ఆ సుపరిచిత వాతావరణాన్ని ఆమె ఆత్రతంగా ఆస్వాదించింది, కోడి మాంసం తినింది, అతను అపేక్షగా ఆమెను పరికిస్తూ, ఆహ్లాదంతో నవ్వుతూవుండినాడు.

## VI

చలి కాలం మధ్యలో యెప్పుడో దీమొవ్‌కు అనుమానం కలగసాగింది, తననామె మోసగిస్తున్నట్లు. తన భార్య కన్నులలోకి అతను చూడలేకపోయినాడు, స్వచ్ఛంగా లేనిది తన అంతరాత్మే అయినట్లు; ఆమెను కలుసుకున్నప్పుడు అతను సంతోషపు చిరునవ్వు నవ్వడం లేదు; ఆమెతో వీలైనంత తక్కువగా యేకాంతంగా వుండడానికి అతను తరుచుగా తన మిత్రుడు కొరొస్తెలేవ్‌ను యింటికి భోజనానికి పిల్చుక వచ్చేవాడు. కొరొస్తెలేవ్ ముడుతల ముఖం గల చిన్న మనిషి; ఓల్గ ఇవానొవ్నా అతనితో మాట్లాడినప్పుడల్లా అతను వట్టి బిడియంతో కోటు గుండీలు విప్పుకుంటూ, తగిలించుకుంటూ వుండేవాడు, తరువాత కుడిచేత్తో యెడమ మీసం మెలిపెడుతూ వుండేవాడు. భోజన సమయంలో డాక్టర్లు మధ్యాచ్ఛాదనం మరీ పైన వుంటే ఒకోసారి గుండెదడ వస్తుందనీ, లేదా యిటీవల నరాల వ్యాధులు యెక్కువగా వున్నాయనీ, లేదా రక్తక్షీణ వ్యాధితో మరణించినట్లు చెప్పబడిన ఒక రోగికి గత సాయంత్రం దీమొవ్ శవ పరీక్ష చేయగా పాంక్రియాస్ కాన్సర్ కనిపించిందనీ మాట్లాడుకునే వాళ్లు. ఓల్గ ఇవానొవ్నాకు మాట్లాడడానికి, అనగా అబద్ధమాడడానికి, అవకాశం యివ్వకుండా వుండడానికే వాళ్లు యీ వైద్యశాస్త్ర సంభాషణ జరిపినట్లుండేది. భోజనానంతరం కొరొస్తెలేవ్ పియానోవద్ద కూర్చునేవాడు, దీమొవ్ నిట్టూర్చి, చెప్పేవాడు:

"కానీ వోయ్, యేదైనా మంచిది, విషాదభరమైంది వినిపించు."

భుజాలు యెత్తి, వ్రేళ్ళు విప్పి కొరొస్తెలేవ్ కొద్ది పీకలు నొక్కి, సన్నని కంఠంతో పాట యెత్తుకునేవాడు: "యేదీ మన దేశంలో, రష్యన్ రైతు దుఃఖించని చోటు యేదీ చూపించు నాకు!" దీమొవ్ మరొకసారి నిట్టూర్చి, పిడికిలిమీద తల మోపి, ఆలోచనలో మునిగిపోయేవాడు.

యిప్పుడు ఓల్గ ఇవానొవ్నా మహా అజాగ్రత్తగా ప్రవర్తించడం ప్రారంభించింది. ప్రతి ఉదయం ఆమె భారమైన హృదయంతో నిద్రలేచి, ర్యాబొవ్స్కియ్‌మీద తనకిక ప్రేమ లేదనీ, దేవుని దయవల్ల తనకూ అతనికీ తెగిపోయిందనీ అనుకునేది. కాఫీ తాగిన తర్వాత ఆమె తనకు తాను జ్ఞాపకం చేసుకునేది, ర్యాబొవ్స్కియ్ తన భర్తను అపహరించినాడనీ, తన కిప్పుడు మగడూ లేడు, ర్యాబొవ్స్కియ్ లేడు అనీ. తరువాత ఆమెకు జ్ఞాపకం వచ్చేది, ర్యాబొవ్స్కియ్ యిప్పుడు ప్రదర్శన కొరకు పూర్తిచేస్తున్న యేదో అద్భుతమైన చిత్రం గురించి తన మిత్రులు చెప్పుకుంటున్న విషయం; అది పొలేనొవ్ శైలిలో, ప్రకృతి దృశ్యమూ సమస్యా చిత్రమూ మేళవించిన చిత్రమట; అతని స్టుడియోకు వెళ్ళివచ్చినవాళ్ళందరూ దాన్ని మైమరచి పొగడుతున్నారు. కానీ అతను తన ప్రభావంకింద యీ చిత్రం సృష్టించినాడనీ, తన ప్రభావం మూలంగా అతను అపారంగా అభివృద్ధి అయినాడనీ ఆమె తన మనస్సుకు చెప్పుకుంది. తన ప్రభావం యెంతో ఉపకారకమైనది, యెంతో వాస్తవమైనది, తాను అతన్ని వదలిపెడితే అతను భ్రష్టుపట్టిపోవచ్చు. ఆమెకు మరొకటి కూడా జ్ఞాపకం వచ్చేది: పోయినసారి అతను తన్ను చూడడానికి వచ్చినప్పుడు వెండిలాంటి దారాలు గల బూడిద రంగు కోటూ, కొత్త టై ధరించి, "నేనెలా వున్నాను?" అని మార్దవభరితమైన కంఠంతో అడిగినాడు. ఆ అందమైన కోటులో, నిడుపాటి ఉంగరాల జుట్టుతో, నీలి కన్నులతో అతను నిశ్చయంగా అందంగా వుండినాడు (కనీసం ఆమెకలా అనిపించింది), ఆమె పట్ల అతను చాలా అపేక్షగా వుండినాడు కూడా.

యివన్నీ, మరికొన్నీ జ్ఞాపకం చేసుకొని, వీటినుండి తన సొంత నిర్ధారణలు లాగి, ఓల్గ ఇవానొవ్నా బట్టలు వేసుకొని, మహా ఉద్విగ్న స్థితిలో ర్యాబొవ్స్కియ్ స్టుడియోకు పోయేది. ఆమె వెళ్ళేటప్పటికి అతను మామూలుగా మంచి ఉత్సాహంలో వుండేవాడు, తన చిత్రాన్ని తెగ మెచ్చుకునేవాడు, నిజాని కా చిత్రం చాలా బాగుండింది. అతను హాస్య మనస్థితిలో వుండేవాడు — చిలిపిగా తిరుగుతూ, గురుతరమైన ప్రశ్నలను హాస్యోక్తులతో దాటవేసేవాడు. ఓల్గ ఇవానొవ్నాకు ఆ చిత్రంమీద

యీర్ష్య కలిగింది, దానిని యేవగించుకొంది, కానీ ప్రతిసారీ దానిముందు వినయ మౌనంతో అయిదు నిముషాలు నిలుచుకొని, తరువాత గుడిలో మనుషులు నిట్టూర్చి నట్లు నిట్టూర్చుతూ, యిలా అనేది:

''అవును, యీ మాదిరి నీవెన్నడూ చిత్రించలేదు. దీన్ని చూస్తే నాకు భయమౌతున్నది.''

తరువాత ఆమె అతన్ని ప్రాధేయపడేది, తనను ప్రేమించమనీ, తనను వదలిపెట్టవద్దనీ, దురదృష్టవంతురాలైన తనను జాలిదలచమనీ. ఆమె యేడ్చేది, అతని చేతులు ముద్దుపెట్టుకునేది, అతనినుండి ప్రేమ వాగ్దానం లాగడానికి ప్రయత్నించేది, తన సత్ప్రభావం లేకుంటే అతను దారి తప్పి భ్రష్టుపడతాడని గుర్తు చేసేది. అప్పుడు, అతన్ని పూర్తిగా అస్వస్థచిత్తుని చేసి, తాను అవమానపడి, ఆమె దర్జీవద్దకో, నాటకశాల టికెట్టు కొరకు నటి మిత్రురాలివద్దకో వెళ్లేది.

అతను తన స్టుడియోలో కనిపించని రోజు ఆమె చీటీ రాసిపెట్టి పోయేది, ఆ రోజే అతను తన్ను చూడడానికి రాకపోతే తాను విషం మింగుతానని. అతను భయపడి ఆమె వద్దకు వెళ్లి, భోజనానికి ఆగేవాడు. ఆమె భర్త వున్నాడనే జంకు లేకుండా అతను అవమానకరమైన మాటలు అనేవాడు, ఆమె అతనికి బదులు వడ్డించేది. తాము ఒకరి కొకరు అడ్డం వున్నామనీ, తాము నియంతలమనీ, శత్రువులమనీ వాళ్ల కిద్దరికీ అనిపించేది, దానితో వాళ్లు కోపోద్రిక్తు లయ్యేవాళ్లు, తమ కోపోద్రేకంలో వాళ్లకు గమనం వుండేదికాదు, తమ ప్రవర్తన యెంత అసభ్యంగా వుండేదీ, కొరొస్తెలేవ్‌కు కూడా అన్నీ అర్థం కాక తప్పదనీ. భోజనం తర్వాత ర్యాబొవ్‌స్కియ్ తొందరగా సెలవు తీసుకొని వెళ్లిపోయేవాడు.

''యెక్కడికి పోతున్నావ్?'' అని హాలులో ఓల్గ ఇవానొవ్నా అతన్ని అడిగేది, ద్వేషంతో అతనివైపు చూస్తూ.

అతను ముఖం చిట్లించి, కనుబొమలు ముడివేస్తూ, తమ కిద్దరికీ తెలిసిన యేదో ఒక స్త్రీ పేరు చెప్పేవాడు; స్పష్టంగా తెలుస్తూవుంటుంది, అతను ఆమె యీర్ష్యను యెగతాళి చేస్తున్నాడనీ, ఆమెను ఉడికించడానికి ప్రయత్నిస్తున్నాడనీ. ఆమె పడకగదిలోకి పోయి, పండుకునేది. యీర్ష్యతో, కోపంతో, అవమానంతో, సిగ్గుతో ఆమె దిండు నోట గరచుకొని, బిగ్గరగా యేడ్చేది. అప్పుడు దీమొవ్ కొరొస్తెలేవ్‌ను డ్రాయింగురూంలో వదలి, పడకగదిలో అడుగుపెట్టి, బిడియపడుతూ, సంకోచపడుతూ, మెల్లగా అనేవాడు:

''యేడవాకు బుజ్జీ! యేమి లాభం? మనసులో దాచుకోవాలి. యితర్లకు తెలియనియ్యకూడదు... జరిగిందేదో జరిగిపోయిందిలే.''

అణచుకోలేని యీర్ష్యతో కణతలు అదురుతుండగా, పరిస్థితులు చక్క బెట్టుకోడానికి సమయం మించిపోలే దనుకుంటూ ఆమె లేచి కన్నీటి చారల ముఖం కడుక్కొని, పౌడరు రుద్దుకొని, అతను చెప్పిన స్త్రీ యింటికి వురికేది. ర్యాబొవ్ స్కియ్‌ని అక్కడ కానక ఆమె మరొకరి యింటికీ, మరొకరి యింటికీ పరుగు లెత్తేది.... మొదట మొదట యీ ప్రయాణాలకు ఆమె సిగ్గుపడేది, కానీ త్వరలో వాటికి అలవాటుపడింది, ఒకోసారి ఒకే సాయంత్రం తనకు తెలిసిన అందరి యిండ్లకూ వెళ్లేది ర్యాబొవ్‌స్కియ్‌ని వెదక్కుంటూ; ఆమె ఉద్దేశం వాళ్లందరికీ తెలుసు.

ఒకసారి తన మగన్నిగురించి ఆమె ర్యాబొవ్‌స్కియ్‌తో అన్నది:

''ఆ మనిషి మహౌదార్యంకింద నేను నలిగిపోతున్నాను.''

యీ నుడికారం ఆమె కెంత యింపుగా వుండిందంటే, తనకూ ర్యాబొవ్ స్కియ్‌కీ మధ్య గల ప్రణయ రహస్యం యెరిగిన చిత్రకారులలో యెవరినైనా ఆమె కలుసుకున్నప్పుడు, మగని ప్రసక్తి తెచ్చి, చేయి బలంగా వూపుతూ అనేది:

''ఆ మనిషి మహౌదార్యంకింద నేను నలిగిపోతున్నాను.''

వాళ్ల జీవిత క్రమచర్య గత సంవత్సరం లాగే నడిచింది. బుధవారం సాయంత్రాలు అతిథి సమ్మేళనాలు వుండేవి. నటుడు వాచికాభినయం చేసేవాడు, చిత్రకారులు బొమ్మలు గీసేవాళ్లు, సెల్లో వాద్యగాడు వాయించేవాడు, గాయకుడు పాడేవాడు, తప్పనిసరిగా పదకొండున్నరకు భోజనశాలలోకి పోయే వాకిలి తెరచుకునేది, దీమొవ్ చిరునవ్వుతో అనేవాడు: ''మిత్రులారా, భోజనానికి రండి.''

ముందులాగే ఓల్గ ఇవానొవ్నా గొప్పవాళ్ల కోసం వెదకేది, వాళ్లను పట్టుకునేది, అప్పటికీ తృప్తిలేక, యితర్ల కోసం వెదకేది. ముందులాగే ఆమె రోజూ రాత్రి ఆలస్యంగా యింటికి వచ్చేది; కానీ పోయిన సంవత్సరం లాగ, ఆమె యింటికి వచ్చేటప్పటికి దీమొవ్ నిద్రపోవడం లేదు, తన పఠనాగారంలో యేదో పని చేసుకుంటూ వుండేవాడు. అతను మూడుకు పండుకొని, యెనిమిదికి లేచేవాడు.

ఒక రోజు సాయంత్రం ఆమె నాటకశాలకు పోయేముందు, చివరిసారి అద్దంలో చూసుకుంటూవుండగా, దీమొవ్ ఫ్రాక్‌కోటుతో, తెల్ల టైతో పడకగదిలోకి వచ్చినాడు. అతను సాధువుగా చిరునవ్వు నవ్వి, ముందులాగ ఆమె కన్నుల్లోకి సూటిగా చూసినాడు. అతని ముఖం కళకళలాడుతూవుండింది.

''థీసీసు సమర్పించి వస్తున్నాను,'' అన్నాడు అతను, కూర్చొని మోకాళ్లవద్ద పంట్లాం ముడుతలు చేత్తో సర్దుకుంటూ.

"నెగ్గిందా?" అడిగింది ఓల్గ ఇవానొవ్నా.

"ఓ, నెగ్గదూ?" నవ్వినాడు అతను, అద్దంలో భార్య ముఖం చూడడానికి మెడ సాచుతూ — ఆమె యింకా వీపు అతనివైపుకు తిప్పే వుంది, సిగకు చివరి మెరుగులు పెడుతూ. "నెగ్గదూ?" అన్నాడు మళ్లీ అతను. "మరేం, నన్ను సాధారణ పథోలొజీ అసిస్టెంటు ప్రొఫెసర్ చెయ్యవచ్చు. చేసేటట్లే వుంది."

అతని సంతోషంలో, అతని విజయంలో ఓల్గ ఇవానొవ్నా పాలుపంచుకొనివుంటే, అతను సమస్తమూ క్షమించేవాడు, వర్తమానమూ, భవిష్యత్తూ అన్నీ, సమస్తమూ మరచిపోయేవాడు — అతని ఆనందపూర్ణ, ప్రఫుల్ల ముఖ భంగిమలో అది తేట తెల్లంగా కనిపిస్తూవుండింది. కానీ, ఆమెకు అసిస్టెంటు ప్రొఫెసర్ అంటే యేమిటో, సాధారణ పథోలొజీ అంటే యేమిటో అర్థం కాలేదు. పైగా, నాటకశాలకు వేళ మీరుతుందేమో అని ఆమె మనసు పీకుతూ వుండింది. అందువలన ఆమె యేమీ అనలేదు.

అతను కొద్ది నిముషాలు కూర్చొని, క్షమాపణపూర్వకంగా చిరునవ్వు నవ్వుతూ, బయటికి పోయినాడు.

## VII

ఆ రోజు మహా ఆందోళనకరమైన దినం.

దీమొవ్‌కు తల ప్రేలిపోతూవుండింది. అతను ఉదయ భోజనం తినలేదు, ఆస్పత్రికి పోలేదు, రోజంతా తన పఠనాగారంలోని సోఫాలో పండుకున్నాడు. ఓల్గ ఇవానొవ్నా మామూలు ప్రకారం పండ్రెండు దాటుతునే ర్యాబొవ్‌స్కియ్ వద్దకు బయలుదేరింది, తాను వేసిన రేఖా చిత్రాన్ని అతనికి చూపించడానికీ, గత దినం తనను చూడడానికి యెందుకు రాలేదని అతన్ని అడగడానికీ. తన రేఖా చిత్రం బాగలేదని ఆమెకు తెలుసు; అతన్ని పోయి చూడడానికి సాకు వుండాలనే ఆమె దాన్ని చిత్రించింది.

ఆమె వాకిలి గంట వాయించకుండా లోపలికి వెళ్లింది, హాలులో బూట్ల తొడుగులు విప్పుతుండగా, స్టుడియోలో మెత్తని అడుగుల చప్పుడూ, స్త్రీ బట్టల సవసవా ఆమెకు వినిపించినట్లైంది. ఆమె తొందర తొందరగా లోపలికి చూసినప్పుడు, ఒక గోధుమ వర్ణం స్కర్టు క్షణ కాలంపాటు మెరుపులా తళుక్కుమని

మరుక్షణంలో పెద్ద కాన్వాసు వెనుక అదృశ్యమైంది; ఆ కాన్వాసుకు పైనుండి నేలదాకా పెద్ద కాలికో గుడ్డ కప్పబడింది. అక్కడొక స్త్రీ దాక్కున్న దనడంలో సందేహం లేదు. యీ కాన్వాసు చాటున ఓల్గ ఇవానొవ్నా యెన్నిసార్లు దాక్కోలేదు! ర్యాబొవ్‌స్కియ్ నిలువునా యిబ్బందిపడిపోయినట్లు కనిపిస్తూనేవుంది. ఆమె రాకకు ఆశ్చర్యపడినట్లు అతను రెండు చేతులూ ముందుకు సాచి, బలవంతపు చిరునవ్వుతో అన్నాడు:

"ఆ — ! మీ దర్శనం ఆనందకరం! యేమిటి మీ వార్తలు?"

ఓల్గ ఇవానొవ్నా కన్నుల్లో నీరు నిండింది. ఆమెకు సిగ్గూ, అవమానమూ కలిగినాయి. ప్రాణం పోయినా తాను ఒక్క మాట కూడా మాట్లాడదు, ఆ మరొక స్త్రీ ముందర; ఆ కాన్వాసు చాటున వున్నది తనకు పోటీదారు, బొంకులాడి, బహుశా తన్ను చూసి ముసిముసి నవ్వులు నవ్వుతున్నది.

"యేమీ లేదు, నా రేఖాచిత్రం మీకు చూపిద్దా మనుకున్నాను," అన్నది ఆమె బిగ్గరగా, పిరికి గొంతుతో. ఆమె పెదవులు కంపించినాయి. "యిది ప్రకృతి దృశ్యం."

"ఆ... రేఖాచిత్రం...."

చిత్రకారుడు రేఖాచిత్రాన్ని చేతుల్లోకి తీసుకొని దానిమీద చూపులు నిలిపి, పరధ్యానంగా నడిచినట్లు నడుస్తూ అవతలి గదిలోకి పోయినాడు.

ఆమె అణకువగా అతన్ని అనుసరించింది.

"ప్రకృతి దృశ్యం, వశ్యం, నశ్యం, పశ్యం," అతను గొణుక్కున్నాడు యాంత్రికంగా.

వడివడిగా వేసిన అడుగుల చప్పుడూ, స్కర్టు సవసవా స్టుడియోనుండి వినిపించినాయి. ఆ స్త్రీ వెళ్లిపోయిందన్నమాట. ఓల్గ ఇవానొవ్నాకు బిగ్గరగా యేడ్వాలనీ, చిత్రకారుని యేదైనా బరువైనదానితో తలమీద బాది, పారిపోవాలనీ బలంగా అనిపించింది. కానీ ఆమె కండ్లనిండా నీరు గ్రమ్మింది, అవమాన భారంతో క్రుంగిపోయింది, తాను ఓల్గ ఇవానొవ్నా కానట్లూ, చిత్రకారిణి కానట్లూ, యెవరో దౌర్భాగ్యపు అల్పిష్టి మరుగుజ్జు అయినట్లూ అనిపించింది.

"నేను అలసిపోయినాను," అన్నాడు చిత్రకారుడు క్షీణ కంఠంతో, రేఖాచిత్రాన్ని చూస్తూ, తన ఆయాసాన్ని శిరఃకంపంతో పారదోలడానికి ప్రయత్నిస్తూ. "బాగానే వుంది, నిజమే, కానీ యీ రోజు ఒక రేఖాచిత్రం, నిరుడు ఒక రేఖాచిత్రం, ఒక నెలకు మరొక రేఖాచిత్రం.... మీకు విసుగు పుట్టడం లేదూ? నన్నడిగితే,

చిత్రకళ వదలేసి, సంగీతమో, మరొకటో నిష్ఠగా చేపట్టండి. మీరు చిత్రకారిణిలు కాదు, తెలుసా, మీరు గాయకురాండ్రు. ఓ — యెంతగా అలసిపోయినానో! కాస్త టీ తెమ్మంటాను, సరేనా?''

అతను గదిలోనుండి వెళ్లిపోయినాడు. అతను పరిచారకునితో మాట్లాడడం ఓల్గ ఇవానొవ్నాకు వినిపించింది. సెలవు తీసుకోవడమూ, గొడవ జరగడమూ తప్పించుకోడానికి, అన్నిటికంటె ముఖ్యంగా తాను నిగ్రహం కోల్పోయి యేడ్వడం పరిహరించడానికి, ఆమె ర్యాబొవ్‌స్కియ్ రాకముందే బూట్లు తొడుగులు తగిలించుకొని, వెళ్లిపోయింది. వీధిలో పడిన వెంటనే ఆమె స్వేచ్ఛగా వూపిరి పీల్చుకుంది. ర్యాబొవ్‌స్కియ్‌నీ, చిత్రకళనూ, స్టుడియోలో తాను అనుభవించిన దుర్భరమైన అవమాన భారాన్నీ శాశ్వతంగా కడిగేసుకున్నట్లు ఆమెకు అనిపించింది. యిది అంతం.

ఆమె తన దర్జీవద్దకు వెళ్లింది, తరువాత అప్పుడప్పుడే తిరిగివచ్చిన బర్నాయ్ వద్దకు వెళ్లింది, అక్కడినుండి సంగీతం దుకాణానికి వెళ్లింది. దారి పొడుగునా ఆమె ఆలోచిస్తూ వుండింది, ర్యాబొవ్‌స్కియ్‌కి నిర్లిప్తంగా, నిర్దాక్షిణ్యంగా, ఆత్మగౌరవ పూర్ణమైన ఉత్తరం రాయాలనీ, వసంతంలో గానీ, వేసవిలో గానీ దీమొవ్‌తో కలిసి క్రైమియాకు పోవాలనీ, అక్కడ పాత జీవితాన్ని శాశ్వతంగా ఒలిచిపారేసి, కొత్త జీవితం ప్రారంభించాలనీ.

ఆమె యిల్లు చేరేటప్పటికి బాగా ఆలస్యమైంది. కానీ, బట్టలు మార్చుకోడానికి తన గదిలోకి వెళ్లకుండా, ఆమె ఉత్తరం రాయడానికి నేరుగా డ్రాయింగు రూంలోకి వెళ్లింది. ర్యాబొవ్‌స్కియ్ తాను చిత్రకారిణి కాదని తనతో అన్నాడు, కసి తీర్చుకోడానికి యిప్పు డామె అతనితో అంటుంది, అతను ప్రతి యేడూ అదే చిత్రం చిత్రిస్తుంటాడనీ, ప్రతి రోజూ అవే విషయాలు చెప్తుంటాడనీ, అతను పతనం చెందినాడనీ, యిప్పటికి సాధించినదాన్ని మించి అతనింక యేమీ సాధించలేడనీ. తన సత్ప్రభావానికి అతను చాలా రుణపడివున్నాడనీ, యిప్పుడతని ప్రవర్తన బాగలేనందుకు కారణం యినాడు చిత్రం వెనుక దాక్కున్న అప్రతిష్ఠపు జీవుల మూలంగా తన ప్రభావం కుంటుపడడమనీ ఆమె కలప దలచుకొంది.

''బుజ్జీ,'' దీమొవ్ తన పఠనాగారంనుండి పిలిచినాడు, తలుపు తెరవకుండా. ''బుజ్జీ!''

''యేం కావాలి?''

''నా దగ్గరికి రావద్దు బుజ్జీ, వాకిలి వద్దకు రా. ఆఁ, అంతే. నాకు నిన్ననో

మొన్ననో ఆస్పత్రిలో డిఫ్తీరియా అంటుకుంది.... నాకేమీ బాగలేదు. కొరొస్తె లేవ్‌ను పిలిపించు.''

ఓల్గ ఇవానొవ్నా తన మిత్రు లందరినీ పిలిచినట్లే మగణ్ణి యింటిపేరుతో పిలిచేది. అతని పేరు ఓసిప్, అది ఆమెకు యిష్టం లేదు, యెందుకంటే అది గొగోల్ పరిచారకుని పాత్ర అయిన ఓసిప్‌నూ, అర్‌హిప్ అనే పేరుతో ఆ శబ్దానికి గల సామ్యం మూలంగా యేర్పడిన చౌక హాస్యాన్నీ ఆమెకు జ్ఞాపకం చేసేవి. కానీ యిప్పుడామె కేకవేసింది:

''ఓ — ఓసిప్, నిజమా!''

''అతన్ని పిలిపించు. నాకేమీ బాగలేదు....'' అన్నాడు దీమొవ్ గదిలోపలి నుండి. అతను సోఫాదాకా నడిచి, అక్కడ పండుకోవడం ఆమెకు వినిపించింది. ''అతన్ని పిలిపించు.'' అతని గొంతు యెక్కడో పాతాళంలోనుండి వచ్చినట్లుంది.

''యిది నిజమా?'' అనుకుంది ఓల్గ ఇవానొవ్నా. భయ కంపంతో ఆమె ఒళ్లు చల్లబడింది. ''అది ప్రమాదకరమైన వ్యాధి.''

యెందుకో తనకే తెలియకుండా ఆమె మైనపువత్తి వెలిగించి పడకగదిలోకి తీసుకపోయింది. యేమి చేయాలిసిందీ నిర్ణయించుకోడానికి ప్రయత్నిస్తుండగా ఆమెకు అద్దంలో తన రూపం కనిపించింది. పాలిపోయిన, భయం పులిమిన ముఖంతో, పప్ఫులు, పొట్టి చేతుల జాకెట్‌లో, స్కర్టుమీద విడ్డూరపు మూలల మూలల చారలతో తన రూపమే ఆమెకు ఘోరమైన వికారంగా, అసహ్యమైన జీవిగా కనిపించింది. దీమొవ్ పట్ల ఆమెకు అంతు లేని జాలి కలిగింది, తనమీద అతనికి గల అవధులు లేని ప్రేమ పట్లా, అతని తరుణ జీవితంపట్లా, చివరకు అతని ఒంటరి మంచంపట్ల కూడా — ఆ మంచంలో అతను పండుకొని చాలా కాలమైంది. అతని నిత్య సాధు, విధేయ దరహాసం ఆమెకు జ్ఞాపకం వచ్చింది. ఆమె తీవ్రంగా యేడుస్తూ, కొరొస్తెలేవ్‌కు ప్రార్థనా పూర్వకమైన ఉత్తరం రాసింది. అప్పుడు రాత్రి రెండు గంటలైంది.

## VIII

నిద్ర లేమి వలన భారమైన తలతో, దువ్వని జుట్టుతో, ముఖంమీద దోషి ముద్రతో, అతి సాదాగా కనపడుతూ, ఉదయం యేడు గంటల తర్వాత ఓల్గ ఇవానొవ్నా తన పడకగదిలోనుండి బయటికి వచ్చినప్పుడు ఒక నల్ల గడ్డం వ్యక్తి,

డాక్టరై వుంటాడు, హాలులో ఆమెను దాటిపోయినాడు. అక్కడ మందుల వాసన వేస్తూ వుండింది. కొరొస్తెలేవ్ పఠనాలయంలో వాకిట్లో నిలబడి వుండినాడు, కుడిచేతో యెడమ మీసం మెలివేస్తూ.

“క్షమించండి, మిమ్మల్ని అతని వద్దకు వెళ్ల నివ్వను,” కరకుగా అన్నాడు అతను ఓల్గ ఇవానొవ్నాతో. “మీకది అంటుకోవచ్చు. పైగా, మీరతని వద్దకు వెళ్లడంలో అర్థంలేదు. అతనికి యిపిరి పట్టింది.”

“అతనికి నిజంగా డిఫ్తీరియానా?” ఓల్గ ఇవానొవ్నా గుసగుస అడిగింది.

“అనవసరంగా అపాయం కొనితెచ్చుకొనేవాళ్లను జైలుకు పంపాలి,” కొరొస్తెలేవ్ గొణిగినాడు, ఆమె ప్రశ్నకు సమాధానం చెప్పకుండా. “అతని కెలా అంటుకుందో తెలుసా? డిఫ్తీరియా వున్న చిన్న కుర్రవాని గొంతులోని చీము అతను పీల్చినాడు. దేని కొరకు? వట్టి తెలివి తక్కువ, మతిహీనత!”

“అది చాలా ప్రమాదకరమైందా?” ఓల్గ ఇవానొవ్నా అడిగింది.

“అవును. అతనికి జబ్బు తీవ్రంగా వుందని అంటున్నారు. మనం చేయవలసిం దేమిటంటే, డాక్టరు ష్రేక్‌ను పిలిపించడం.”

పొడవు ముక్కూ, యూదు ఉచ్చారణా, యెర్ర జుట్టూ గల చిన్న మనిషి వచ్చినాడు, తరువాత ముతక జుట్టు గల యెత్తైన, వంగిన మనిషి, మత గురువులా కనిపించేవాడు, వచ్చినాడు. తరువాత అంత వయసు లేని, కళ్లద్దాలు గల, లావుపాటి, యెర్ర ముఖం మనిషి వచ్చినాడు. వాళ్లందరూ తమ సహచరుని మంచం పక్కన వంతులు వేసుకోడానికి వచ్చినారు. కొరొస్తెలేవ్ తన కావలి ముగిసిన తర్వాత యింటికి పోకుండా, ప్రేతంలా గదులు కలదిరుగుతూ వుండినాడు. పరిచారిక డాక్టర్లకు టీ చేసిపెడుతూ, నిత్యం మందుల దుకాణానికి పరుగెడుతూ వుండింది; కనుక యెవరూ గదులు శుభ్రం చేయలేదు. అంతా చాలా నిశ్శబ్దంగా, బిక్కు బిక్కు మంటూ వుండింది.

ఓల్గ ఇవానొవ్నా తన పడకగదిలో కూర్చొని, మగణ్ని మోసగించినందుకు తనను భగవంతుడు శిక్షిస్తున్నాడని మనసులో అనుకుంది. యెన్నడూ విసుగు యెరగని యీ మౌన, నిగూఢ వ్యక్తి, సౌజన్యంచేత తన వ్యక్తిత్వం క్షీణించి, లొంగిపోయి, మితిమీరిన దయవలన బలహీనపడి, యిప్పుడు మౌనంగా బాధపడుతూ సోఫాలో పండుకొని వున్నాడు. అతను ఫిర్యాదులు చేసివుంటే, కనీసం యిపిరిలో ప్రలాపించి వుంటే, అతని బాధ డిఫ్తీరియా ఒక్కటే కాదని అతని పక్కన కావలి కాచే డాక్టర్లు తెలుసుకునేవాళ్లు. వాళ్లు కొరొస్తెలేవ్‌ను అడిగివుండవచ్చు, అతనికి అంతా తెలుసు,

వూరికే కాదు అతను తన మిత్రుని భార్యవైపు అలా చూసేది, అసలు దుష్టశక్తి ఆమె అయినట్లూ, డిఫ్తీరియా కేవలం ఆమెకు సహాయకురాలు అయినట్లూ. వోల్గనదిమీది వెన్నెల రాత్రినీ, ప్రేమ వాగ్దానాలనూ, రైతు గుడిసెలోని కవితామయ జీవితాన్నీ ఆమె మరచిపోయింది, ఆమెకు జ్ఞాపక మున్నదల్లా అసహ్యమైన రొంపిలో తాను తలక్రిందులుగా దుమికినానని, శుభ్రంగా కడిగేసుకోవడం తన కెన్నటికీ సాధ్యం కానిదానిలో — అంతా వట్టి చాపల్యంచేత, తృణప్రాయమైన వినోదం కొరకు.

“నేనెంత బొంకులాడిని!” అనుకుంది ఆమె, తనకూ, ర్యాబొవ్‌స్కియ్‌కీ మధ్య వుండిన అశాంత ప్రణయం జ్ఞాపకం వచ్చి. “అదంతా నాశనం కాను!”

నాలుగు గంటలకు ఆమె కొరొస్తేలేవ్‌తో కలిసి భోంచేసింది. అతను యేమీ తినలేదు, మూతి విరుస్తూ కాస్త యెర్రవైన్ మాత్రం తాగినాడు. ఆమె కూడా యేమీ తినలేదు. ఆమె మౌనంగా దేవుని ప్రార్థించింది, దీమొవ్ తేరుకుంటే, అతన్ని మళ్లీ ప్రేమిస్తాననీ, విశ్వాసం గల భార్యగా వుంటాననీ భగవంతునికి వాగ్దానం చేసింది. తరువాత, ఒక క్షణం తన బాధలు మరచిపోయి, ఆమె కొరొస్తేలేవ్‌ను చూసి ఆశ్చర్యపడేది: “యింత ముడుతల ముఖంతో, యింత మర్యాదలు తెలియని ప్రవర్తనతో, యింత తృణప్రాయమైన, అనామక వ్యక్తిగా వుండడం యెంత విసుగో!” మళ్లీ వెంటనే ఆమెకు అనిపించేది, వ్యాధి అంటుకుంటుందన్న భయంతో తాను మగని పఠనాగారంలోకి ఒక్కసారైనా పోనందుకు భగవంతుడు యీ క్షణమే తన్ను కూల్చేస్తాడని. యిప్పు డామె మనసు నిండా వుండింది మొద్దుబారిన వ్యథా, తన జీవితం నాశనమై, దిద్దడానికి వీలులేనంతగా భ్రష్టుపట్టిందన్న నమ్మకమూ.

భోజనం తర్వాత కాసేపట్లో చీకటిపడింది. ఓల్గ ఇవానొవ్నా డ్రాయింగు రూంలోకి పోయినప్పుడు, కొరొస్తేలేవ్ సోఫాలో పండుకొని, బంగారు దారంతో కుట్టుపని చేసిన సిల్కు దిండుమీద తల పెట్టి నిద్రపోతూ వుండినాడు, “హువ్వా, హువ్వా,” అని గురకలు పెడుతూ.

డాక్టర్లు రోగివద్దకు వస్తూ పోతూ యీ క్రమ భంగాలను గమనించలేదు. డ్రాయింగురూంలో గురకలు పెట్టే వింత మనిషీ, గోడల మీద చిత్రాలూ, విడ్డూరపు ఫర్నిచరూ, తల దువ్వుకోకుండా, నలిగిన బట్టలతో యింట్లో తిరిగే యజమానురాలూ, యివన్నీ యిప్పుడు యేమాత్రమూ ఆసక్తి కలిగించజాలనివిగా వున్నాయి. ఒక డాక్టరు యెందుకో నవ్వినాడు, ఆ నవ్వు వింతగా వుండింది, అందరినీ అస్వస్థ చిత్తులను చేస్తూ.

ఓల్గ ఇవానొవ్నా మళ్లీ డ్రాయింగురూంలోకి పోయినప్పుడు, కొరొస్తెలేవ్ లేచి, సోఫామీద కూర్చొని, సిగరెట్టు తాగుతూ వుండినాడు.

అతను మెల్లగా అన్నాడు: "డిఫ్తీరియా అతని నాసా గుహలలో స్థిరపడింది. గుండెకు అప్పుడే బరువు కనపడుతున్నది. పరిస్థితి బాగలేదు."

"డాక్టరు ష్రేక్‌ను యెందుకు పిలిపించరు?" ఓల్గ ఇవానొవ్నా అడిగింది.

"పిలిపించినాము. అతనే గమనించింది డిఫ్తీరియా ముక్కు కెక్కిందని. యింతకూ ష్రేక్ యెవరు? ష్రేక్ అంటూ యెవరూ లేరు, నిజంగా. అతను ష్రేక్, నేను కొరొస్తెలేవ్, అంతే."

కాలం బాధాకరమైనంత మెల్లగా గడిచింది. ఓల్గ ఇవానొవ్నా దుస్తులతోనే, ఉదయంనుండి సర్దని మంచంమీద తూగుతూ పడివుంది. యిల్లంతా, నేలనుండి కప్పుదాకా, పెద్ద యినప దిమ్మెతో నిండినట్లు కనిపించింది; యీ దిమ్మెను తొలగిస్తే అందరికీ ఉల్లాసం కలుగుతుందని ఆమెకు అనిపించింది. ఉలిక్కిపడి లేచి, ఆమె గుర్తుకు తెచ్చుకుంది, అది యినప దిమ్మె కాదనీ, దీమొవ్ వ్యాధి అనీ.

మళ్లీ తూగుతూ, ఆమె అనుకుంది: "ప్రకృతి చిత్రం.... చిత్రం.... పాత్రం.... ష్రేక్ యెవరు? ష్రేక్, ట్రెక్.... రెక్.... క్రెక్. నా మిత్రు లందరూ యెక్కడున్నారు? మేము యిబ్బందిలో వున్నామని వాళ్లకు తెలుసా? భగవంతుడా, మమ్మల్ని రక్షించు, కనికరించు.... ష్రేక్, ట్రెక్...."

మళ్లీ యినప దిమ్మె.... కాలం అంతం లేకుండా కాళ్లీడుస్తున్నది, కింది అంతస్తులో గోడ గడియారం యెప్పుడూ గంటలు కొట్టినట్లే వున్నప్పటికీ. మాటిమాటికీ వాకిలి గంట మ్రోగుతూవుండింది, దీమొవ్ కొరకు డాక్టర్లు వస్తూ వుండినారు.... ట్రేమీద ఖాళీ గ్లాసుతో పరిచారిక గదిలోకి వచ్చింది.

"మీ పడక సర్దనా అమ్మగారూ?" అడిగింది ఆమె.

జవాబు లేకపోవడంతో ఆమె మళ్లీ వెళ్లిపోయింది. కింది అంతస్తులోని గడియారం గంటలు కొట్టింది. వోల్గనదిమీద వర్షం పడుతున్నట్లు ఓల్గ ఇవానొవ్నాకు కల వచ్చింది. మళ్లీ యెవరో గదిలోకి వచ్చినారు, కొత్తవాళ్ల లాగుంది. కానీ మరు క్షణమే ఆమె కొరొస్తెలేవ్‌ను గుర్తుపట్టి, మంచంమీద లేచి కూర్చుంది.

"యెంత ప్రొద్దయింది?" అని అడిగింది ఆమె.

"సుమారు మూడు."

"అత నెలా వున్నాడు?"

"యెలా వున్నాడా? చచ్చిపోతున్నాడని చెప్పడానికి వచ్చినాను."

అతను వెక్కిళ్ళు దిగమింగినాడు, ఆమె పక్కన మంచంమీద కూర్చొని, కన్నీళ్ళు తుడుచుకున్నాడు. ఆమెకు మొదట బుర్ర కెక్కలేదు, కానీ వెంటనే హఠాత్తుగా స్తంభించిపోయి, మెల్లగా సిలువ గుర్తు వేసుకుంది.

''చచ్చిపోతున్నాడు,'' అతను మళ్ళీ అన్నాడు బిగ్గరగా, మళ్ళీ వెక్కిళ్ళు పెట్టినాడు. ''తన్ను తాను బలి చేసుకున్నాడు గనుక చచ్చిపోతున్నాడు. శాస్త్ర విజ్ఞానానికి యెంత నష్టం!'' వ్యధతో అతను మాటలు నొక్కి పలికినాడు. ''మా అందరితో పోలిస్తే అతను గొప్పవాడు, అసాధారణుడు. యెంత ప్రజ్ఞ! మా అందరిలో యెన్ని ఆశలు రగిలించినాడు!'' నొసలు బాదుకుంటూ కొరొస్తెలేవ్ కొనసాగించినాడు. ''భగవంతుడా — అతను గొప్ప శాస్త్రజ్ఞు డయ్యేవాడు, అపురూపమైన శాస్త్రజ్ఞు డయ్యేవాడు! ఓసిప్ దీమొవ్, ఓసిప్ దీమొవ్, యెంత పని చేసినావ్? భగవంతుడా!''

వేదనతో, కొరొస్తెలేవ్ రెండు చేతులతో ముఖం కప్పుకున్నాడు.

''యెంత మహానుభావుడు!'' అతనికి యెవరిమీదనో కోపం పెరుగుతున్నది. ''యెంత స్వచ్ఛమైన, స్ఫటికం లాంటి హృదయం! మనుషులమీద యెంత దయ! యెంత అపేక్ష! శాస్త్ర విజ్ఞానానికి సేవ చేస్తూ, ఆ సేవలోనే మరణించినాడు. యెద్దులా పనిచేసినాడు, రేయింబగలూ, యెవరూ అతన్ని పాప మనలేదు. యువ కుడు, వ్యుత్పన్నుడు, రేపో మాపో ప్రొఫెసర్ కావలసినవాడు, ప్రైవేటు ప్రాక్టీసు కోసం చూడవలసి వచ్చింది, రాత్రిళ్ళు మేలుకొని అనువాదాలు చేయవలసి వచ్చింది — వీటి కోసం, యీ దౌర్భాగ్యపు పేలికల కోసం!''

కొరొస్తెలేవ్ ఓల్గ ఇవానొవ్నా వైపు యేహ్యభావంతో చూసి, బెడ్‌షీటును రెండు చేతులతో పట్టుకొని, ఆగ్రహంగా చించివేసినాడు, తప్పంతా దాని దైనట్లు.

''తన్ను తాను పాపమనలేదు, యెవరూ అతన్ని పాపమనలేదు. యీ మాటలతో యేం లాభం?''

''అవును, అతను అసాధారణమైనవాడు,'' యెవరో డ్రాయింగురూంలో గంభీర కంఠంతో అన్నారు.

ఓల్గ ఇవానొవ్నా అతనితో తాను కలిసి జీవించిన జీవితమంతా నెమరు వేసుకుంది, మొట్టమొదటినుండి, స్వల్ప వివరాలు మొదలుకొని. ఆమెకు హఠాత్తుగా మనసు కెక్కింది, తనకు తెలిసిన వాళ్ళందరితోనూ పోలిస్తే, అతను అసాధారణమైన వ్యక్తి అని, అపురూపమైన వ్యక్తి అని, మహాపురుషుడని. అతనిపట్ల స్వర్గస్థుడైన తన తండ్రి వైఖరీ, అతని సహచరులందరి వైఖరీ జ్ఞాపకం చేసుకొని, ఆమె గుర్తించింది, వాళ్ళందరూ అతన్ని భావి ప్రసిద్ధ పురుషునిగా చూడడం. గోడలూ, కప్పూ,

లాంపూ, నేలమీద కంబళీ, అన్నీ ఆమెవైపు యెకసక్కెపు చూపులు చూసినాయి, ''అవకాశం జారవిడుచుకున్నావ్!'' అని ఆమెతో చెప్పడానికి ప్రయత్నిస్తున్నట్లు. ఆమె యేడుస్తూ పడకగదిలోనుండి బయటికి వురికింది, డ్రాయింగురూంలో యెవరినో కొత్త మనిషిని దాదాపు ఢీకొని, పఠనాగారంలోని భర్తవద్ద వాలింది. అతను సోఫాలో నిశ్చలంగా పండుకొని వున్నాడు, నడుముదాకా దుప్పటి వుంది. అతని ముఖం దారుణంగా ముడుతలు పడి, చిక్కిపోయి వుంది; బతికివున్నవాళ్లలో యెప్పుడూ కనిపించని పసుపు మించిన బూడిద చాయ ముఖానికి వచ్చింది. అతని నుదురూ, నల్లని కనుబొమలూ, మామూలు చిరునవ్వూ మాత్రమే అతను దీమొవ్ అని తెలియజేస్తున్నాయి. ఓల్గ ఇవానొవ్నా అతని రొమ్మూ, నుదురూ, చేతులూ వడివడిగా తాకింది. రొమ్ము యింకా వెచ్చగా వుంది, నుదురూ, చేతులూ విపరీతమైనంత చల్లగా వున్నాయి. అరమూత పడిన కన్నులు నిలజూస్తున్నాయి, ఓల్గ ఇవానొవ్నాను కాదు, దుప్పటిని.

''దీమొవ్! దీమొవ్!'' ఆమె బిగ్గరగా పిలిచింది.

ఆమె అతనికి వివరించా లనుకుంది, జరిగిందంతా పొరపాటనీ, యింకా సర్వమూ నష్టమైపోలేదనీ, జీవితం మనోహరంగా, సంతోషమయంగా వుండే అవకాశం యింకా వుందనీ, అతను అసాధారణమైన వ్యక్తి అనీ, అపురూపమైన వ్యక్తి అనీ, మహాపురుషుడనీ, తాను అతన్ని జీవితమంతా ఆరాధిస్తాననీ, అతనిముందు మోక రిల్లుతాననీ, అతనియందు పవిత్ర భక్తిభావం కలిగి వుంటాననీ....

''దీమొవ్!'' అతని భుజం పట్టుకొని వూపుతూ ఆమె పిలిచింది, అతనిక యెప్పటికీ లేవడని ఆమెకు నమ్మకం కలగడం లేదు. ''దీమొవ్, దీమొవ్, యిటు చూడు!''

డ్రాయింగురూంలో కొరొస్తెలేవ్ పరిచారికతో చెప్తూవుండినాడు:

''అడిగే దేముంది? చర్చి వద్దకు పోయి, శరణాలయం స్త్రీలు యెక్కడ వుండేదీ అడుగు. వాళ్లు శవాన్ని శుభ్రంచేసి, అన్నీ చక్కబెడతారు — చేయవల సిందంతా వాళ్లు చేస్తారు.''

# ఇయోనిచ్

## I

ఆ పట్టణానికి కొత్తగా వచ్చినవాళ్లు అక్కడి జీవితం విసుగుగా, రోకటి పాటగా వుంటుందని ఫిర్యాదుచేస్తే, అక్కడి పాత కాపురస్తులు దాని సద్గుణాలను పేర్కొనే వాళ్లు, అది చాలా ఆసక్తికరమైన పట్టణమనీ, అక్కడ గ్రంధాలయమూ, నాటకశాలా, క్లబ్బూ వున్నాయనీ, నృత్య పార్టీలు జరుపుతారనీ, చివరి విషయంగా, అక్కడ వున్న తెలివి తేటలుగల, ఆసక్తికరమైన, ఆహ్లాదకరమైన కుటుంబాలతో పరిచయం చేసుకోవచ్చుననీ. సమస్త సంస్కృతికీ, ప్రతిభకూ ఉదాహరణగా వాళ్లు తూర్కిన్ కుటుంబాన్ని పేర్కొనేవాళ్లు.

తూర్కిన్ కుటుంబం పెద్ద వీధిలో నివసించేది, గవర్నర్ వుండే యింటి పక్కన వాళ్ల సొంత ఇంట్లో. ఆ కుటుంబ యజమాని నల్ల జుట్టూ, జులపాలూ గల లావుపాటి, అందమైన ఇవాన్ పెత్రోవిచ్ తూర్కిన్. అతను ధర్మకార్యార్థం

నాటకాలు వేయించేవాడు, వాటిలో వృద్ధ సేనానాయకుల పాత్రలు వేసేవాడు, మహా నవ్వు పుట్టించేటట్లు దగ్గేవాడు. అతని పొట్టనిండా కథలూ, సమస్యలూ, సామెతలూ వుండినాయి, అతనికి హాస్యోక్తులంటే ప్రీతి; నిజాని కతను మంచి చమత్కారి; అతని ముఖ భంగిమను చూసి అతను హాస్యమాడేదీ, నిజమాడేదీ కనుక్కోవడం అసాధ్యం. అతని భార్య వేర యోసిఫొవ్నా ఆహ్లాదకరమైన ముఖం గల బక్కపలచని మనిషి; ఆమె కండ్లద్దాలు పెట్టుకునేది, కథలూ, నవలలూ రాసేది, వాటిని ఆగంతుకులకు చదివి వినిపించడానికి యెప్పుడూ సిద్ధంగా వుండేది. వాళ్ల కొక కూతురు వుండింది, యెకతెరీనా ఇవానొవ్నా, ఆ యువతి పియానో వాయించేది. అనగా, కుటుంబంలో ప్రతి వొకరికీ యేదో ఒక ప్రజ్ఞ వుండింది. తూర్కిన్‌లు అతిథి సత్కారానికి మారుపేరు; వాళ్లు తమ ప్రజ్ఞలను తేలికగా, నిష్కపటమైన సరళత్వంతో ప్రదర్శించేవాళ్లు. పెద్ద, రాతి మిద్దె వేసవిలో యెప్పుడూ చల్లగా వుండేది; దాని వెనక కిటికీలు నీడలు నిండిన పాత తోటలోకి వుండేవి; వసంతంలో ఆ తోటలో కోకిలలు పాడేవి. యింట్లో అతిథులు వున్నప్పుడు, వంటయింట్లో పదును పెట్టే కత్తుల చప్పుడుతో యిల్లంతా మార్మోగేది, వేయించిన ఉల్లిపాయల వాసనతో తోటంతా గమాళించేది, రాత్రికి రాజ భోజనం వుంటుందని చాటిస్తూ.

కొత్తగా, జేమ్‌స్త్వో* మెడికల్ ఆఫీసర్‌గా నియమింపబడిన ద్మీత్రీ ఇయోనిచ్ స్తార్‌త్సెవ్ ఆ పట్టణానికి ఆరు మైళ్ల దూరాన వున్న ద్యలీజ్‌లో మకాం పెట్టిన వెంటనే అతనితో చెప్పినారు, సంస్కారవంతుడుగా అతను తూర్కిన్‌లతో తప్పక పరిచయం చేసుకోవాలని. చలికాలంలో ఒక రోజు అతనికి వీధిలో ఇవాన్ పెత్రో విచ్‌తో యెవరో పరిచయం చేసినారు. వాళ్లు వాతావరణాన్నీ, నాటకాలనూ, కలరానూ గురించి మాట్లాడుకున్నారు, మాటలవెంట ఆహ్వానం వచ్చింది. వసంతకాలంలో వచ్చే చర్చి సెలవుల్లో ఒక రోజు — ఆ రోజు అసెన్షన్ — అతను రోగుల నందరినీ చూసిన తర్వాత, మానసికోల్లాసం కొరకూ, పనిలో పనిగా కొన్ని వస్తువులు కొనడానికీ పట్టణానికి బయలుదేరినాడు. అతను కాలి నడకన పోయినాడు (అత నింకా సొంతబండి పెట్టుకోలేదు) తీరికగా అడుగులు వేస్తూ, దారి పొడుగునా నోట్లో పాడుకుంటూ:

''జీవిత చషకంలో కన్నీళ్లను నే చవిచూడక మునుపే.''

---

* స్థానిక స్వపరిపాలన సంస్థ. — సం.

అతను పట్టణంలో భోంచేసినాడు, పార్కులో షికారు చేసినాడు, ఇవాన్ పెత్రోవిచ్ ఆహ్వానం జ్ఞాపకం రాగా, తూర్కిన్‌లు యెలాంటి మనుషులో వెళ్లి చూసొద్దామని నిశ్చయించుకున్నాడు.

''నమస్తే! న్నమస్తే!'' అన్నాడు ఇవాన్ పెత్రోవిచ్, వరండాలో అతన్ని కలుసుకొని. ''మీకు స్వాగతం యిచ్చే భాగ్యం కలిగింది. లోపలికి రండి, నా అర్ధాంగికి మిమ్మల్ని పరిచయం చేస్తాను.'' భార్యకు డాక్టర్‌ను పరిచయం చేసిన తర్వాత అతను చెప్పుకపోయినాడు: ''వేరా, నేనీయనతో అంటున్న దేమిటంటే, ఆస్పత్రికి అంటుక పోవడానికి యీయన కేహక్కూ లేదని. తన తీరిక సమయాన్ని పదిమందికీ ప్రసాదించడం ధర్మం ఈయనకు. యేమంటావ్ ప్రియా, నే నన్నది నిజమేనా?''

''యిలా కూర్చోండి,'' అంటూ వేర యోసిఫొవ్నా తన పక్కనున్న కుర్చీ చూపించింది. ''మీరు నాతో సరసా లాడవచ్చు. నా భర్తకు ఒథెల్లో కున్నంత యీర్ష్య. అయినా, మనం వెనకా ముందూ చూసుకుంటుందాం. సరేనా?''

''చిలిపి దయ్యం!'' ఇవాన్ పెత్రోవిచ్ మృదువుగా గొణిగి, ఆమె నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు. ''మీరు మంచి తరుణంలో వచ్చినారు,'' అన్నాడు అతను మళ్లీ అతిథివైపు తిరిగి. ''నా అర్ధాంగి ఒక అపారమైన గొప్ప నవల యిప్పుడే ముగించింది, యీ సాయంత్రం మనకు వినిపించబోతున్నది.''

''జీన్, బంగారూ,'' అన్నది వేర యోసిఫొవ్నా మగనితో. "Dites que l'on nous donne du thé."*

స్తార్‌త్సేవ్ తరువాత యెకతెరీనా ఇవానొవ్నాకు పరిచయం చేయబడినాడు. ఆమె పద్దెనిమిదేండ్ల పడుచు, అచ్చు గుద్దినట్లు తల్లి పోలిక, అలగే బక్క పలుచగా, అలాగే ఆహ్లాదకరమైన ముఖంతో. ఆమె యింకా చిన్నపిల్లలా కనిపించింది, సుకుమారమైన, నాజూకైన అంగ నిర్మాణంతో. అప్పటికే వికసించడం ప్రారంభించిన ఆమె రొమ్ములలో, ఆ కన్నెతనపు రొమ్ముల అందంలో, ఆరోగ్య సంపదలో, వసంతం, అచ్చమైన వసంతం, స్ఫురించింది. తరువాత వాళ్లు టీ తాగడానికి కూర్చున్నారు, జామ్, తేనె, మిఠాయీ, నోట్లో పెట్టుకుంటే కరిగిపోయే అద్భుతమైన బిస్కట్లూ కలిపి. చీకటి పడబోతుండగా అతిథులు ఒకరొకరే రాసాగినారు. ఇవాన్ పెత్రోవిచ్ చిరునవ్వు తొణికిసలాడే కన్నులతో వాళ్లందరికీ ''నమస్తే! న్నమస్తే!'' చెప్పినాడు.

---

* ఫ్రెంచి భాషలో 'మనకు టీ తెప్పించమని చెప్పండి.'—సం.

అందరూ వచ్చిన తరువాత, వాళ్లందరూ గంభీరమైన ముఖాలతో డ్రాయింగు రూంలో ఆసీనులైనారు, వేర యోసిఫొవ్నా తన నవల చదివింది. "పొపిష్కొ చలిగా వుండింది...." అన్న మాటలతో నవల ప్రారంభమైంది. కిటికీలు బార్లా తెరచి వుండినాయి, వాటిగుండా వంటగదిలో ఖంగు ఖంగుమనే కత్తుల శబ్దమూ, వేయించిన ఉల్లిపాయల వాసనా వస్తూవుండినాయి.... డ్రాయింగురూంలోని మసక వెలుతురులో సోమరితనంగా మినుకు మినుకుమనే దీపాలకింది, మెత్తని కుర్చీలలో కూర్చొనివుండడం ప్రశాంతంగా వుంది. యీ వేసవి సాయం సంధ్యలో, వీధిలో నుండి కంఠధ్వనులూ, నవ్వులూ వినవస్తూ వుండగా, లైలాక్ పూల పరిమళం తోటలోనుండి తేలి వస్తూవుండగా, "పొపిష్కొ చలిగా వుండింది" అనీ, సాయం సూర్యుని చల్లని కిరణాలు మంచు కప్పినమైదానాన్నీ, ఒంటరి బాటసారినీ వెలిగిస్తూ వుంటాయనీ మనసు కెక్కడం కష్టం. అందమైన పడుచు కౌంటెస్ తన గ్రామంలో పాఠశాలలూ, వైద్యశాలలూ, గ్రంథాలయాలూ పెట్టించిందనీ, దేశద్రిమ్మరి చిత్ర కారుని ప్రేమించిందనీ వేర యోసిఫొవ్నా చదివింది, వాస్తవ జీవితంలో యెన్నడూ జరగని వాటిని వర్ణిస్తూ; వినేవాళ్ల మనసులో ప్రశాంత, ఆహ్లాదకర ఆలోచనలు మెదలుతూ వుండగా, ఆమె పఠనం వినడం యెంత హాయిగా, మనఃప్రియంగా వుండిందంటే, యెవరికీ లేవాలనిపించలేదు....

"నాస్తి పరవా!" అన్నాడు ఇవాన్ పెత్రోవిచ్ మృదువుగా.

మనసు యెక్కడో అతి దూరాన పెట్టుకొని వింటూవుండిన ఒక అతిథి వినపడీ వినపడనట్లు మెల్లగా అన్నాడు:

"ఆఁ, అవును......"

ఒక గంట గడిచింది, మరొక గంట గడిచింది. సమీపంలోని పార్కులో జంత్ర సమ్మేళనం పాడుతూవుండింది. వేర యోసిఫొవ్నా తన రాత పుస్తకం మూసిపెట్టినప్పుడు, అయిదు నిముషాల సేపు యెవరూ మాట్లాడలేదు — అందరూ గాయక సమ్మేళనం పాడే జానపద పాటను వింటూవుండినారు, నవలలో లేనిదీ, వాస్తవ జీవితమూ ఆ పాటలో వాళ్లకు లభించింది.

"మీ రచనలు పత్రికల్లో ప్రచురిస్తారా?" స్తార్త్సెవ్ అడిగినాడు వేర యోసిఫొవ్నాను.

"లేదు," అన్నది ఆమె సమాధానంగా. "బొత్తిగా ప్రచురించను. నేను వాటిని రాసి, పెట్టెలో పడేస్తాను. యెందుకు ప్రచురించాలి? మాకు తినడానికి చాలినంత వుంది," వివరణ యిచ్చింది ఆమె.

యెందుకో అందరూ నిట్టూర్చినారు.

''కిట్టీ, యిక కాస్త సంగీతం వినిపించు,'' అన్నాడు ఇవాన్ పెత్రోవిచ్ కూతురుతో.

పియానో మూత యెత్తబడింది, సంగీతం పుస్తకాలు అక్కడే సిద్ధంగా వుండినాయి, జంత్రం తెరవబడింది. యెకతెరీనా ఇవానొవ్నా కూర్చొని రెండు చేతులతో పీకలు నొక్కింది. శక్తికొద్దీ ఆమె మళ్లీ వాటిని నొక్కింది, మళ్లీ మళ్లీ నొక్కింది. ఆమె భుజాలూ, రొమ్ములూ కంపించినాయి. పట్టుదలతో ఆమె అదే పీకలు నొక్కుతూ వుండింది, వాటిని పియానో లోపలికి దిగగొట్టిందాకా మాను కొనే ఉద్దేశం లేనట్లు. డ్రాయింగురూం గర్జలతో నిండిపోయింది; అన్నీ గర్జించి నాయి — నేలా, కప్పూ, ఫర్నిచర్.... యెకతెరీనా ఇవానొవ్నా క్లిష్టమైన గమకం వాయించింది; దాని విలువ అంతా దానిని వాయించడంలోని కష్టంలో వుంది. అది దీర్ఘంగా, రోకటిపాటలాగ విసుగుగా వుండింది. అది వింటూవున్నప్పుడు స్తార్ త్సెవ్‌కు పెద్ద పర్వత శిఖరంనుండి శిలలు కిందికి దొర్లుతున్న చిత్రం మనోనేత్రంముందు నిలిచింది; శిలలు ఒకదానివెంట ఒకటి దొర్లుతూనే వుండినాయి; అవి ఆగితే బాగుండు ననిపించింది అతనికి — యెకతెరీనా ఇవానొవ్నా అతనికి మహా ఆకర్షణీయంగా కనిపించినప్పటికీ. బలంగా, చురుకుగా, శ్రమతో యెరుపెక్కిన బుగ్గలతో, నుదుటిమీద పడుతున్న ఒక పాయ ముంగురులతో ఆమె అతనికి మహా ఆకర్షణీయంగా కనిపించింది. రోగుల మధ్యా, రైతుల మధ్యా ద్యలీజ్‌లో ఒక శీతకాలం గడిపిన తర్వాత, ఒక డ్రాయింగురూంలో కూర్చోవడం చాలా హాయిగా వుండింది, పడుచుదనమూ, నాజూకూ గల యీ జీవిని, పరిశుద్ధమైనదని చెప్పనక్కర లేని జీవిని, చూస్తూ, యీ విసుగు కలిగించే పెద్ద ధ్వనులను, అయినా సంస్కారవంతమైన వాటిని, వింటూ....

ఆమె ముగించి, లేచి నిలబడగానే, ''కిట్టీ, యీ రోజు మరీ అద్భుతంగా వుంది,'' అన్నాడు ఆమె తండ్రి ఇవాన్ పెత్రోవిచ్, నీరు గ్రమ్మిన కన్నులతో. ''యింతకంటె బాగా నీవు చచ్చినా వాయించలేవు.''

అందరూ ఆమె చుట్టూ చేరినారు, అభినందిస్తూ, అచ్చెరువుపడుతూ, తమ జన్మలో యిలాంటి సంగీతం వినలేదని ప్రమాణం చేస్తూ. అన్నీ ఆమె మౌనంగా విన్నది, ముఖంమీద రేఖామాత్రమైన చిరునవ్వుతో, సర్వాంగాలలోనూ వ్యక్తమయ్యే విజయానందపు తన్మయత్వంతో.

''అద్భుతం! అమోఘం!''

స్తార్త్సెవ్ కూడా, ఆ ఉత్సాహపు వాతావరణానికి లొంగిపోయి, ''అమోఘం!'' అని అన్నాడు. ''యెక్కడ చదువుకున్నారు? సంగీత కళాశాలలోనా?'' అని అడిగినాడు అతను యెకతెరీనా ఇవానొవ్నాను.

''లేదు, సంగీత కళాశాలకు పోవాలనుకుంటున్నాను. యిాలోగా యిక్కడే మదాం జవ్లోవ్స్కయావద్ద పాఠాలు చెప్పించుకుంటున్నాను.''

''యిక్కడ హైస్కూలు ముగించినారా?''

''ఓ, లేదు,'' అమె తరపున తల్లి వేర యోసిఫొవ్నా జవాబు చెప్పింది. ''యింటివద్ద పంతుళ్లను పెట్టించినాము. మీకు తెలుసుగా, హైస్కూలులోనూ, బోర్డింగు స్కూలులోనూ చెడ్డ సవాసాలు వుంటాయి. ఆడపిల్ల పెరిగేటప్పుడు తల్లి ప్రభావం తప్ప యెవరి ప్రభావంకిందా వుండకూడదు.''

''కానీ, నేను సంగీత కళాశాలకు వెళ్లాలనుకుంటున్నాను,'' అన్నది యెక తెరీనా ఇవానొవ్నా.

''ఓయ్, లేదు. మా కిట్టీకి అమ్మంటే ప్రాణం. మా కిట్టీ అమ్మకూ, నాన్నకూ దుఃఖం కలిగించదు.''

''నేను వెళ్తాను, వెళ్తాను!'' అన్నది యెకతెరీనా ఇవానొవ్నా పరిహాసపు అలకతో, కాలు నేల తాటిస్తూ.

రాత్రి భోజనం వేళ విద్యా ప్రదర్శన చేసేవంతు ఇవాన్ పెత్రోవిచ్ది. అతను కండ్లతో మాత్రమే నవ్వుతూ కథలూ, చతురోక్తులూ చెప్పినాడు, హాస్యకరమైన సమస్యలు యిచ్చి, తానే విప్పినాడు, నిత్యం తన సొంత వింత భాషలో మాట్లాడుతూ. అతను తన దీర్ఘ వాక్చమత్కారపు సాధనలో అలవరచుకొన్న భాష అది, యిప్ప డతనికి అలవాటుగా మారినట్లున్న భాష: అద్భుతౌఘం, నాస్తి పరవా, సవినయ సంపన్నంగా కృతజ్ఞుణ్ని.

అంతటితో అయిపోలేదు. అతిథులు, తృప్తులై, సంతుష్టులై, తమ కోట్ల కొరకూ, చేతికర్రల కొరకూ హాలులో మూగినప్పుడు, పొట్టి క్రాపూ, వూదు బుగ్గలూ గల పద్నాలుగేండ్ల నౌకరు కుర్రవాడు పావెల్ — అందరూ అతన్ని పావా అంటారు — వాళ్ల చుట్టూ తచ్చాడుతూ వుండినాడు.

''పావా, యేదీ, చూపించు!'' అన్నాడు ఇవాన్ పెత్రోవిచ్.

పావా ఒక భంగిమలో నిలబడి, ఒక చేయి యెత్తి, విషాద కంఠంతో ఉచ్చరించినాడు:

''నశించు, దుఃఖిత వనితా!''

అందరికీ నవ్వు వచ్చింది.

''వినోదకరం!'' అనుకుంటూ స్తార్త్సేవ్ బయటికి పోయినాడు.

అతను బీరు తాగడానికి రెస్టారెంటుకు వెళ్లినాడు, తరువాత ద్యలీజ్‌కు నడుచుకుంటూ పోయినాడు. దారి పొడుగునా అతను గొంతులో రాగం తీసుకుంటూ వెళ్లినాడు:

''నీ మృదు కంఠధ్వని నయగారంలో....''

ఆరు మైళ్ళు నడిచి అతను పడకమీద చేరేటప్పటికి అణుమాత్రమూ ఆయాస మనిపించలేదు; యింకొక ఆరుమైళ్ళు హాయిగా నడవగలనని అతను అనుకున్నాడు.

''నాస్తి పరవా!'' అని అతనికి జ్ఞాపకం వచ్చి, నవ్వుకుంటూ నిద్రలో మునిగినాడు.

## II

స్తార్త్సేవ్ మళ్లీ తూర్కిన్‌ల యింటికి వెళ్లిరావాలని అనుకుంటూనే వుండినాడు; కానీ ఆస్పత్రిలో పని యెక్కువై అతనికి యెప్పుడూ ఒకటి రెండు గంటలు కూడా తీరిక దొరకలేదు. యిలా పనిలో, ఒంటరితనంలో యేడాదికి పైగా గడిచింది. ఒకనాడు పట్టణంనుండి అతనికి నీలం కవరులో జాబు వచ్చింది....

వేర యోసిఫొవ్నాకు చాలా కాలంగా అప్పుడప్పుడు తలనొప్పి వస్తూవుండింది; కానీ, కిట్టీ సంగీత కళాశాలకు వెళ్తానని రోజూ మారాం చేయడంతో, అది మరీ తరుచుగా రాసాగింది. పట్టణంలోని డాక్టర్లందరూ ఆమెకు చికిత్స చేసినారు, చివరకు జేమ్‌స్త్వ డాక్టరు వంతు వచ్చింది. వేర యోసిఫొవ్నా అతనికి ఆర్ద్రమైన ఉత్తరం రాసింది, వచ్చి తన బాధ తొలగించమని. స్తార్త్సేవ్ వెళ్లినాడు, అది మొదలు తరుచుగా, అతి తరుచుగా తూర్కిన్‌ల యింటికి వెళ్లసాగినాడు.... అతను నిజంగా వేర యోసిఫొవ్నాకు కొద్దిగా గుణం కలిగించినాడు. అతను అసాధారణమైన, పరమాద్భుతమైన డాక్టర్ అని ఆమె తన యింటికి వచ్చేవాళ్లందరితోనూ చెప్పింది. కానీ అత నిప్పుడు తూర్కిన్‌ల యింటికి వెళ్లేది ఆమె తలనొప్పి మూలంగా కాదు.

ఆ రోజు సెలవు దినం. యెకతెరీనా ఇవానొవ్నా పియానోమీద విసిగించే దీర్ఘ సాధన ముగిసింది. అందరూ టీ తాగుతూ భోజనశాలలోని పెద్ద టేబుల్‌వద్ద

కూర్చున్నారు. ఇవాన్ పెత్రోవిచ్ వినోదకరమైన కథ మధ్యలో వుండగా, వాకిలి గంట వాగింది; యెవరో ఆగంతుకుని కలుసుకోడానికి అతను లేచి వెళ్లవలసి వచ్చింది. స్తార్త్సెవ్ ఆ క్షణకాలపు గడబిడను ఆసరాగా తీసుకొని, తీవ్రంగా ఆందోళన చెందుతూ యెకతెరీనా ఇవానొవ్నా చెవిలో మెల్లగా చెప్పినాడు:

''నన్ను హింసించవద్దు, మీకు పుణ్య ముంటుంది. తోటలోకి వెళ్దాం పద.''

ఆమె ఆశ్చర్యపడినట్లూ, అతను కోరేదేమిటో అర్థం కానట్లూ భుజాలు కుదించింది; కానీ, లేచి బయటికి వెళ్లింది.

ఆమెవెంట నడుస్తూ అతను చెప్పినాడు: ''మీరు మూడు నాలుగు గంటలు సాధన చేస్తారు, తరువాత మీ అమ్మ దగ్గర కూర్చుంటారు. మీతో మాట్లాడ డానికి యెప్పుడూ అవకాశమే వుండదు. నాకు పది నిముషాలు యివ్వండి, మీకు పుణ్య ముంటుంది!''

శరదృతువు సమీపిస్తూ వుండింది. పాత తోట నిశ్చలంగా, విచారపూరితంగా వుండింది. కాలి బాటలనిండా ఆకులు పడివుండినాయి. పగళ్లు పొట్టివౌతూ వుండినాయి.

''మిమ్మల్ని చూడక వార మైంది,'' అంటూ స్తార్త్సెవ్ కొనసాగించినాడు. ''అది నాకెంత యాతనగా వుందో తెలుసా! కాసేపు కూర్చుందాం. మీతో మాట్లా డాలి.''

విస్తారమైన కొమ్మలు గల పాత మేపుల్ చెట్టుకింద బెంచీ వుంది — తోటలో అది వాళ్ల అభిమాన స్థలం. అక్కడ కూర్చున్నారు వాళ్లు.

''యేమిటి మీరు కోరేది?'' యెకతెరీనా ఇవానొవ్నా అడిగింది వ్యవహార ధోరణిలో, నిర్లిప్త కంఠంతో.

''మిమ్మల్ని చూడక వారం దాటింది, మీ గొంతు వినక యుగాలు గడిచినాయి. మీ కంఠధ్వని కాంక్షిస్తున్నాను, మీ పలుకుల కొరకు దగ న్నాను! మాట్లాడండి!''

ఆమె నవవికాసమూ, ఆమె చూపులలోని అమాయకత్వమూ, నిష్కపటపు చెక్కిళ్లూ అతన్ని వివశుణ్ని చేసినాయి. ఆమె దుస్తుల పొందికలో కూడా అతనికి మహా మధురమైన దేదో కనిపించింది, వాటి సరళమైన, అమాయకమైన సార స్యంలో హార్దికమైన దేదో కనిపించింది. కానీ, అంత అమాయకత్వంలోనూ ఆమె చాలా తెలివిపరురాలుగా, వయసుకు మించిన విజ్ఞురాలుగా కనిపించింది అతనికి. అతను సాహిత్యం గురించి గానీ, కళల గురించి గానీ, తనకు యిష్టం వచ్చిన దేన్ని గురించైనా గానీ ఆమెతో మాట్లాడవచ్చు, జీవితంమీదా, మనుషులమీదా ఆమెతో ఫిర్యాదు చేయవచ్చు — గురుతరమైన సంభాషణ మధ్యలో ఆమె ఒకోసారి బేజారు

కలిగించే విధంగా పకపక నవ్వడమూ, ఒకోసారి యింట్లోకి పరుగెత్తిపోవడమూ నిజమే అయినప్పటికీ. ఆ పట్టణంలోని అత్యధిక భాగం ఆడపిల్లల లాగే ఆమె పుస్తకాలు బాగా చదివేది (ఆ పట్టణంలో పుస్తక పఠనం చాలా తక్కువ; ఆడపిల్లలూ, యువ యూదులూ లేకపోతే గ్రంథాలయం మూసివేయవచ్చు అని స్థానిక గ్రంథాలయాధికార్లు ప్రకటించినారు), యిది స్తార్త్సెవ్‌కు మహదానందం కలిగించింది. అతను ఆమెను చూసినప్పుడల్లా, ఆమధ్య ఆమె యేమి చదువుతూ వుండేదీ ఉత్సుకతతో అడిగేవాడు, ఆమె జవాబును పరవశత్వంతో వినేవాడు.

"యీ వారం యేమి చదువుతూ వుండినారు, మనం కలుసుకున్నప్పటినుండి?" అతను అడిగినాడు ఆమెను. "చెప్పండి."

"పీసెమ్‌స్కీయ్ రచన చదువుతూ వుండినాను."

"యే పుస్తకం?"

"'వెయ్యి ఆత్మలు'," కిట్టీ జవాబు చెప్పింది. "పీసెమ్‌స్కీయ్ పేరు యెంత తమాషాగా వుంది — అలెక్సేయ్ ఫెయొఫీలక్తిచ్!"

ఆమె హఠాత్తుగా లేచి, యింటివైపు నడిచింది. "యెక్కడికి?" అంటూ స్తార్త్సెవ్ గాభరాగా అరిచినాడు. "నేను మీతో తప్పక మాట్లాడాలి. మీతో ఒక విషయం చెప్పాలి.... ఆగండి — కనీసం అయిదు నిముషాలైనా ఆగండి, మీకు పుణ్య ముంటుంది!"

యేదో చెప్పబోయేదానిలా ఆమె ఆగింది. తరువాత అస్తవ్యస్తంగా అతని చేతిలో ఒక చీటీ పెట్టి యింట్లోకి పరుగెత్తింది; వెంటనే అక్కడ మళ్లీ పియానోవద్ద కూర్చుంది.

"యీ రాత్రి పదకొండు గంటలకు స్మశానంలో దెమెట్టి సమాధివద్ద వుండండి," స్తార్త్సెవ్ చదువుకున్నాడు.

"యిది నిజంగా అర్థం లేనిది," అనుకున్నాడు అతను, ఆశ్చర్యంనుండి తేరుకున్న తర్వాత. "స్మశానం యెందుకు? దేనికొరకు?"

అంతా తేటతెల్లంగా వుంది: కిట్టీ తనను ఆడిస్తున్నది. వీధిలో గానీ, మునిసిపల్ పార్కులో గానీ అంత సులభంగా కలుసుకునే అవకాశ ముండగా, బుద్ధి వున్నవాళ్లెవ్వరూ రాత్రిపూట, వూరికి అంత దూరాన కలుసుకోవాలనుకోరు. యిక, తాను, డాక్టరు, వివేకమూ, సంఘంలో మర్యాదా గల పెద్దమనిషి, ఒక ఆడపిల్ల కొరకు నిట్టూర్చడమూ, చీటీలు స్వీకరించడమూ, స్మశానాలలో సంచారం చేయడమూ,

యీ కాలపు బడిపిల్లలు కూడా నవ్వే అవివేకాలు చేయడమూ ఉచితమా? యీ ప్రేమ కలాపం యెక్కడికి తీసుకపోతుంది. తన సహోద్యోగులకు తెలిస్తే యేమంటారు? క్లబ్బులో టేబుళ్లమధ్య దారి చేసుకుంటూ వెళ్లేటప్పుడు యివి స్తార్త్సెవ్ ఆలోచనలు, కానీ పదిన్నర గంటలకు అతను హఠాత్తుగా స్మశానానికి బయలుదేరినాడు.

యిప్పుడతనికి సొంత జోడు గుర్రాలబండి వుండింది, వెల్వెట్ వేస్టుకోటు వేసుకునే పాంతెలెయ్‌మోన్ అనే బండివాడు వుండినాడు. వెన్నెల కాస్తూవుండింది. అంతా నిశ్చలంగా, వెచ్చగా వుండింది, కానీ అది శరదృతువు వెచ్చదనం. పట్టణం వెలుపల జంతు వధశాల దగ్గర కుక్కలు మొరుగుతూ వుండినాయి. స్తార్త్సెవ్ పట్టణం చివర ఒక సందులో బండి దిగి, కాలి నడకన స్మశానానికి పోయినాడు. "పుర్రె కొక బుద్ధి అంటారు. కిట్టీ చిత్రమైన పిల్ల. యేమో, యెవరికి తెలుసు? — ఆమె నిజంగా అనుకుందేమో? అక్కడ వుంటుందేమో?" అనుకున్నాడు అతను. యీ అడియాస కైపుకు అతను లొంగిపోయినాడు.

దారిలో చివరి భాగం పొలంలో వుండింది. స్మశానం దూరాన నల్లగా వనంలా, లేక పెద్ద పార్కులా వుండింది. ఒక తెల్లని రాతి గోడ కనిపించింది, తరువాత ఒక గేటు కనిపించింది.... వెన్నెలలో గేటుమీద రాత చదవడం వీలైంది: "నీ సమయం కూడా వస్తుంది." స్తార్త్సెవ్ కొయ్య గేటు తోసి, లోపలికి పోయి, విశాలమైన దారిలో నిలబడినాడు; దారికి రెండువైపులా తెల్లని శిలువలూ, స్మారక మందిరాలూ, పొడవైన పాప్లర్ చెట్లూ వుండినాయి, అన్నీ అతని దారి కడ్డంగా పొడవైన నల్లని నీడలు పరుస్తూ. ప్రతిదీ నల్లగనో, తెల్లగనో వుండింది, నిద్రమత్తు చెట్లు తెల్లని రాళ్లమీదికి కొమ్మలు సాచినాయి. పొలంలో కంటె యిక్కడ వెలుతురు యెక్కువ వున్నట్లుండింది. మేపుల్ చెట్ల ఆకులు పంజాలలాగ కనపడుతూ, దారిలోని పసుపు రంగు యిసుక పక్కనా, తెల్లని సమాధిరాళ్ల పక్కనా మరింత స్పష్టంగా వున్నాయి; స్మారక చిహ్నాలమీది రాతలు స్పష్టంగా కనిపిస్తూ వుండినాయి. స్తార్త్సెవ్ మనసు ఒక ఆలోచనతో నిండిపోయింది: జీవితంలో బహుశా మళ్లీ యెప్పుడూ చూడబోనిదాన్ని తాను మొట్టమొదటిసారి చూస్తున్నాడు — యే ప్రపంచంతోనూ పోలిక లేని ప్రపంచాన్ని, అదే తన ఊయెల తొట్టె అయినట్లు వెన్నెల మృదువుగా మధురంగా వున్న ప్రపంచాన్ని, ప్రాణం అనేది బొత్తిగా లేని ప్రపంచాన్ని, కానీ నిశ్చలమైన, అతిలోక సుందరమైన శాశ్వత జీవితాన్ని వాగ్దానం చేస్తున్న నిగూఢ రహస్యం చీకటిలోని ప్రతి పాప్లర్ చెట్టులోనూ, ప్రతి సమాధిలోనూ

యింద్రియ స్పృష్టమయ్యే ప్రపంచాన్ని. సమాధిరాళ్లనుండీ, వాడిపోయే పూలనుండీ, హేమంతంలో కుళ్లిపోయే ఆకుల వాసననుండీ దుఃఖమూ, శాంతీ తేలియాడుతూ వచ్చినట్లుండింది.

చుట్టూ నిశ్శబ్దం. నక్షత్రాలు ప్రగాఢ వినమ్రతతో నింగినుండి నేలమీద చూపులు నిలిపినాయి; స్తార్‌త్సెవ్ అడుగులు ఆ నిశ్శబ్దంలో పరుషంగా, అసహజంగా ధ్వనించినాయి. చర్చి గడియారం గంటలు కొట్టుతుండగా, తాను మరణించినాననీ, శాశ్వతంగా సమాధి చేయబడినాననీ అతను ఊహించుకుంటూ వుండినాడు. అప్పుడు మాత్రమే తనవైపు యెవరో చూస్తున్నట్లు అతనికి అనిపించి, క్షణకాలం ఒక ఊహకు లోనైనాడు, అది ప్రశాంతీ, నిశ్చలత్వమూ కాదనీ, నిర్జీవత్వపు ప్రగాఢ విషాదమనీ, అణచిపెట్టబడిన నిస్పృహ అనీ....

దెమెట్టి స్మారక మందిరం గుడిలాగ వుండింది, కప్పుమీద దేవదూతతో; పూర్వం యెప్పుడో ఒక యిటాలియన్ సంగీత నాటక బృందం ఆ పట్టణానికి వచ్చింది; వాళ్లలో ఒక గాయకురాలు యిక్కడే మరణించి, పూడ్చిపెట్టబడింది; ఆమె స్మృత్యర్థం యీ మందిరం కట్టబడింది. యిప్పుడు పట్టణంలో యెవరికీ ఆమె జ్ఞాపకం లేదు; కానీ ఆమె సమాధి ద్వారంలో వ్రేలాడే దీపంమీద వెన్నెల పడి ప్రతిఫలించినప్పుడు, ఆ దీపం వెలుగుతున్నట్లు కనపడుతుంది.

యెవరూ కనిపించలేదు. అర్ధరాత్రి వేళ యెవరొస్తారు యిక్కడికి? కానీ స్తార్‌త్సెవ్ కాచుకున్నాడు, వెన్నెల అతని ప్రేమను రగిలించినట్లు ఉబలాటంతో కాచుకున్నాడు, ముద్దులూ, కౌగిలింతలూ ఊహించుకుంటూ.... అర్ధగంటసేపు అతను సమాధి పక్కన కూర్చున్నాడు, తరువాత దగ్గరున్న ఒక కాలిబాటలో అటూయిటూ పచారుచేయసాగినాడు, టోపీ చేత పట్టుకొని ఆమె కోసం యెదురు చూస్తూ అతను మనసులో అనుకొన్నాడు: యీ సమాధులలోని స్త్రీలూ, పడుచులూ యెంద రెంత అందంగా, మనోమోహనంగా వుండినారో, యెంద రెంతగా ప్రేమించి, రాత్రివేళ ప్రణయాగ్నిలో యెంతగా జ్వలించి, తమ ప్రియుల కౌగిళ్లలో ఒదిగిపోయినారో. ప్రకృతి మాత మానవులతో యెంత విచారకరమైన ఆట ఆడుతుంది! దీనిని ఒప్పుకోవలసి రావడం యెంత తలవంపులు! యీ విషయాలన్నీ ఆలోచిస్తుండగా స్తార్‌త్సెవ్‌కు బిగ్గరగా అరవాలని కాంక్ష కలిగింది, తనకు ప్రేమ తప్పనిసరిగా కావాలని, యేమైనా సరే కావాలని! అతని మనసులో యిప్పుడు తెల్లని పాలరాతి ఫలకాలు లేవు, దేహాలు వుండినాయి, నునుసిగ్గుతో చెట్లనీడలలో దాక్కునే వాటి రూపాలు కనిపించినాయి అతనికి, వాటి వెచ్చదనం తగిలింది అతనికి, చివరకు వలపు తాపం దుర్భరమైంది అతనికి.

హఠాత్తుగా, తెర దించినట్లు, చంద్రుడు మేఘాల చాటుకు పోయినాడు, చుట్టూ చీకటి అయింది. గేటు కనుక్కోవడం స్తార్‌త్సేవ్‌కు యెంతో కష్టమైంది, హేమంత నిశి యెంత చీకటిగా వుండాల్నో అంత చీకటి అయింది అప్పటికి; తన బండి వదలిపెట్టి వచ్చిన సందు కనుక్కోలేక అతను గంటన్నరసేపు చెడదిరిగినాడు.

''యెంతగా అలసిపోయినానో, కాళ్ళు నిలవడం లేదు,'' అన్నాడు అతను పాంతెలెయ్‌మోన్‌తో.

సీటులో సుఖంగా వాలిపోతూ అతను మనసులో అనుకున్నాడు:

''నేను యింత లావు కాకూడదు.''

III

మరుదినం సాయంత్రం అతను తూర్కిన్‌ల యింటికి పోయినాడు, పెండ్లి ప్రతిపాదన చేయాలని గట్టిగా అనుకొని. కానీ సమయం అనుకూలించలేదు — కేశాలంకర్త వచ్చి, యెకతెరీనా ఇవానొవ్నాకు ఆమె పడకగదిలో కేశాలంకారం చేస్తూ వుండింది. ఆమె క్లబ్బులో నృత్యానికి పోతూవుండింది.

మళ్లీ భోజనశాలలో టీ తాగుతూ చాలాసేపు గడపవలసివచ్చింది. తన అతిథి మజ్జుగా, పరధ్యానంగా వుండడం ఇవాన్ పెత్రోవిచ్ గమనించి, తన వేస్టుకోటు జేబునుండి కొన్ని కాగితాలు తీసి, తమాషా అయిన వచ్చీరాని రష్యన్ భాషలో ఒక జర్మన్ మేనేజరు రాసిన ఉత్తరం బిగ్గరగా చదవసాగినాడు.

పరధ్యానంగా వింటూ, స్తార్‌త్సేవ్ అనుకున్నాడు: ''ఆమెకు మంచి కట్నం ఇవ్వవచ్చు.''

రాత్రంతా నిద్ర లేక అతను కొయ్యబారిన స్థితిలో వుండినాడు, నిద్ర కలిగించే మధురమైన పానీయం యేదో తాగినవానిలా. అతని హృదయంలో అస్పష్టమైన, ఆహ్లాదకరమైన సుఖానుభూతి యేదో వుండింది, కానీ అతని బుర్రలో పరుషమైన, భారమైన పురుగు తొలుస్తూవుండింది:

''చేతులు కాలకముందే ఆగు. ఆమె నీకు జోడా? ఆమె గారాబంతో చెడ బెరిగింది, గర్విష్ఠి, పగలు రెండుదాకా నిద్రలేవదు, నీవు మతగురువు కొడుకువు, జేమ్‌స్త్వొ డాక్టర్‌వు....''

''అయితే యేం?'' అనుకున్నాడు అతను.

"పైగా, ఆమెను చేసుకుంటే," ఆ పురుగు కొనసాగించింది, "ఆమె బంధువులు నీవు జేమ్స్త్వో ఉద్యోగం వదలిపెట్టి, పట్టణంలో కాపురం పెట్టేటట్లు చేస్తారు."

"కానీలే," అనుకున్నాడు అతను, "పట్టణంలో యెందుకుండ కూడదు? వాళ్ళ ఆమెకు కట్నం యిస్తారు, మేము పట్టణంలో కాపురం పెడతాం...."

చివరకు యెకతెరీనా ఇవానొవ్నా వచ్చింది, నవనవోన్మేషంగా, అందమైన దుస్తులలో ముచ్చటగా. స్తార్త్సెవ్ కన్నుల కరువు దీర ఆమెను ఆలోచిస్తూ, యెంతగా పరవశుడైనాడంటే, నోట మాట లేకుండా వూరక ఆమెను చూస్తూ, నవ్వుతూ వుండినాడు.

ఆమె అందరితోనూ సెలవు తీసుకుంటూ వుండింది. అతని కిక అక్కడ ఆగవలసిన పనేమీ లేదు, అందువలన అతనూ లేచినాడు, యింటికి పోయేవేళ అయిందని అంటూ. రోగులు అతని కోసం యెదురుచూస్తుంటారు.

"అన్యాయం!" అన్నాడు ఇవాన్ పెత్రోవిచ్ "సరే, వెళ్ళండి! మరే, కిట్టీని క్లబ్బువద్ద దింపేసి వెళ్ళొచ్చుగా మీరు!"

బయట చీకటిగా వుండింది, తుంపర పడుతూ వుండింది. పాంతెలెయ్‌మోన్ గుర్రం సకిలింపునుబట్టి మాత్రమే వాళ్ళ బండి యెక్కడున్నదీ కనుక్కోగలిగినారు. బండి మూత మూయబడివుండింది.

ఇవాన్ పెత్రోవిచ్ నోరు మూతబడకుండా హాస్యాలాడుతూ, కూతురును బండిలో యెక్కించి, హాస్యంగా సెలవు చెప్పినాడు. "వెళ్ళిరండోయ్! సుఖీ భవ!"

"నిన్న నేను స్మశానానికి వెళ్ళినాను," అన్నాడు స్తార్త్సెవ్ "మీకు బొత్తిగా కనికరం అనేది లేదు, వట్టి రాతి గుండె...."

"స్మశానానికి వెళ్ళినారా?"

"ఆఁ. దాదాపు రెండు గంటలదాకా కాచుకున్నాను. ఆ బాధ...."

"మీకు కుదర వలసిందే — హాస్యం అర్థం కాదా?"

యెకతెరీనా ఇవానొవ్నా తన ఆరాధకుని అంత బాగా బురిడీ కొట్టించినందుకూ, అంత గాఢంగా అతని ప్రేమను చూరగొన్నందుకూ సంతోషం పట్టలేక, గలగల నవ్వింది. మరుక్షణంలో ఆమె గాభరాగా కేకవేసింది — క్లబ్బు గేటువద్ద గుర్రాలు హఠాత్తుగా మలుపు తిరిగినాయి, బండి ఒరిగింది. స్తార్త్సెవ్ ఆమె నడుముచుట్టూ చేయివేసినాడు. భయ కంపంలో ఆమె అతనిమీద వాలింది. అతను ఆమెను మరింత బిగువుగా పట్టుకొని, ఆమె పెదవులమీదా, గడ్డంమీదా ఆవేశపు ముద్దులు కురిపించ కుండా వుండలేకపోయినాడు.

"యిక చాలులే," అన్నది ఆమె నిర్లిప్తంగా.

క్షణం గడిచేటప్పటికి ఆమె బండిలో లేదు; దీపాల కాంతిలో వెలిగిపోతున్న గేటువద్ద వున్న పోలీసు జవాను పాంతెలెయ్‌మోన్‌ను ఉద్దేశించి కిరాతకంగా అరిచినాడు:

''యింకా యెందుకున్నావ్ మొద్దూ? కదలు!''

స్తార్‌త్సెవ్ యింటికి పోయి, కాసేపట్లో మళ్లీ బయటికి వచ్చినాడు. యెవరిదో ఫ్రాక్‌కోటు తొడుక్కొని, ముడుచుకొని ఒక పక్కకు జారిపోయే తెల్లని బిరుసు టై కట్టుకొని, అర్ధరాత్రి వేళ క్లబ్బు డ్రాయింగురూంలో కూర్చొని, తన్మయత్వంతో యెకతెరీనా ఇవానొవ్నాతో చెప్తూవుండినాడు:

''యెన్నడూ ప్రేమించనివాళ్లకు యేం తెలుస్తుంది! ప్రేమను యెవరూ వాస్తవంగా వర్ణించలేదని నాకు అనిపిస్తుంది. నిజానికి సుకుమారమైన, ఆనందమయమైన, యాతనాభరమైన అనుభూతి వర్ణన కందదు. దాన్ని, ఒక్కసారైనా సరే, అనుభవించినవాళ్లు మాటలలో వర్ణించడానికి పూనుకోరు. ఉపోద్ఘాతాలూ, వర్ణనలూ యెందుకు? యీ అనవసర వాగ్దంఫన యెందుకు? నా ప్రేమ అవధు తెరగనిది.... మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను, మిమ్మల్ని ప్రాధేయపడుతున్నాను,'' స్తార్‌త్సెవ్ ముగించినాడు, అసలు విషయం వెళ్లగక్కుతూ, ''నా అర్ధాంగిగా నన్ను గ్రహించండి!''

''ద్మీత్రీ ఇయోనిచ్'' అన్నది యెకతెరీనా ఇవానొవ్నా, ఒక క్షణం ఆగి, మహా గంభీరమైన ముఖ భంగిమతో. ''ద్మీత్రీ ఇయోనిచ్, మీరు చూపిన మన్ననకు చాలా కృతజ్ఞురాలిని. మీమీద నాకు గౌరవముంది, కానీ....'' ఆమె లేచి, నిలబడి చెప్పసాగింది, ''కానీ, క్షమించండి, నేను మీ భార్యగా వుండలేను. మనం మోమోటం లేకుండా మాట్లాడుకుందాం. మీకు బాగా తెలుసు గదా ద్మీత్రీ ఇయోనిచ్, నాకు జీవితంలోకెల్ల కళ ప్రియతమమైనది, సంగీతమంటే నేను ప్రాణం విడుస్తాను, దాన్ని ఆరాధిస్తాను, దానికి నా జీవితం యావత్తూ మీదు గట్టినాను. నేను సంగీత విద్వాంసురాలిని కావాలనుకున్నాను, నాకు కీర్తి కావాలి, విజయం కావాలి, స్వేచ్ఛ కావాలి. యీ పట్టణంలోనే నివసిస్తూ, నాకు దుర్భరంగా తయారైన యీ నిస్సారపు వ్యర్థ జీవితం కొనసాగిస్తూ వుండమంటారా నన్ను? యెవరికో భార్యగా? వద్దు, మీ దయవల్ల! మనిషికి ఉన్నతమైన, ఉజ్వలమైన లక్ష్యం వుండాలి, మరి కుటుంబ జీవితం నన్ను శాశ్వతంగా బంధిస్తుంది. ద్మీత్రీ ఇయోనిచ్'' (ఆమెరేఖా మాత్రంగా చిరునవ్వు నవ్వింది—''ద్మీత్రీ ఇయోనిచ్'' పేరు ఉచ్చరించినప్పుడు ఆమెకు ''అలెక్సేయ్ ఫియొఫీలక్తిచ్'' జ్ఞాపకం రాక పూనడం లేదు), ''ద్మీత్రీ ఇయోనిచ్, మీరు దయాపరులు, ఉదారులు, ధీమంతులు, తక్కినవాళ్లందరికంటె మీరు

మేలైనవాళ్లు —" ఆమె కన్నులలో నీరు తిరిగింది, "మీపట్ల నాకు హృదయ పూర్ణమైన సానుభూతి వుంది, కానీ... కానీ, నాకు నమ్మక ముంది మీరు అర్థం చేసుకుంటారని...."

యేడుపు నిగ్రహించుకోడానికి ఆమె పక్కకు తిరిగి, డ్రాయింగురూంలోనుండి వెళ్లిపోయింది.

స్తార్త్సెవ్ గుండె యిప్పుడు ఆదుర్దాతో దడదడ కొట్టుకోలేదు. క్లబ్బు లోనుండి వీధిలోకి పోయి అతను చేసిన మొట్టమొదటి పని బిరుసు టై లాగిపారవేసి గట్టిగా ఊపిరి తీసుకోవడం. అతనికి కొద్దిగా లజ్జ కలిగింది, అతని అహంకారానికి దెబ్బ తగిలింది — ఆమె తన్ను నిరాకరిస్తుందని అతను అనుకోలేదు — తన కలలూ, వేదనలూ, ఆశలూ ఔత్సాహికులు నటించే చిన్న సుఖాంత నాటకంలోని అంతిమ రంగంలా యింత నిస్సారంగా అంతమైనాయని అతను నమ్మలేకపోయినాడు. తన హృదయానుభూతులకూ, తన యీ ప్రేమకూ అతనికి విచారం కలిగి, యేడవా లనిపించింది, లేదా పాంతెలెయ్‌మోన్ పెద్ద భుజాలమీద తన యావత్తు శక్తితోనూ తన చేతిలోని గొడుగుతో ఒకటి వేయాలనిపించింది.

మూడు రోజులు అతనికి అన్నీ అస్తవ్యస్తంగా వుండినాయి, అతను అన్నం తినలేదు, నిద్రపోలేదు. కానీ, యెకతెరీనా ఇవానొవ్నా సంగీత కళాశాలలో చేరడానికి మాస్కోకు పోయిందన్న వార్త అతనికి అందినప్పుడు, అతను నిమ్మళించి, ముందు మాదిరే జీవించసాగినాడు.

తరువాత, తాను స్మశానంలో తిరిగిందీ, ఫ్రాక్‌కోటు కొరకు ఊరంతా వెదకిందీ జ్ఞాపకం వచ్చినప్పుడు అతను బద్ధకంగా ఒళ్లు విరుచుకొని "యేమి ఆర్భాటం" అనుకున్నాడు.

## IV

నాలుగేండ్లు గడిచినాయి. స్తార్త్సెవ్‌కు పట్టణంలో పెద్ద ప్రాక్టీసు వుండింది. ప్రతి ఉదయం అతను ద్యలీజ్‌లోని తన రోగులను తొందర తొందరగా పరీక్షించి, తరువాత పట్టణంలోని తన రోగులను చూడడానికి పోయేవాడు. యిప్పు డతను జోడు గుర్రాలబండిలో పోవడం లేదు, కలనాదం చేసే గంటలు గల మూడు గుర్రాల బండిలో పోయేవాడు, రాత్రి పొద్దు బోయిన తర్వాత యింటికి వచ్చేవాడు. అతను

లావై, తూకమెక్కినాడు, నడక మానుకున్నాడు; నడిస్తే అతనికి గుండెదడ వచ్చేది. పాంతెలెయ్‌మోన్ కూడా లావైనాడు; అతని చుట్టుకొలత పెరిగేకొద్దీ, విషాదకరంగా నిట్టూర్చి, తన దుర్గతికి వగచేవాడు: "యెప్పుడే ఒకటే ప్రయాణం!"

స్తార్త్సెవ్ చాలా యిండ్లకు వెళ్లేవాడు, చాలామందిని కలుసుకునేవాడు; కానీ యెవరికీ అతను సన్నిహితుడు కాలేదు. పట్టణవాసుల సంభాషణా, అభిప్రాయాలూ, వాళ్ల వైఖరే అతనికి చిరాకు కలిగించేది. అతను క్రమక్రమంగా ఒకటి తెలుసుకున్నాడు — తాను ఆ పట్టణంలో యెవరితో నైనా పేకాట ఆడినంతసేపూ, అతనితో కలిసి భోంచేసినంతసేపూ అతను ప్రశాంతుడుగా, సరసుడుగా, కాస్త తెలివిపరుడుగా కూడా వుంటాడు, కానీ సంభాషణ తిండిని గురించి కాక మరి దేనికైనా, రాజకీయాలకో, శాస్త్ర విజ్ఞానానికో మళ్లిందా, మరుక్షణమే అతను తికమక పడతాడు, లేదా యెంత తెలివి లేని, హృదయం లేని సిద్ధాంతం చెప్పడం ప్రారంభిస్తాడంటే, యెవరైనా అతన్ని వదిలేసి వెళ్లిపోవలసిందే. దేవుని దయవల్ల మానవ జాతి పురోగమిస్తూ వుందనే విషయంగురించీ, కొంత కాలానికల్లా మనం పాస్‌పోర్ట్లనూ, ఉరిశిక్షనూ విసర్జించవచ్చు ననే విషయం గురించీ స్తార్త్సెవ్ ఒక విజ్ఞానవంతునితో మాట్లాడడానికి ప్రయత్నిస్తే, అతని పృచ్ఛకుడు అతనివైపు అపనమ్మకపు కోరచూపు చూసి, అడిగేవాడు: "అంటే, యిక యిష్టం వచ్చినట్లు వీధుల్లో ఒకరి గొంతులొకరు కోసుకోవచ్చు నన్నమాట?" యిక, అందరూ పనిచేయాలనీ, పని లేకుండా జీవితం అసంభవమనీ స్తార్త్సెవ్ భోజనం దగ్గరో, టీ దగ్గరో అంటే, అక్కడున్నవాళ్లందరూ దాన్ని నిందగా స్వీకరించి, పట్టుదలగా వాదం ప్రారంభించేవాళ్లు. కానీ యీ సాదా మనుషులు యే పనీ, బొత్తిగా యే పని గానీ, చేయరు, వాళ్లకు దేనిలోనూ ఆసక్తి లేదు, వాళ్లతో దేన్ని గురించీ మాట్లాడడం అసాధ్యం. స్తార్త్సెవ్ సంభాషణ తప్పించుకునేవాడు, వాళ్లతో కలిసి భోంచేయడమూ, పేకాట ఆడడమూ మాత్రం చేసేవాడు. యెవరైనా శుభకార్యానికి ఆహ్వానిస్తే, అతను వాళ్ల యింటికి పోయి, మౌనంగా భోంచేసేవాడు, తన ప్లేటుమీదనుండి దృష్టి పక్కకు తిప్పకుండా. అలాంటి సందర్భాలలో వాళ్లు మాట్లాడే మాటలన్నీ వినబుద్ధిగానివి, అన్యాయమైనవి, వట్టి మతి మాలినవి, అతనికి చిరాకు కలిగి, చిర్రెత్తేది; కానీ అతను నోరు కట్టేసుకునేవాడు. అత నెప్పుడూ అస్ఖలితమైన మౌనంతో ప్లేటువైపు చూస్తూ వుండినందున, పట్టణంలో అతన్ని "కోపిష్ఠి పోలిష్ మనిషి" అనేవాళ్లు, అతని శరీరంలో పోలిష్ రక్తం ఒక చుక్క కూడా లేనప్పటికీ.

అతను నాటకాలూ, పాట కచేరీలూ పరిహరించినాడు, కానీ పేకాటలో ప్రతి సాయంత్రం సుమారు మూడు గంటలు పొల్లు పోని ఆనందం పొందేవాడు. క్రమ క్రమంగా, అతనికే తెలియకుండా, మరొక ఆనందకారణం యేర్పడింది అతనికి: ఆ రోజు పట్టణంలో రోగుల యిండ్లవద్ద వచ్చిన డబ్బు రాత్రి జేబుల్లోనుండి బయటికి తీయడం అది; జేబుల నిండా కూరిన ఆ నోట్లు — పసుపురంగువీ, పచ్చ రంగువీ, సెంటు వాసన వచ్చేవీ, వినిగార్ వాసన వచ్చేవీ, ధూపం వాసన వచ్చేవీ, చేపల వాసన వచ్చేవీ — ఒకోసారి డెబ్బై రూబుళ్ల దాకా వుండేవి. అవి కొన్ని వందలు అయినప్పుడు అతను బాంకిలో జమకట్టేవాడు.

యెకతెరీనా ఇవానొవ్నా వెళ్లిపోయిన నాలుగేండ్లలో అతను రెండుసార్లు మాత్రమే, వేర యోసిఫొవ్నా ఆహ్వానంమీద, తూర్కిన్‌ల యింటికి వెళ్లినాడు, ఆమె తలనొప్పికి మందు యివ్వడానికి. యెకతెరీనా ఇవానొవ్నా ప్రతి వేసవిలోనూ యింటికి వచ్చేది, కానీ అత నెప్పుడూ ఆమెను చూడలేదు — యెందుకో అది తటస్థపడలేదు.

యిప్పుడు నాలుగేండ్లు గడచిపోయినాయి. ఒక ప్రశాంతమైన వెచ్చని ఉదయం ఆస్పత్రికి జాబు వచ్చింది. ద్మిత్రీ ఇయోనిచ్‌కి వేర యోసిఫొవ్నా రాసింది, ఆమె అతన్ని చూడక చాలా కాలా మైందనీ, అతను తప్పక వచ్చి తన్ను చూడాలనీ, తన తలపోటు తగ్గించాలనీ, ఆ రోజు తన జన్మదినం అనీ. ఉత్తరం అడుగున తాజా కలం వుండింది: "అమ్మ అభ్యర్థనలో నేనూ పాల్గొంటున్నాను. కిట్టీ."

స్తార్‌త్సెవ్ పోదామా వద్దా అని యోచించి, సాయంత్రం వెళ్లినాడు తూర్కిన్‌ల యింటికి.

ఇవాన్ పెత్రోవిచ్ కండ్లతో మాత్రమే నవ్వుతూ, తన మామూలు "హలో లోలో!"తో స్వాగతమిచ్చి, "నమస్తే! న్నమస్తే!" అన్నాడు.

యీ మధ్యలో బాగా వయసెక్కి, తల తెల్లబడిన వేర యోసిఫొవ్నా స్తార్‌త్సెవ్ చేయి నొక్కి, కృత్రిమంగా నిట్టూర్చి, యిలా అన్నది:

"డాక్టర్, మీరు మా యింటికి రావడమే లేదు, నాతో సరసాలాడడం మీకు యిష్టం లేనట్లుంది. నేను మీకు మరీ ముసలిదాన్ని అయినాను. కానీ యిప్పుడు పడుచుది వుందిగా. అమ్మాయికైనా అదృష్టం వుంటుందనుకుంటాను."

మరి కిట్టీయో? అమె మరింత సన్నగా, మరింత పాలిపోయి వుంది, కానీ మరింత మనోహరంగా, మరింత నాజూకుగా వుంది. ఆమె యిప్పుడు కిట్టీ కాదు, యెకతెరీనా ఇవానొవ్నా. ఆమె నవనవోన్మేషమూ, పసిపిల్ల లాంటి అమాయకపు చూపులూ అదృశ్యమైనాయి. ఆమె చూపులలో కొత్తది యేదో వుంది, యేదో

పిరికితనమూ, దోషి మనస్సంకోచమూ—యిక్కడ, యీ తూర్కిన్ గృహంలో, తాను పరాయి దైనట్లు.

''మనం కలుసుకోక యెన్ని యుగాలైందో,'' అన్నది ఆమె, అతనితో కరచాలనం చేస్తూ; ఆమె గుండె మహా వేగంగా కొట్టుకుంటున్నదని స్పష్టంగా తెలుస్తూ వుండింది. అతని ముఖంలోకి నిశ్చలంగా ఉత్సుకతతో చూస్తూ ఆమె కొనసాగించింది: ''మీరు బాగా లావైనారు! అప్పటికంటె నల్లబడి, పూర్తిగా వయసు వచ్చినట్లు కనపడుతున్నారు, కానీ మొత్తంమీద పెద్ద మార్పు లేదు.''

అతని దృష్టికి కామె యింకా ఆకర్షణీయంగా, మహా ఆకర్షణీయంగా, కన పడింది. కానీ ఆమెలో యేదో వెలితి కనపడింది, లేదా యేదో అనవసరమైంది కన పడింది, యేదైందీ అతనికి సరిగా తెలియలేదు. యేదైనప్పటికీ, పూర్వంలా అతని హృదయం స్పందించకుండా అది అరికట్టింది. అతనికి ఆమె పాలిన రంగు నచ్చలేదు, ఆమె చూపులు నచ్చలేదు, అమె ఛాయా మాత్రపు చిరునవ్వు నచ్చలేదు, ఆమె కంఠం నచ్చలేదు, కాసేపట్లో అతనికి ఆమె దుస్తులమీద అయిష్టం కలిగింది, ఆమె కూర్చున్న కుర్చీమీద అయిష్టం కలిగింది, తాను ఆమెను పెండ్లి చేసుకు న్నంత పని జరిగిన గతంలోని దేనిమీదనో అయిష్టం కలిగింది. అతనికి తన ప్రేమా, తన ఆశలూ, తన కలలూ, నాలుగేండ్ల క్రితం తనను సంచలింపజేసినవన్నీ జ్ఞాపకం వచ్చి, యిబ్బందిపడినాడు.

కేకులు తిని, టీ తాగినారు. వేర యోసిఫొవ్నా తన నవల చదివింది, వాస్తవ జీవితంలో యెన్నడూ జరగనిదాన్ని గురించి. స్తార్త్సెవ్ ఆమె అందమైన నెరసిన తలవైపు చూస్తూ కూర్చొని విన్నాడు, ఆమె యెప్పుడు ముగిస్తుందా అని యెదురు చూస్తూ.

''నవలలు రాయలేని మనిషి కాదు అప్రయోజకుడు; రాసి, ఆ విషయం దాచుకోలేని మనిషి,'' అనుకున్నాడు అతను మనసులో.

''నాస్తి పరవా!'' ఇవాన్ పెత్రోవిచ్ అన్నాడు.

తరువాత యెకతెరీనా ఇవానొవ్నా చాలాసేపు చాలా శబ్దం సృష్టిస్తూ వాయించింది. ఆమె ఆపినప్పుడు అందరూ చాలాసేపు ఆమెకు కృతజ్ఞతలూ, అభినందనలూ తెలిపినారు.

''యేమైనా, నేను ఆమెను చేసుకోకపోవడం మేలైంది,'' అనుకున్నాడు స్తార్త్సెవ్.

తోటలోకి పోదామని అతను తన్ను పిలుస్తాడని ఆమె అనుకుంది. ఆ ఉద్దే శంతోనే ఆమె అతనివైపు చూసింది; కానీ అత నేమీ అనలేదు.

అతని దగ్గరికి పోయి, ''మాట్లాడుకునే దేమీ లేదా?'' అన్నది ఆమె. ''మీరెలా వున్నారు చెప్పండి? యిక్కడ మీ జీవితం యెలా వుంది? యిన్నాళ్లూ నేను మిమ్మల్ని గురించి అనుకుంటున్నాను,'' అంటూ ఆమె అధీరంగా చెప్పసాగింది. ''మీకు ఉత్తరం రాద్దామనుకున్నాను, ద్యలీజ్‌కు వచ్చి మిమ్మల్ని చూద్దామనుకున్నాను, నిశ్చయించుకున్నాను. కానీ, మళ్లీ మనసు మార్చుకున్నాను — నన్ను గురించి యిప్పుడు మీరు యేమనుకుంటున్నారో! యీ వేళ మీరు వస్తారని యెంతో తహతహతో కాచుకున్నాను. బయటికి తోటలోకి వెళ్దాం పదండి.''

వాళ్లు తోటలోకి పోయి, నాలుగేండ్ల క్రితంలాగే, పురాతన మేపుల్ వృక్షంకింద బెంచీమీద కూర్చున్నారు.

''యిక చెప్పండి, యెలా వున్నారు?'' అన్నది ఆమె.

''బాగున్నాను, మీ దయవల్ల,'' స్తార్‌త్సెవ్ జవాబిచ్చినాడు.

ఆపైన యేమి చెప్పడానికీ అతనికి తోచలేదు. యిద్దరూ మౌనంగా కూర్చున్నారు.

''నా మనసేమీ బాగలేదు,'' అంటూ యెకతెరీనా ఇవానొవ్నా తన ముఖంమీద చేయి పెట్టుకుంది. ''మీరేమీ అనుకోకండి! నేను యింటికి వచ్చినందుకు యెంతో సంతోషంగా వుంది, అందరినీ చూసినందుకు సంతోషంగా వుంది, దీనికి నేను అలవాటు పడలేకున్నాను. ఓ, యేమి స్మృతులు! మీరూ, నేనూ తెల్లవార్లూ మాట్లాడుకుంటూ కూర్చుంటా మనుకున్నాను!''

ఆమె ముఖమూ, తళతళ మెరుస్తున్న కన్నులూ అతనికి కనిపిస్తూ వుండినాయి; యిక్కడ, చీకటిలో, ఆమె గదిలో కంటె పడుచుదిగా కనిపించింది, పూర్వపు పసిపిల్లలాంటి వాలకం కూడా ఆమెకు మళ్లీ వచ్చినట్లు కనిపించింది. అతనికి కనిపిస్తూనే వుంది, తనవైపు ఆమె ముసుగు లేని ఉత్సుకతతో చూస్తున్నదని — అతనికి మరింత సన్నిహితం కావాలనీ, ఒకప్పుడు తనను అంత గాఢంగా, అంత మృదువుగా, అంత నిష్ఫలంగా ప్రేమించిన ఆ మనిషిని అర్థం చేసుకోవాలనీ ఆమె కోరుతున్నట్లుంది ఆ ఉత్సుకత. ఆ ప్రేమకు గాను ఆమె కన్నులు అతనికి కృతజ్ఞత తెలిపినాయి. జరిగిందంతా అతను కూడా జ్ఞాపకం చేసుకున్నాడు, స్వల్ప వివరాలదాకా, తాను స్మశానంలో తిరిగిందీ, అలసిపోయి రాత్రి మూడవ జామున యింటికి పోయిందీ. హఠాత్తుగా, గతానికి పశ్చాత్తాపంతో అతనికి దుఃఖం కలిగింది. అతని గుండెలో ఒక జ్వాల జ్వలించింది.

''మిమ్మల్ని క్లబ్బుకు తీసుకపోయిన రాత్రి జ్ఞాపక ముందా?'' అన్నాడు అతను. ''వర్షం పడుతూ వుండింది, చీకటి....''

అతని గుండెలోని జ్వాల పెద్దదైంది. మాట్లాడాలనీ, తన జీవితం గురించి బాధ వెళ్లబోసుకోవాలనీ అతనికిప్పుడు కోరిక కలిగింది.

"ఆ, నేనా!" అంటూ అతను నిట్టూర్చినాడు. "నా జీవితం గురించి అడుగుతున్నారా? యిక్కడ మేమెలా జీవిస్తున్నామూ? మేము జీవించడం లేదు. మేము వయసెక్కుతూ, లావెక్కుతూ వుంటాం, దాని కేమీ నిర్బంధాలు పెట్టుకోము. ఒక రోజు లాగే మరొక రోజు వుంటుంది, జీవితం గడుస్తూ వుంటుంది, నిస్సారంగా, నిర్జీవంగా, యే అనుభూతులూ, ఆలోచనలూ లేకుండా.... పగలు డబ్బు సంపాదనలో గడుస్తుంది, సాయంత్రం క్లబ్బులో గడుస్తుంది, పేకాటగాళ్లతోనూ, తాగుడుగాళ్లతోనూ, వాగుడుగాళ్లతోనూ — వాళ్లందరూ నాకు అసహ్యమే. యిదెలాంటి జీవిత మంటారా?"

"మీకు మీ పని వుందిగా, జీవితంలో ఒక ఉదాత్తమైన లక్ష్యం. మీ ఆస్పత్రిని గురించి మాట్లాడడం మీ కంత యిష్టంగా వుండేది. అప్పుడు నేనొక వింత జంతువును, నేనొక గొప్ప పియానో వాద్యగత్తె ననుకునేదాన్ని. యీ రోజుల్లో ఆడపిల్లలందరూ పియానో వాయిస్తారు, అందరిలాగే నేనూ వాయించినాను; కానీ నాలో యే ప్రత్యేకతా లేదు. అమ్మ నవలలు రాయడం యెంతో, నేను పియానో వాయించడం అంతే. నేనప్పుడు మిమ్మల్ని అర్థం చేసుకోలేదనుకోండి, కానీ, తరువాత, మాస్కోలో, మిమ్మల్ని చాలాసార్లు అనుకున్నాను. జేమ్‌స్త్వో డాక్టర్‌గా వుండడం, రోగ పీడితులకు సాయంచేయడం, మానవులకు సేవచేయడం యెంత ఆనందం! యెంత ఆనందం!" అంటూ యెకతెరీనా ఇవానొవ్నా ఉబలాటంగా చెప్పింది. "మాస్కోలో మిమ్మల్ని గురించి అనుకున్నప్పుడు, మీరు నాకు ఆదర్శ, ఉదాత్తచరితులుగా కనిపించినారు...."

ప్రతి సాయంత్రం జేబులలోనుండి అంత సంతృప్తితో వెలికి తీసే నోట్లు జ్ఞాపకం వచ్చినాయి స్తార్‌త్సెవ్‌కు; అతని గుండెలోని జ్వాల ఆరిపోయింది.

యింట్లోకి పోడానికి అతను లేచినాడు. ఆమె అతని చేతిని ఆసరాగా పట్టుకుంది.

"నాకు తెలిసినవాళ్లలో కెల్లా మీరు ఉత్తములు" అంటూ ఆమె కొనసాగించింది. మనం అప్పుడప్పుడు కలుసుకుంటూ, మాట్లాడుకుంటూ వుందాం, యేమంటారు? అది మాట యివ్వండి నాకు. నేను నిజమైన పియానో వాద్యగత్తెను కాదు, నన్ను గురించి నాకేమీ భ్రమలు లేవు; మీముందర నేనెప్పుడూ పియానో వాయించను, సంగీతం గురించి మాట్లాడను."

వాళ్లు యింట్లోకి పోయినప్పుడు, గది వెలుతురులో స్తార్‌త్సెవ్ ఆమె మొఖాన్ని,

ఆమె తనవైపు చూసిన దుఃఖభరిత, తీక్ష్ణ, కృతజ్ఞతా పూర్వకమైన చూపునూ గమనించి, కాస్త చలించినాడు, కానీ మళ్లీ తనకు తాను నచ్చజెప్పుకున్నాడు:

"నేను ఆమెను చేసుకోకపోవడం మేలైంది."

అతను సెలవు తీసుకున్నాడు.

"భోజనం చేయకుండా వెళ్లిపోడానికి మీకు యెవరిచ్చినారు హక్కు!" అన్నాడు ఇవాన్ పెత్రోవిచ్, అతన్ని సాగనంపుతూ. "మీదంతా చాలా వీడ్డూరామ్‌గా వుంది. యేదీ, నీనటన చూపించు!" అంటూ అతను హాలులో వున్న పావాను కేకవేసినాడు.

పావా యిప్పుడు కుర్రవాడు కాదు, మీసం వచ్చిన యువకుడు. అతను ఒక భంగిమలో నిలబడి, చేయి యెత్తి, విషాద కంఠంతో అన్నాడు:

"నశించు, దుఃఖిత వనితా!"

యిదంతా యిప్పుడు స్తార్‌త్సెవ్‌కు చిరాకు మాత్రమే కలిగించింది. అతను బండిలో కూర్చొని, చీకటిలోని ఆ యింటినీ, తోటనూ, ఒకప్పుడు తనకు అంత ప్రీతిపాత్రమైనవాటిని, తొంగిచూసినప్పుడు, పాత స్మృతులన్నీ అతన్ని చుట్టుముట్టినాయి – వేర యోసిఫొవ్నా నవలలూ, కిట్టీ పియానో వాద్యమూ, ఇవాన్ పెత్రోవిచ్ హాస్యాలూ, పావా విషాద భంగిమా, అన్నీ. అతను తన్ను తాను ప్రశ్నించుకున్నాడు, పట్టణంలో కెల్ల అత్యంత ప్రతిభావంతులైన మనుషులు యింత అప్రయోజకులుగా వుంటే, యిక అసలు పట్టణం యెలా వుండాలని.

మూడు రోజుల తర్వాత, యెకతెరీనా ఇవానొవ్నానుండి పావా ఒక జాబు తెచ్చినాడు అతనికి.

"మీరు మా యింటికి రావడమే లేదు. యెందుకు?" అని ఆమె రాసింది అందులో. "మాపట్ల మీ మనసు మారిందేమో అని నాకు అనుమానంగా వుంది. యీ అనుమానం నన్ను భయకంపితురాలని చేస్తున్నది. నాకు ఊరట కలిగించండి, వచ్చి నా అనుమానం నిరాధారమని చెప్పండి.

"నేను మిమ్మల్ని చూసితీరాలి. భవదీయురాలు యె. తూ."

అతను జాబు చదువుకున్నాడు, ఒక క్షణం ఆలోచించి, పావాతో యిలా అన్నాడు:

"అబ్బాయ్, యీ రోజు రాలేనని చెప్పు. చాలా పని వుంది. ఒకటి రెండు రోజుల్లో వస్తాను."

మూడు రోజులు గడిచినాయి, వారం గడిచింది, కానీ అతను పోలేదు.

ఒకసారి అతను తూర్కిన్ యింటి దారిన బండిలో పోతూ వుండగా, అతనికి అనిపించింది, వెళ్లి చూసి రావడం బాగుంటుందని, కొద్ది నిముషాలసేపే అయినా. అతను కాస్త పర్యాలోచించినాడు.... ఆగకుండా సాగిపోయినాడు.

తూర్కిన్‌ల యింటికి మళ్లీ యెప్పుడూ వెళ్లలేదు అతను.

V

మరి కొద్ది సంవత్సరాలు గడిచినాయి. స్తార్త్సెవ్ యింకా లావైనాడు, బాగా స్థూలకాయుడైనాడు, గసపెట్టేవాడు, నడిచేటప్పుడు తల వెనక్కి వాల్చవలసి వచ్చింది. అతను బండిలో వెళ్లేటప్పుడు చూడడానికి చిత్రంగా వుండేది — అతనూ, అతని జేవురించిన, గుండ్రని వూదు ముఖమూ, గంటలు గల్లుగల్లుమనే మూడు గుర్రాలూ, సారథి స్థానంలో పాంతెలెయ్‌మోన్, అతనికి కూడా జేవురించిన గుండ్రని వూదు ముఖమూ, మెడమీద దట్టమైన కొవ్వు పొరలూ, కొయ్యవైనట్లు ముందుకు చాచిన రెండు చేతులూ, ''కుడి పక్కన వుండు!'' అంటూ యెదురుగా వచ్చే సారథులకు కేకలు వేయడమూ. బండిలో వెళ్లేది మనిషి కాక, యెవరో ఆటవిక జాతుల దేవు డైనట్లుండేది. పట్టణంలో స్తార్త్సెవ్‌కు యిప్పుడు ప్రాక్టీసు విస్తారంగా వుంది, ఊపిరి సలపడానికి తీరిక లేకుండా. అతనికి పల్లెసీమలో ఒక యెస్టేటు వుంది, పట్టణంలో రెండు యిండ్లు వున్నాయి, మరింత లాభకరమైన యింకొక యింటిమీద ఒక కన్ను వుంచినాడు. యేదైనా యిల్లు త్వరలో వేలానికి వస్తున్నట్లు అతను బాంకిలో విన్నాడా, యే తతంగమూ లేకుండా అత నాయింట్లో దూరి, గదులన్నీ కలదిరిగేవాడు, అర్ధ వస్త్రధారులైన ఆడవాళ్లూ, పిల్లలూ అతనివైపు భయ సంభ్రమాలతో చూస్తున్నా లెక్కచేయకుండా; ప్రతి గది తలుపునూ చేతికర్రతో తట్టుతూ,

''యిది పఠనాగారమా? యిది పడకగదా? యిదేం గది?'' అంటూ అడిగేవాడు.

అంత సేపూ అతను గసపెడుతూ, నుదుటి చెమట తుడుచుకుంటూ వుండేవాడు.

అతనికి బరువు బాధ్యతలు చాలా వుండినాయి, అయినా జేమ్‌స్త్వొ డాక్టరు పని అతను వదలేయలేదు; దురాశా పీడితుడైన అతనికి ప్రతిచోటా వచ్చేది రాబట్టుకోవాలని కాంక్ష. ద్యలీజ్‌లోనూ, పట్టణంలోనూ యిప్పు డతన్ని అందరూ ''ఇయోనిచ్'' అని ప్రస్తావించేవాళ్లు. ''యెక్కడికి ఇయోనిచ్ బయలుదేరినాడు?'' అనో, లేక ''ఇయోనిచ్‌ని పిలిపించడం మంచిది కదూ?'' అనో.

అతని గొంతు — బహుశా కంఠం చుట్టూ పెరిగిన కొవ్వు పొరల మూలంగా — కీచు గొంతు అయింది. అతని మనస్థితి కూడా మారి, చిరాకూ, విరసత్వమూ యెక్కువైనాయి. రోగులను పరీక్షించేటప్పుడు అతను తరుచుగా ఓర్పు కోల్పోయి, అసహనంతో నేలమీద చేతికర్రతో బాది, విరస కంఠంతో అనేవాడు:

''దయయుంచి నా ప్రశ్నలకు జవాబులు మాత్రమే యివ్వండి. అనవసరంగా మాట్లాడకండి.''

అతను ఒంటరిగా జీవిస్తున్నాడు. అతని జీవితం గానుగెద్దు బతుకులా వుంది, అతనికి దేనిలోనూ ఆసక్తి లేదు.

ద్యలీజ్‌లోని అతని జీవిత కాలంలో అతనెరిగిన ఒకే ఒక ఆనందం, బహుశా చివరి ఆనందం, కిట్టీ పట్ల అతనికి కలిగిన ప్రేమ. అతను యెప్పుడైనా ఒక రోజు సాయంత్రం క్లబ్బులో పేకాట ఆడుతాడు, తరువాత పెద్ద టేబుల్‌వద్ద ఒంటిగా కూర్చొని, భోంచేస్తాడు. క్లబ్బు నౌకర్లలో కెల్ల పాతవాడూ, అత్యంత గౌరవనీయుడూ అయిన ఇవాన్ యెప్పుడూ అతనికి వడ్డిస్తాడు. అతనికి లాఫిట్ నంబర్ 17 పానీయం యిస్తారు; క్లబ్బు నిర్వహణోద్యోగులకూ, వంటవాళ్లకూ, నౌకర్లకూ, అందరికీ అతని యిష్టానిష్టాలు తెలుసు, అందరూ అతన్ని సంతుష్టి పరచడానికి ప్రయత్నిస్తారు; లేకపోతే, అతను ఉగ్ర తాండవం చేస్తూ, నేలమీద చేతికర్రతో బాదుతుంటాడు.

యెప్పుడైనా ఒకసారి అతను పక్కకు తిరిగి, సంభాషణలో పాల్గొనేవాడు.

''యేమిటి మీరు మాట్లాడేది? ఆఁ? యెవరు?''

పక్క టేబుల్‌వద్ద సంభాషణ తూర్కిన్‌లమీదికి మళ్లితే, అతను అడుగుతాడు:

''తూర్కిన్‌లను గురించా మీరు మాట్లాడేది? వాళ్లమ్మాయి పియానో వాయిస్తుందే వాళ్లా?''

అతన్ని గురించి చెప్పవలసిందంతా దాదాపు అంతే.

యిక తూర్కిన్‌లా? ఇవాన్ పెత్రోవిచ్‌కి వయసెక్కినట్లులేదు, యేవిధంగానూ మారలేదు, అతనింకా హాస్యాలాడుతూ, తమాషా కథలు చెప్తాడు. వేర యోసిఫొవ్నా యెప్పటిలాగే ఉబలాటంగా, మోమోటం లేకుండా, ఆగంతుకులకు తన నవలలు చదివి వినిపిస్తుంది. కిట్టీ రోజూ నాలుగు గంటలు సాధన చేస్తుంది. ఆమెకు వయసు యెక్కినట్లు స్పష్టంగా కనపడుతున్నది, తరుచుగా జబ్బుపడుతున్నది; ప్రతి శరత్తులోనూ తల్లితో కలిసి క్రైమియాకు పోతుంది.

ఇవాన్ పెత్రోవిచ్ వాళ్లను సాగనంపేటప్పుడు, స్టేషన్‌లోనుండి రైలు కదలుతుండగా, ''సుఖీభవ!'' అని అరుస్తూ, కండ్లు తుడుచుకుంటాడు. చేతిగుడ్డ వూపుతాడు.

1898

# గుల్లలో జీవించిన మనిషి

ఆ వేటగాళ్లకు మిరొనోసిత్స్కాయె గ్రామం దగ్గర చీకటిపడింది; గ్రామపెద్ద ప్రాకోఫియ్‌కు చెందిన దొడ్డిలో ఆ రాత్రి గడపడానికి నిశ్చయించుకున్నారు వాళ్లు. వాళ్ళు యిద్దరు — పశు శస్త్రవైద్యుడు ఇవాన్ ఇవానిచ్, హైస్కూలు టీచరు బూర్కిన్. ఇవాన్ ఇవానిచ్‌కి చిత్రమైన యింటిపేరు వుండింది: చీమ్‌ష-హిమలైస్కి. ఆ పేరు అతనికి అతికినట్లు లేదు; అందరూ అతన్ని పేరుతోనూ, పైతృక నామంతోనూ పిలిచేవాళ్లు — ఇవాన్ ఇవానిచ్ అని. అతను పట్టణానికి అనతి దూరంలో వున్న పశు పోషణ కేంద్రంలో వుండినాడు; యిప్పుడు ఆరుబయట విహారార్థం వేటకు వచ్చినాడు. హైస్కూలు టీచరు బూర్కిన్ ప్రతి వేసవి పి. ప్రభువుగారి యెస్టేటులో గడిపేవాడు; ఆ ప్రాంతాల జనం అతన్ని తమలో ఒకనిగానే పరిగణించేవాళ్లు.

యిద్దరూ నిద్రపోలేదు. సన్నగా, పొడవుగా, పెద్ద మీసాలతో వున్న వృద్ధుడు ఇవాన్ ఇవానిచ్ పైపు కాలుస్తూ వాకిలి బయట వెన్నెలలో కూర్చున్నాడు. బూర్కిన్ లోపల గడ్డిమీద పండుకున్నాడు, చీకటిలో కనిపించకుండా.

వాళ్లు కథలు చెప్పుకుంటూ పొద్దుబుచ్చినారు. గ్రామపెద్ద భార్య మాగ్రాను గురించి వాళ్లు మాట్లాడుకున్నారు. ఆమె సకల విధాలా ఆరోగ్యం గల మనిషి, యే విధంగానూ తెలివి తక్కువది గాదు; ఆమె జీవితంలో స్వగ్రామం దాటి బయటికి వెళ్లి యెరగదు. ఆమె పట్నం చూడలేదు, రైలు చూడలేదు, గత పదేండ్లూ పొయ్యి దగ్గర కూర్చొని గడిపింది, రాత్రిపూట మాత్రమే బయటికి మొగం చూపేది.

"అయినా, అదేమంత చిత్రం?" అన్నాడు బూర్కిన్. "యీ ప్రపంచంలో బోలెడుమంది వున్నారు అలాంటివాళ్లు, స్వభావతః యేకాంతజీవులు, నత్త లాగ తమ గుల్లలో దూరుకోడానికి ప్రయత్నించేవాళ్లు. బహుశా యిది కేవలం పునః పురాజీవితపు వ్యక్తీకరణ కావచ్చు — మన పూర్వులు సంఘజీవులు కాకముందు, ఒంటరిగా గుహలలో జీవించిననాటి కాలానికి తిరిగిపోవడం. లేక, మానవులలో వాళ్లూ ఒక జాతి కావచ్చు — యెవరికి తెలుసు? నేను ప్రకృతి శాస్త్రజ్ఞుని కాదు; యిలాంటి సమస్యలు పరిష్కరించడానికి ప్రయత్నించడం నా పని కాదు; మాగ్రా లాంటివాళ్లు అరుదు కాదని మాత్రమే నేను చెప్పదలచుకొన్నది. అంతెందుకు — ఒకటి రెండు నెలల క్రితమే మా వూర్లో నా సహోద్యోగి ఒకాయన మరణించినాడు, గ్రీకు భాష టీచరు బెలికొవ్. అతన్ని గురించి మీరు వినివుంటారు. అతను యెంత మంచి వాతావరణంలో నైనా గొడుగూ, బూట్ల తొడుగులూ, చలి కోటూ లేకుండా యిల్లు కదిలేవాడు కాదని ప్రసిద్ధి. అతను డుగు ఒక తొడుగులో పెట్టేవాడు, అతని గడియారానికి ఒక చర్మం తొడుగు వుండేది, అతను పెన్సిలు చెక్కుకోడానికి కత్తి తీసుకుంటే, అది కూడా ఒక తొడుగునుండి తీయవలసి వచ్చేది. అతని ముఖానికి కూడా ఒక తొడుగు వున్నట్లుండేది — ముఖం యెప్పుడూ పైకెత్తిన కోటు కాలరు చాటున వుండేది. అతను నల్ల కండ్లద్దాలూ, మందం స్వెట్టరూ ధరించేవాడు, చెవులలో దూది పెట్టుకునేవాడు, గుర్రపుబండి యెక్కితే, తలుపు మూయమనేవాడు. నిజానికతను తన కొక ముసుగు సృష్టించుకోవాలనే నిత్య, దుర్వార ప్రేరణ కనబరచేవాడు — అది తన్ను యేకాంతపరచి, బాహ్య ప్రభావాలనుండి రక్షించే తొడుగు అయినట్లు. వాస్తవం అతనికి చిరాకూ, ఆందోళనా కలిగించి, నిత్య భీతావహంలో వుంచేది. బహుశా తన పిరికితనాన్నీ, వర్తమానం

తనలో కలిగించిన అసహ్యాన్నీ సమర్థించుకోడానికి అతను నిత్యం భూతకాలాన్నీ, యెప్పుడూ యెక్కడా లేని వాటినీ ప్రశంసించేవాడు. అతను బోధించే మృత భాషలు కూడా అతనికీ, వాస్తవ జీవితానికీ మధ్య వున్న బూట్లు తొడుగులూ, గొడుగులూ మాత్రమే.

" 'గ్రీకు భాష యెంత అందమైనది, యెంత శ్రావ్యమైనది!' అనేవాడు అతను ఆనంద పరవశత్వంతో. దానిని రుజువుచేయడానికి అతను కన్నులు సగం మూసి, ఒక వేలు పైకెత్తి, 'ఆన్ – త్రో – పాస్!'* అనేవాడు.

"బేలికొవ్ తన ఆలోచనలు కూడా ఒక తొడుగులో పెట్టడానికి ప్రయత్నించే వాడు. యేదో ఒకదానిని నిషేధించే సర్క్యులర్లూ, పత్రికా వ్యాసాలూ మాత్రమే అతని బుద్ధి కందేవి. బడిపిల్లలు రాత్రి తొమ్మిది గంటల తర్వాత వీధుల్లో వుండడాన్ని నిషేధించే ఆదేశాలు సర్క్యులేట్ చేయబడినప్పుడు, లేదా కామ వ్యాపారాన్ని ఖండించే వ్యాసం ప్రచురింపబడినప్పుడు, అతనికి అన్నీ స్పష్టంగా, నిశ్చితంగా వుండినాయి – యీ విషయాలు శాశ్వతంగా నిషేధింపబడినాయి. అనుమతించడమన్నా, ప్రోత్సహించడమన్నా, అతని దృష్టిలో, వాటిలో యేదో సందేహం, యేదో చెప్పకుండా మిగిలిపోయింది, అస్పష్టమైనది వున్నట్లుండేది. ఒక నాటక బృందమో, రీడింగురూమో, కాఫీహోటలో ప్రారంభించడానికి అనుమతించబడినప్పుడు, అతను తల తిప్పుతూ, మెత్తగా అనేవాడు:

" 'అది మంచి పనే అనుకోండి, కానీ... దాని వలన హాని యేదీ జరగదని ఆశిద్దాం?'

"నిబంధనలకు ఉల్లంఘన గానీ, ఉపేక్ష గానీ, యే కొంచెం జరిగినా, అది అతనికి యేమాత్రమూ సంబంధించనిదైనా సరే, అతను అమాంతం క్రుంగి పోయేవాడు. అతని సహోద్యోగి యెవరైనా ప్రార్థనకు ఆలస్యంగా వచ్చినా, బడిపిల్లల టక్కరితనం గురించి ఫుకార్లు యేవైనా అతని చెవులబడినా, పిల్లల ప్రవర్తనకు బాధ్యత వహించే మహిళ యెవరైనా రాత్రి పొద్దుపోయిన తర్వాత మిలిటరీ ఆఫీసరు పక్కన కనిపించినా, అతను పూర్తిగా ఆందోళన పడిపోయి, అది క్షేమకరం కాదని పదేపదే అనేవాడు. టీచర్స్ కౌన్సిలు సమావేశాలలో అతను తన అతి జాగ్రత్తల తోనూ, సందేహాలతోనూ, భయాలతోనూ, సూచనలతోనూ (తొడుగులోని మనస్సుకు విలక్షణమైనవాటితో) మమ్మల్ని బాగా హింసించేవాడు: ఆడపిల్ల ల

* ఆంత్రొపాస్ అంటే గ్రీకు భాషలో "మనిషి." – సం.

బడిలోనూ, మగపిల్లల బడిలోనూ పిల్లలు మరీ సిగ్గుమాలిన విధంగా ప్రవర్తిస్తున్నారు, క్లాసులలో ఘోరమైన అల్లరి చేస్తున్నారు — ఒకవేళ అధికార్ల కీ విషయం తెలిస్తే, హాని యేదీ జరగదని ఆశిద్దాం అనేవాడు, రెండవ ఫారంలోని పెత్రోవ్‌నూ, నాల్గవ ఫారంలోని యెగోరొవ్‌నూ బహిష్కరిస్తే బాగుండదా అనేవాడు. మీకు తెలుసా? అతని నిట్టూర్పులతో, మూల్గులతో, చిన్న తెల్లని ముఖంమీద — పిల్లి ముఖం లాంటిది లెండి అది — ఆ చిన్న తెల్లని ముఖంమీద నల్లని కండ్లద్దాలతో, మమ్మల్ని యెంత క్రుంగిపోయేటట్లు చేసినాడంటే, మేము లొంగిపోయి, పెత్రోవ్‌కూ, యెగోరొవ్‌కూ ప్రవర్తనకు తక్కువ మార్కులు యిచ్చి, వాళ్లను లాకప్‌లో పెట్టించి, చివరకు బహిష్కరించినాము. మా యిండ్లకు వచ్చి మమ్మల్ని చూసే చిత్రమైన అలవాటు వుండింది అతనికి. తోటి ఉపాధ్యాయుని యింటికి పోయి అతను యేమీ మాట్లాడకుండా కూర్చునేవాడు, అప్రమత్త వాలకంతో. యే గంటో అతను అలా కూర్చొని, లేచి వెళ్లిపోయేవాడు. దీని నతను 'సహోద్యోగులతో సత్సంబంధాలు పెట్టుకోవడం' అనేవాడు. అతనికిది సుఖమైన కర్తవ్యం కాదనీ, తోటి ఉపాధ్యాయుని యింటికి పోవడం తన విధిగా భావించినందువల్ల మాత్రమే అతను మమ్మల్ని చూడడానికి వస్తున్నాడనీ తేటతెల్లంగా వుండేది. అతనంటే మా కందరికీ భయం. హెడ్‌మాస్టర్‌కు కూడా. కాస్త ఆలోచించండి! మా టీచర్లు మొత్తంమీద మంచి వాళ్లు, తెలివితేటలు గలవాళ్లు, తుర్గేనెవ్, ష్చెద్రీన్ సాహిత్యాలమీద పెరిగినవాళ్లు. కానీ యీ జానెడు మనిషి, యెప్పుడూ యెడబాయని గొడుగూ, బూట్లు తోడు గులూ గల మనిషి, పదైదేండ్ల పాటు మొత్తం పాఠశాలను తన చేతికింద పెట్టుకు న్నాడు! పాఠశాలను మాత్రమే కాదు, మొత్తం పట్టణాన్ని! మా ఆడవాళ్లు శనివారం నాటకాలు వదలుకున్నారు, అతను కనుక్కుంటాడనే భయంతో. మత గురువులు అతని సమక్షంలో మాంసం తినడానికీ, పేకాట ఆడడానికీ భయపడేవాళ్లు. బేలికొవ్ లాంటివాళ్ల ప్రభావంతో మా పట్టణంలోనివాళ్లు ప్రతిదానికీ భయపడ సాగినారు. యేమి చేయాలన్నా భయమే వాళ్లకు, బిగ్గరగా మాట్లాడాలన్నా, ఉత్తరాలు రాయాలన్నా, స్నేహితులను చేసుకోవాలన్నా, పుస్తకాలు చదవాలన్నా, బీదవాళ్లకు సాయం చేయాలన్నా, చదువు రానివాళ్లకు చదువు చెప్పాలన్నా....''

ఇవాన్ ఇవానిచ్ గొంతు సవరించుకున్నాడు, యేదో తూకం గల విషయం చెప్పడానికి సిద్ధపడుతున్నట్లు; కానీ మొదట, ఆరిపోయిన పైపును మళ్లీ ముట్టించి, చంద్రునివైపు చూసి, తరువాత మాత్రమే తీరికగా యిలా అన్నాడు:

''అవును, మంచివాళ్లు, తెలివితేటలు గల వాళ్లు, తుర్గేనెవ్, ష్చెద్రీన్

బ్లోక్ మొదలైనవాళ్ల నందరినీ చదివేవాళ్ళు, అయినా వాళ్లు లొంగినారు, అతన్ని భరించినారు.... అంతే.''

''బేలికొవ్వూ, నేనూ ఒకే భవనంలో వుండినాము, ఒకే అంతస్తులో,'' అంటూ బూర్కిన్ కొనసాగించినాడు. ''మా వాకిలికి సరిగా యెదురుగా అతని వాకిలి, మేము ఒకరి నొకరు నిత్యం చూసుకునే వాళ్లం, అతని గృహ జీవితం గురించి నాకు బాగా తెలుసు. అది కూడా అదే కథే: డ్రెస్సింగు గౌనూ, రాత్రి టోపీ, మూసిన తలుపులూ, వేసిన గడెలూ, తెగబారెడు పొడవున నిబంధనలూ, నిషేధాలూ, అదే నీతిసూత్రమూ — యే హానీ జరగదని ఆశిద్దాం! లెంట్ ఆహారం అతనికి పడేది కాదు; కానీ అతను మాంసం తినకూడదు; తింటే, బేలికొవ్ లెంట్‌ను పాటించలేదని లోకం అంటుంది. కనుక అతను వెన్నలో వేయించిన చేపలు తినేవాడు — అది ఉపవాసం కాదు, కానీ అది మాంసమని కూడా అనలేరు. అతను ఆడ పనిమనుషులను పెట్టుకోలేదు, లోకం 'యేమైనా' అనుకుంటారని. అతని కొక మగ వంటమనిషి వుండినాడు, అఫనాసియ్ అనే అరవై యేండ్ల ముసలివాడు, తాగుబోతు, తలతిక్క మనిషి, యెప్పుడో కొంత కాలం మిలిటరీలో నౌకరుగా పనిచేసినందున వంటచేయడం తెలిసినవాడు. అఫనాసియ్ మామూలుగా చేతులు కట్టుకొని, వాకిలి బయట నిలుచుకొని వుండేవాడు, యెప్పుడూ పెద్ద నిట్టూర్పుతో అదే మాట మళ్లీమళ్లీ గొణుగుతూ:

'' 'ఆ, యీమధ్య యెప్పుడూ కనిపిస్తుంటారు వాళ్ళు!'

''బేలికొవ్ బుల్లి పడకగది పెట్టె లాంటిది; మంచానికి చాందినీ వుండేది. పండుకునే టప్పుడు అతను తలకు ముసుగుతన్నేవాడు. గది వేడిగా, ఉక్కగా వుండేది. గాలికి మూసిన తలుపులు ధణధణలాడేవి, పొగగూడు ఓంకారనాదం చేసేది. వంట గదిలో నిట్టూర్పులు వినపడేవి, అరిష్టసూచకమైన నిట్టూర్పులు....

''దుప్పటికింద వణుకుతూ పండుకునేవాడు అతను. యేదో అరిష్టం జరుగుతుందని అతనికి భయం, అఫనాసియ్ తనను ఖూనీ చేస్తాడని, యింట్లో దొంగలు పడతారని; యీ భయాలతో అతనికి పీడకలలు వచ్చేవి. ప్రొద్దునపూట మేము కలిసి బడికి వెళ్లేటప్పుడు అతను యెప్పుడూ పాలిపోయి, నీరసంగా వుండేవాడు. అతను సమీపించే జన సమ్మర్దపు పాఠశాల అతని భయాసహ్యాలకు కారణమనీ, స్వభావతః యేకాంతజీవి అయిన అతనికి నాపక్కన నడవడం వెగటుగా వుందనీ తేటతెల్లంగా వుండేది.

'' 'క్లాసులలో అంత అల్లరి చేస్తారు,' అనేవాడు అతను, తన హృదయ

భారానికి కారణం చెప్పడానికి ప్రయత్నిస్తున్నట్లు. 'పరమ సిగ్గుమాలిన పని!'

"యేం జరిగిందనుకున్నారు? యీ గ్రీకు టీచరు, యీ గుల్లలోని నత్త ఒకసారి పెండ్లి చేసుకున్నంత పని జరిగింది."

ఇవాన్ ఇవానిచ్ తకీమని దొడ్డివైపు తల తిప్పినాడు.

"నిజంగానా!" అన్నాడు అతను.

"నిజంగా. పెండ్లి చేసుకున్నంత పని జరిగింది — నమ్మడం కష్టమే అనుకోండి. మాకు చరిత్రకూ, భూగోళానికీ కొత్త టీచరు వచ్చినాడు, ఉక్రేనా మనిషి, మిహయిల్ సావ్విచ్ కొవలేంకొ అని. అతని వెంట అతని సోదరి వార్యా కూడా వచ్చింది. అతను యువకుడు, పొడవుగా, చామన చాయగా వుండినాడు, పెద్ద చేతులూ, గంభీరమైన కంఠంతో కలిసి వుండేలాంటి ముఖమూ వుండినాయి అతనికి. నిజాని కతనిది మేఘ గంభీర కంఠం, గుహలోనుండి వచ్చినట్లుండేది శబ్దం.... అతని సోదరి అంత చిన్న వయసుది కాదు, ముప్పై ఆ మధ్య వుంటుంది; ఆమె కూడా పొడగరి; జీలుగ బర్ర లాగ సన్నగా, నల్లని కనుబొమలూ, యెర్రని బుగ్గలూ, మహా ముచ్చటైన అమ్మాయి ఆమె; సరదాగా, నోరు మూతపడకుండా, యెప్పుడూ ఉక్రైనా పాటలు పాడుతూ, యెప్పుడూ నవ్వుతూ వుండేది. మాటకు ముందు గలగలగల నవ్వులు కురిపించేది. ఆ అక్కా తమ్ముళ్లతో మాకు మొట్ట మొదట నిజమైన పరిచయం కలిగింది, నాకు జ్ఞాపకమున్నంత వరకు, మా హెడ్మాస్టరు పుట్టిన రోజు పార్టీలో. టీచర్లు కఠినమైనవాళ్లు, సంప్రదాయ బద్ధులు, నిరుత్సాహ జీవులు, పార్టీలకు పోవడం కూడా ఒక విధిగా యెంచేవాళ్లు; అలాంటివాళ్ల మధ్య హఠాత్తుగా, సముద్రపు నురుగులోనుండి ఒక కొత్త అప్సరస ఉద్భవించింది, నడుములమీద చేతులు పెట్టుకొని నడిచే అప్సరస, ఆడుతూ, పాడుతూ, నవ్వుతూ వుండే అప్సరస.... 'గాలి వీస్తున్నది' అనే పాట ఆమె యెంతో ఆవేశంతో పాడేది, తరువాత యింకొక పాట పాడేది, తరువాత మరొకటి; మేమందరమూ ముగ్ధులమైనాము, బేలికొవ్ కూడా. అతను ఆమె పక్కన కూచొని తియ్యని చిరునవ్వుతో యిలా అన్నాడు:

"'ఉక్రైనా భాష మాధుర్యంలోనూ, ఆహ్లాదకరమైన శ్రావ్యతలోనూ పురాతన గ్రీకు భాషలాంటిది.'

"ఆమె ఉబ్బిపోయి, గద్యాచి తాలూకాలోని తమ పొలం గురించి హృదయపూర్వకమైన అనురక్తితో చెప్పసాగింది — అక్కడ వాళ అమ్మ వుంది, అక్కడ యెలాంటి పియర్స్, యెలాంటి కరబూజ పండ్లూ, యెలాంటి గుమ్మడికాయలూ

వున్నాయని! ఉక్రైనాలో గుమ్మడికాయలను మూరో లంటారు, నీలి వంకాయలతోనూ, యెర్ర మిరపకాయలతోనూ మహా పసందైన పులుసు చేస్తారు, యెంత బాగుంటుందో తెలుసా అది!

''మేము ఆమె చుట్టూ చేరి, వింటూ కూర్చున్నాము. మా కందరికీ ఒకే ఆలోచన వచ్చింది.

'' 'వీళ్లిద్దరూ యెందుకు పెండ్లి చేసుకో కూడదు?' హెడ్‌మాస్టరు భార్య మెల్లగా నాతో అన్నది.

''యెందువల్లనో హఠాత్తుగా ప్రతివొకరికీ గుర్తువచ్చింది, బేలికొవ్ బ్రహ్మచారి అని. అతని జీవితంలో అంత ముఖ్యమైన విషయాన్ని మేము యెలా గుర్తించలేదో, యెలా అది పూర్తిగా మా దృష్టిని తప్పించుకున్నదో మాకు ఆశ్చర్యమైంది. స్త్రీపట్ల అతనివైఖరి యేమిటి, యీ ముఖ్య సమస్యను అతను యెలా పరిష్కరించు కున్నాడు? దీన్ని గురించి మేమెప్పుడూ ఆలోచించలేదు. యేడాది పొడుగునా బూట్లు తొడుగులు తొడుక్కొని, చాందినీకింద పండుకునేవాడు ప్రేమించగలడనే భావాన్ని మేమెవరమూ ఒప్పుకోలేకపోయి వుండవచ్చు.

'' 'అతనికి నలభైకి పైగా వున్నాయి, ఆమెకు ముప్పై....' అంటూ హెడ్‌మాస్టరు భార్య కొనసాగించింది. 'అతన్ని వొప్పుకుంటుందనుకుంటాను.'

''కేవలం యేమీ తోచక పోవడంతో, చిన్న వూర్లలో యెలాంటి అసంబద్ధమైన, నిరుపయోగమైన పనులు చేస్తామని! యెందుకంటే, చేయవలసిన పని యెప్పుడూ చేయం గనుక. యీ బేలికొవ్‌కు, వివాహితుని పాత్రలో యెవరూ ఊహించలేని మనిషికి, పెండ్లి చేయడం మా పని అయినట్లు నూ కెందుకు అనిపించింది, యెందుకు? హెడ్‌మాస్టరు భార్యకూ, యిన్‌స్పెక్టరు భార్యకూ, పాఠశాలతో సంబంధమున్న ఆడవాళ్ల కందరికీ ముఖాలు వికసించినాయి, వాస్తవంగా అందరికీ మరింత అందం వచ్చింది; చివరకు వాళ్ల జీవితంలో ఒక లక్ష్యం లభించినట్లు. హెడ్‌మాస్టరు భార్య నాటకశాలలో ఒక బాక్సు తీసుకుంది, ఆ బాక్సులో యెవరున్నారో తెలుసా? వార్యా వుంది, పెద్ద విసనకర్రతో విసరుకుంటూ, కళకళలాడుతూ, ఆనందంగా; ఆమె పక్కన బేలికొవ్ వున్నాడు, చిన్న మనిషి, ముడుక్కొని, తన గదిలోనుండి పట్టకారుతో వెలికి లాక్కొని వచ్చినట్లు. నేనే ఒక పార్టీ యిచ్చినాను; దానికి నేను బేలికొవ్‌నూ, వార్యానూ ఆహ్వానించాలని ఆడవాళ్లు పట్టుబట్టినారు. ఒక్క మాటలో చెప్పాలంటే, మేము తేరు కదిలించినా మన్నమాట. పెండ్లి మాట వార్యాకు అయిష్టం కాదని అర్థమైంది. తమ్మునితో కలిసి వుండడం ఆమెకు సంతోషంగా లేదు; పొద్దస్తమానం

వాళ్ళు కీచులాడుకునేవాళ్లు. వాళ్ల జీవితంలో ఉదాహరణప్రాయమైన రంగం ఒకటి వినండి: కొవలేంకొ పొడవుగా, బలిష్ఠంగా, వీధిలో అంగలు వేసుకుంటూ నడుస్తుంటాడు, బుటాపని చేసిన చొక్కాతో, టోపీకిందనుండి నొసటిమీదికి వ్రాలిన ముందరి జూలుతో, ఒక చేతిలో పుస్తకాల కట్టా, మరొక చేతిలో సొట్టలు తిరిగిన చేతికర్రా పట్టుకొని. అతని సోదరి కూడా పుస్తకాలు మోసుకుంటూ అతనివెంట వస్తూవుంటుంది.

" 'నీవు చదవలేదు మీష, అది!' అని ఆమె కేక వేస్తుంది. 'నీవు చదవలేదు, నాకు తెలుసు, నీవెప్పుడూ చదవలేదని నాకు నిశ్చయంగా తెలుసు!'

" 'నాకు తెలుసు, నేను చదివినానది,' అని కొవలేంకొ కేకవేస్తాడు, రోడ్డుమీద చేతికర్ర తాటిస్తూ.

" 'నీ పుణ్యమాయిరి మీష! యెందు కంత కోపం? యేమైనా యిది నీతికి సంబంధించిన విషయం!'

" 'నాకు తెలుసు, నేను చదివినాను!' అని కొవలేంకొ యింకా బిగ్గరగా అరుస్తాడు.

"యిక యింటివద్ద, యెవరైనా వాళ్లను చూడడానికి వెళ్ళినప్పుడల్లా, వాళ్ళు కీచులాట ప్రారంభిస్తారు. బహుశా ఆ జీవితంతో ఆమెకు ముఖం మొత్తి, సొంత కాపురం కోసం తపిస్తూ వుండివుంటుంది. తరువాత, ఆమె వయస్సు: యేరి కోరుకోడానికి వ్యవధి లేదు, ఆడపిల్ల యెవరినైనా పెండ్లి చేసుకుంటుంది, గ్రీకు టీచరునైనా సరే. అన్నట్లు, మన ఆడపిల్ల లందరూ అంతే — యెవరినైనా సరే పెండ్లి చేసుకుంటారు, పెండ్లి అనేది చేసుకోడానికి. అది పోనీలే, వార్యా యీ మా బేలికొవ్ పట్ల యిష్టం చూపించడం ప్రారంభించింది.

"యిక బేలికొవో? అతను మా అందరి యిండ్లకు వచ్చినట్లే కొవలేంకొ యింటికీ వెళ్లేవాడు. చూడడానికి వెళ్లి, యేమీ మాట్లాడకుండా కూర్చునేవాడు. అతను మౌనంగా కూర్చొనివుంటే, వార్యా 'గాలి వీస్తున్నది' అని పాడేది, తన నల్లని కన్నులతో అతనివైపు చూస్తూ, లేదా హఠాత్తుగా గలగలగల పగలబడి నవ్వేది.

"హృదయానికి సంబంధించిన వ్యవహారాలలో, ముఖ్యంగా అందులో పెండ్లి యిమిడివున్నప్పుడు, సూచన దుర్వారమైనది. ప్రతివొకరూ — అతని సహోద్యోగులూ, ఆడవాళ్లూ — బేలికొవ్‌కు నమ్మజెప్పసాగినారు, అతను పెండ్లిచేసుకోవడం న్యాయమనీ, అతనికి పెండ్లి ఒకటే యిక జీవితంలో మిగిలింది అనీ. మేమందరమూ అతన్ని అభినందించి, గంభీరమైన ముఖ భంగిమలతో రకరకాల మామూలు మాటలు చెప్పినాము, పెండ్లి అనేది గురుతరమైన చర్య అనీ, వగైరా. పైగా,

వార్యా నిరాకర్షణీయమైనది కాదు, ఆకర్షణీయమైనదని కూడా అనవచ్చు, పెద్ద ఉద్యోగస్థుని కూతురు, సొంత పొలం వుంది, అంతకంటె ముఖ్యమైనది యేమిటంటే, అతన్ని అపేక్షతో చూసిన మొట్టమొదటి స్త్రీ. ఆవిధంగా అతను మనసు అర్పించి, పెండ్లి చేసుకోవడం తన విధి అనే నమ్మకానికి వచ్చినాడు.''

''అతని గొడుగూ, బూట్లు తొడుగులూ తీసిపారవేసే తరుణం అది!'' అన్నాడు ఇవాన్ ఇవానిచ్.

''ఆఁ—కానీ అది అసాధ్యమైంది! అతను వార్యా ఫోటోను తన డెస్కుమీద పెట్టుకున్నాడు, వార్యాను గురించీ, సంసార జీవితం గురించీ, వివాహంలోని గురుతర బాధ్యత గురించీ మాట్లాడడానికి నాదగ్గరికి వస్తూవుండినాడు, తరుచుగా కొవలేంకొ యింటికి వెళ్లేవాడు, కానీ తన జీవిత విధానం అణుమాత్రమూ మార్చుకోలేదు. మార్చుకోకపోవడమే కాదు—పెండ్లి చేసుకోవాలనే నిర్ణయం అతనిమీద బాధాకరమైన ప్రభావం కలిగించినట్లుంది, అతను యింకా చిక్కిపోయినాడు, యింకా పాలిపోయినాడు, తన గుల్లలోకి యింకా తిరోగమించినట్లు కనపడినాడు.

'' 'వార్యా మంచి అమ్మాయి లాగే వుంది,' అన్నాడు నాతో అతను, తన మామూలు రేఖామాత్రపు వంకర చిరునవ్వుతో. 'మరి ప్రతివొకడూ పెండ్లిచేసుకోవలసిందే, నాకు తెలుసు, కానీ.... యిదంతా ఉట్టిపాటుగా వుంది, కదూ.... యిది ఆలోచించుకోవలసిన విషయం....'

'' 'ఆలోచించుకునే దేముంది? పెండ్లిచేసుకోండి, అంతే,' అని నేను జవాబిచ్చినాను.

'' 'లేదు లేదు, పెండ్లి గురుతరమైన చర్య, భావి విధులూ, బాధ్యతలూ మొదట బాగా తూకం వేసుకోవాలి.... తరువాత యే హానీ జరక్కుండా.... యిది నన్ను కలచివేస్తున్నది, నాకు రాత్రి పూట నిద్రపట్టడం లేదు. నిజం చెప్పాలంటే, నాకు కాస్త భయంగా వుంది—వాళ్లు అంత చిత్రమైన పద్ధతిలో ఆలోచిస్తారు, ఆమే, ఆమె తమ్ముడూ; వాళ్ల దృక్పథం, మీకు తెలుసుగా, అంత చిత్రమైనది. పైగా ఆమె అంత సరదా మనిషి. నేను పెండ్లి చేసుకొని, యెందులో అయినా యిరుక్కుంటే....'

''అతను పెండ్లి ప్రతిపాదన వాయిదా వేసినాడు, రోజు రోజుకూ వాయిదా వేస్తూవచ్చినాడు, హెడ్‌మాస్టరు భార్యకూ, యితర ఆడవాళ్లకూ యెంతో ఆశాభంగం కలిగిస్తూ. అతను భావి విధులనూ, బాధ్యతలనూ తూకం వేసుకుంటూ వుండినాడు, వార్యాతో కలిసి దాదాపు ప్రతిరోజూ షికార్లు పోతూ వుండినాడు, ఆ పరి

స్థితిలో అది తన బాధ్యత అనుకున్నాడు గాబోలు; కుటుంబ జీవితాన్ని అన్ని కోణాల నుండీ చర్చించడానికి నావద్దకు వస్తూ్తవుండినాడు. బహుశా చివరకు అతను పెండ్లి ప్రతిపాదన చేసివుండేవాడు; కేవలం యేమీ తోచకపోవడం మూలంగానూ, అంతకు మించిన పనేమీ లేకపోవడం మూలంగానూ యిక్కడ జరిగే వేలాది మతి లేని, అవసరం లేని పెండ్లిండ్లలో మరొకటి జరిగివుండేది. కానీ, యింతలో, హఠాత్తుగా పెద్ద అకార్యం ఒకటి జరిగింది. మీకు మరొక విషయం చెప్పాలి, వార్యా తమ్ముడు కొవలేంకొకు మొట్టమొదటినుండి బేలికొవ్‌మీద ద్వేషం యేర్పడింది, అతన్ని బొత్తిగా భరించలేక పోయేవాడు.

"కొవలేంకొ అనేవాడు, భుజాలు కుదిస్తూ: 'ఆ నీచుని, ఆ మూర్ఖుని, మీరెలా సహించగలరు? మీ రిక్కడ యెలా వుండగలుగుతున్నారు? యీ వాతావరణం విషపూరితం, ఊపిరి సలపనివ్వదు. మీరు ఉపాధ్యాయులా, జ్ఞానదాతలా? మీరంతా కుక్షింభరుల మంద. మీ పాఠశాల విజ్ఞాన దేవాలయం కాదు, అనాథ శరణాలయం; యిది కంపు కొడుతున్నది, పోలీసువాని గుడిసెలాగ. మిత్రులారా, నేను మీతో కలిసి చాలా రోజులు వుండను, మా పొలం చేరుకుంటాను, అక్కడ చేపలు పట్టుకుంటాను, మా ఉక్రైనా పిల్లలకు చదువు చెప్తాను. ఆఁ, నేను వెళ్లిపోతాను, మీ రిక్కడే వుండండి మీ కాలనేమిగానితో కలిసి, వానితో కలిసి చావండి!'

"యింకా ఒకొకసారి అతను మొదట మేఘ గర్జ లాగ నవ్వి, తరువాత కీచుగొంతుతో నవ్వేవాడు, కండ్లలో నీళ్లు తిరిగే దాకా.

" 'యెందు కతను యిక్కడ కూర్చునేది? వూరక కూర్చొని గుడ్లప్పగించి చూస్తుంటాడు — యేమిటి అతని ఉద్దేశం?'

"బేలికొవ్‌కు అతను తన సొంత మారుపేరు పెట్టినాడు — జోరీగ అని."

"సహజంగానే, అతని అక్క యీ 'జోరీగ'ను పెండ్లాడబోతున్నదనే విషయం అతనిదగ్గర యెత్తడం మానుకున్నాము. బేలికొవ్‌లాంటి గౌరవస్థుని అతని అక్క పెండ్లాడడం హర్షించదగిన విషయమని హెడ్‌మాస్టరు భార్య కొవలేంకొతో అన్నప్పుడు, అతను బొమలు ముడివైచి, యిలా అన్నాడు:

" 'అది నా వ్యవహారం కాదు. ఆమె పామును చేసుకున్నా నాకు సంబంధం లేదు, యితర్ల వ్యవహారాలలో నేను వ్రేలు దూర్చేవాణ్ని కాదు!'

"యిక, తరువాతి కథ వినండి. యెవడో ఒక చతురుడు ఒక వ్యంగ్య చిత్రం గీసినాడు: బూట్లు తొడుగులలో బేలికొవ్, పంట్లాం కొసలు పైకి మడచబడినాయి, అతని తలమీద తెరచి పట్టుకున్న గొడుగు; చిత్రంకింద లేఖనం యిలా వుంది:

'ప్రేమించిన ఆంత్రోపాస్.' అతని ముఖ భంగిమ అతి సహజంగా వుంది. ఆ చిత్రకారుడు చాలా రోజులు కష్టపడి వుండాలి. యెందుకంటే, మా పట్టణంలోని రెండు పాఠశాలల ఉపాధ్యాయులకూ, ఉద్యోగస్తుల కందరికీ చిత్రం ప్రతులు అందినాయి. బేలికొవ్‌కు కూడా ఒకటి అందింది. ఆ వ్యంగ్య చిత్రం అతన్ని క్రుంగదీసింది.

"ఆ రోజు మే మిద్దరమూ యింటినుండి కలిసి పోయినాము. ఆ రోజు మే మొదటి రోజు, ఆదివారం; మొత్తం బడి అంతా, విద్యార్థులూ, ఉపాధ్యాయులూ, బడివద్ద కలుసుకొని, పట్టణం వెలుపల వున్న వనంలోకి నడిచిపోవాలి. సరే, మే మిద్దరమూ యింటినుండి బయటికి పోయినాము, అతను క్రుంగిపోయిన మనస్థితిలో వుండినాడు.

" 'ప్రపంచంలో యెంత క్రూరులు, ద్వేషులు వున్నారు,' అన్నాడు అతను; అతని పెదవులు వణకినాయి.

"నాకు అతన్ని చూసి పాప మనిపించింది. మేము నడుస్తూ వుండగా, మాకు యెవరు కనిపించినారో తెలుసా? సైకిలుమీద కొవలేంకొ కనిపించినాడు; అతని వెంట వార్యా కూడా సైకిలుమీద వస్తున్నది, గసపెడుతూ, ముఖమంతా యెర్రగ కందిపోయి, కానీ ఉల్లాసంగా, ఆనందంగా.

" 'మీ అందరికంటె ముందు చేరతామక్కడ!' అని ఆమె కేక వేసింది. 'యీ రోజు దివ్యంగా వుంది కదూ? అద్భుతమైన దినం!'

"త్వరలో వాళ్లు కనుమరుగైనారు. బేలికొవ్ శవంలాగ పాలిపోయి, కొయ్యబారి పోయినాడు. అతను నిలబడి, నావైపు తేరిచూసినాడు.

" 'యేమిటి దీని అర్థం? లేక నా కండ్లు నన్ను మోసగిస్తున్నాయా? అయ్యవార్లకూ, ఆడవాళ్లకూ సైకిళ్లు తొక్కడం ఉచితమా?' అని అడిగినాడు అతను.

" 'అనుచితం యేముంది అందులో?' అన్నాను నేను. 'సైకిళ్లు యెందుకు తొక్కకూడదు వాళ్లు?'

" 'యిది సహించరానిది!' అని అరిచినాడు అతను. 'యెలా మీరలా మాట్లా డగలుగుతున్నారు?'

"అతనికి కలిగిన ఆఘాతం మితిమీరినది. ఒక్క అడుగు కూడా ముందుకు వేయడానికి నిరాకరించి, అతను యింటికి మళ్లినాడు.

"మరుదిన మంతా అతను ఆందోళనగా చేతులు నలుపుకుంటూ, ఉలిక్కిపడుతూ వుండినాడు; అతని ఆరోగ్యం బాగలేనట్లు అతని ముఖం కనిపిస్తూవుండింది. పాఠాలు అయిపోకముందే అతను బడినుండి యింటికి పోయినాడు — అది యెప్పుడూ

అతను చేయని పని. ఆ రోజు అతను భోజనం చేయలేదు. సాయంత్రం, అది అసలైన వేసవి రోజు అయినప్పటికీ, అతను వెచ్చని దుస్తులు వేసుకొని, కాళ్లీడ్చుకుంటూ కొవలేంకొ యింటికి పోయినాడు. వార్యా యింట్లో లేదు, కానీ తమ్ముడు వుండినాడు.

"'దయచేసి కూర్చోండి,' అన్నాడు కొవలేంకొ ముభావంగా, కనుబొమలు ముడివేస్తూ. అతను అప్పుడే మధ్యాహ్నం నిద్రనుండి లేచివుండినాడు; ముఖం నిద్ర మత్తుతో మజ్జుగా వుండింది, మనస్సేమీ బాగలేదు.

"సుమారు పది నిముషాలు మౌనంగా కూర్చొన్న తర్వాత బేలికొవ్ ప్రారంభించినాడు:

"'నేను నా మనోభారం దించుకోడానికి వచ్చినాను. నాకు చాలా బాధ కలిగింది. యెవడో అజ్ఞాత హాస్యగాడు బొమ్మ గీసి, నన్నూ, మనిద్దరికీ ప్రియమైన మరొక వ్యక్తినీ అపహాస్యం చేసినాడు. అది నా తప్పు కాదని మీకు నచ్చజెప్పడం నా ధర్మ మనుకుంటున్నాను. అలాంటి అపహాస్యానికి నేనే కారణమూ కల్పించలేదు, పైగా, నేను సర్వదా యెంతో పెద్దమనిషి లాగ వ్యవహరించినాను.'

కొవలేంకొ మౌనంగా, ముఖం మూడ్చుకుంటూ కూర్చున్నాడు. కాసేపు ఆగి, బేలికొవ్ మెల్లగా, దుఃఖ పూరిత కంఠంతో కొనసాగించినాడు:

"'మీతో చెప్పవలసింది మరొకటి కూడా వుంది. నేనీ వుద్యోగంలో పాతకాపును, మీరు కొత్తవాళ్లు; అనుభవం గల సహోద్యోగిగా నేను మీకు హెచ్చరిక యివ్వడం నా ధర్మం. మీరు సైకిల్ తొక్కుతారు; కుర్రవాళ్లకు విద్య చెప్పే లక్ష్యం గలవాళ్లకు యిది చాలా నిందార్హమైన వినోదం.'

"'యెందుకు?' అన్నాడు కొవలేంకొ, తన సహజ గంభీర కంఠంతో.

"'దీనికి వివరణ అవసరమా మిహాయిల్ సావ్విచ్? యిది స్వయంవ్యక్తమని నా నమ్మకం. అయ్యవార్లు సైకిళ్లమీద పోతే, యిక కుర్రవాళ్లు తలక్రిందులుగా నడవడానికి అభ్యంతర మేముంది? దీన్ని అనుమతించే సర్క్యులర్ యేదీ రాలేదు గనుక, యిది తప్పు. నిన్న నాకు దిగ్భ్రాంతి కలిగింది. మీ అక్కను చూసినప్పుడు నాకు మూర్ఛ వచ్చినంత పనైంది. వయసులో వున్న స్త్రీ సైకిలుమీద — దురూహ్యం!'

"'యేమిటి మీరు నన్ను కోరేది, సరిగా చెప్పండి?'

"'మీకు హెచ్చరిక యివ్వడమే నా కోరిక, మిహాయిల్ సావ్విచ్. మీరు యువకులు, జీవితమంతా ముందున్నది. మీరు చాలా జాగ్రత్తగా వుండాలి, కానీ మీరు యింత నిర్లక్ష్యంగా వున్నారు, యింత మహా నిర్లక్ష్యంగా! మీరు బుటా పని చేసిన చొక్కాలలో తిరుగుతారు, యేవేవో పుస్తకాలు పట్టుకొని నిత్యం వీధుల్లో

కనిపిస్తారు, యిప్పుడీ సైకిలు. మీరూ, మీ అక్కా సైకిళ్లు తొక్కే సంగతి హెడ్‌మాస్టరుకు చెప్తారు, అది పాఠశాల పోషకుని చెవుల్లో పడుతుంది.... యిది క్షేమం కాదు.'

'' 'నేనూ, మా అక్కా సైకిళ్లు తొక్కినా, తొక్కకపోయినా, యెవరి కేం సంబంధం!' అన్నాడు కొవలేంకొ, యెర్రబడిన ముఖంతో. 'మా యింటి వ్యవహారాలలోనూ, కుటుంబ వ్యవహారాలలోనూ యెవరైనా వేలుపెడితే, వాళ్లు యేయేట్లో పడిచచ్చినా నాకక్కర లేదు.'

''బేలికొవ్ వివర్ణుడై, లేచి నిలబడినాడు.

'' 'మీరీ ధోరణి వహిస్తున్నారు గనుక, యిక నేనేమీ చెప్పజాలను,' అన్నాడు అతను. 'మన పైఅధికార్లను గురించి నా సమక్షంలో మీరు జాగ్రత్తగా మాట్లాడండని ప్రార్థిస్తున్నాను. అధికార్లను గౌరవంతో చూడాలి.'

'' 'అధికార్లను గురించి నేను తప్పుగా మాట్లాడినానా?' అడిగినాడు కొవలేంకొ, అతన్ని ద్వేషంతో చూస్తూ. 'అయ్యా, నా జోలికి రాకండి. నేను కపట మెరగనివాణ్ణి, మీలాంటివాళ్లతో నాకు మాట్లాడవలసిందేమీ లేదు. నాకు పాములంటే అసహ్యం.'

''బేలికొవ్ తత్తరపాటుతో తొందర తొందరగా కోటు తొడుక్కున్నాడు; అతని ముఖం వెలపరంతో నిండిపోయింది. అతని జీవితంలో అతన్ని యెవరూ యింత అమర్యాదగా మాట్లాడలేదు.

'' 'మీ యిష్టం వచ్చినట్లు అనండి,' అన్నాడు అతను మెట్లవద్దకు పోతూ. 'మీకు హెచ్చరిక యివ్వాలి: మన మాటలు యెవరైనా వినివుండవచ్చు. మన మాటలకు యెవరూ అపార్థం కల్పించకుండా, దానివల్ల దుష్ఫలితాలు కలగకుండా వుండడానికి, మన సంభాషణ సారాంశాన్ని నేను హెడ్‌మాస్టరుకు రిపోర్టు చేయవలసి వుంటుంది.... దాని ముఖ్యాంశాలు. అది నా విధి.'

'' 'యేమిటీ? రిపోర్టా? పో, చేసుకోపో!'

''అంటూ కొవలేంకొ అతని కాలరు పట్టుకొని ఒక తోపు తోసినాడు. బేలికొవ్ మెట్లకుండా దొర్లుతూ పడినాడు, బూట్లు తొడుగులు మెట్లకు కొట్టుకున్నాయి. నిచ్చెన పెద్ద, నిటారైనది, కానీ బేలికొవ్ నిరపాయంగా అడుగున చేరి, లేచి నిలబడి, భ్రూమధ్యం తడుముకున్నాడు, కండ్లద్దాలు పగిలిపోయినా యేమో అని. కానీ, అతను మెట్లగుండా కిందికి దొర్లేటప్పుడు, వార్యా, మరి యిద్దరు స్త్రీలూ అక్కడికి వచ్చినారు; వాళ్లు ముగ్గురూ నిచ్చెన దగ్గర నిలబడి అతన్ని చూసినారు — బేలికొవ్‌కు

కలిగిన బాధల్లో కెల్ల అది పెద్దది. యీ పరిహాసాస్పదమైన స్థితిలో కనిపించడం కంటె, కాళ్ళూ, చేతులూ విరిగినా అతను సహించేవాడు. యిప్పుడు వూరందరికీ యీ విషయం తెలుస్తుంది, హెడ్‌మాస్టరుకు చెప్తారు, బహుశా పాఠశాల పోషకునికి కూడా. దానిమీద యేమి జరుగుతుందో! యెవరైనా మరొక వ్యంగ్యచిత్రం గీయవచ్చు, అప్పుడు తాను రాజీనామా చేయవలసి వుంటుంది....

''అతను లేచినప్పుడు వార్యా అతన్ని గుర్తుపట్టింది; ఆమె అతని పరిహాసాస్పదమైన ముఖమూ, నలిగిన కోటూ, బూట్ల తొడుగులూ చూసింది; యేమి జరిగిందో ఆమెకు యీషణ్మాత్రమూ తెలియదు, కానీ అతను కాలు జారి పడివుంటాడని ఆమె ఊహించుకొని, నవ్వు పట్టలేక, తన సహజ ధోరణిలో 'హాహాహా' అని పగలబడి నవ్వింది.

''యీ ఉల్లాసపు 'హాహాహా'తో స్వస్తి జరిగింది — బేలికొవ్ ప్రణయానికీ, భూమిమీద అతని మనుగడకూ. అప్పుడు అతనికి వార్యా యేమన్నదీ వినపడలేదు, యేమీ కనపడలేదు. అతను యింటికి పోయిన వెంటనే చేసిన మొదటి పని తన డెస్కు మీదనుండి వార్యా ఫోటోను తీసివేయడం; తరువాత అతను మంచంమీద పండుకున్నాడు, యిక మళ్లీ లేవలేదు.

''మూడు రోజులతర్వాత అఫనాసియ్ వచ్చి, తన యజమాని చాలా చిత్రంగా ప్రవర్తిస్తున్నాడనీ, డాక్టర్ను పిలిపించాల్నా అనీ నన్నడిగినాడు. నేను బేలికొవ్‌ను చూడడానికి వెళ్లినాను. అతను తన చాందినీకింద, దుప్పటి కప్పుకొని పండుకున్నాడు, నోట మాట లేకుండా. నా ప్రశ్నలకు 'ఔను' అనో, 'కాదు' అనో పొడి మాటలతో అతను జవాబులు చెప్పినాడు. అతను అక్కడ పండుకొని వుండగా, అఫనాసియ్ మూతి ముడుచుకొని, ముఖం మాడ్చుకొని, మంచంవద్ద దబదబ అడుగులు వేస్తూ, నిట్టూర్పులు నిగిడిస్తూ వుండినాడు — కల్లు దుకాణంలాగ కంపుకొడుతూ.

''ఒక నెల గడిచింది, బేలికొవ్ మరణించినాడు. అందరూ, అనగా రెండు పాఠశాలలూ, సెమినరీ, అతని అంత్యక్రియలకు వెళ్లినారు. అతను శవపేటికలో పండుకొని వుండగా, అతని ముఖం ప్రసన్నంగా వుండింది, ఉల్లాసంగా కూడా వుండింది — యిక యెన్నడూ వదలిపెట్ట వలసిన పని లేని తొడుగులో చివరకు తన్ను వుంచినందుకు సంతోషిస్తున్నట్లు. అవును, తన ఆదర్శం సాధించినాడు అతను! అతని గౌరవార్థమా అన్నట్లు ఆ రోజు మబ్బులు పట్టి చిత్తడిగా వుండింది, మేమందరమూ బూట్ల తొడుగులు తొడుక్కొని, గొడుగులు పట్టుకున్నాము. వార్యా కూడా స్మశానానికి వచ్చింది, శవపేటికను సమాధిలోకి దింపినప్పుడు ఒక కన్నీటి

బొట్టు వదలింది. నేను గమనించినంతలో, ఉక్రైనా స్త్రీలు నవ్వనైనా నవ్వాలి, యేడ్వనైనా యేడ్వాలి, యీ రెండిటి మధ్యన యే స్థితీ వాళ్లెరగరు.

''బేలికొవ్ లాంటివాళ్లను పూడ్చిపెట్టడం మహా సంతోషకరం అని ఒప్పుకుంటాను. కానీ, స్మశానంనుండి మేము వ్రేలాడే ముఖాలతో తిరిగివచ్చినాము, మాకు కలిగిన విముక్తి భావాన్ని యెవరమూ వెల్లడించ దలచుకోలేదు – పెద్దవాళ్లు యెక్కడికైనా వెళ్లిపోతే, గంటో రెండు గంటలో పూర్తి స్వేచ్ఛగా ఆడుకోవచ్చునని చిన్నప్పు డెప్పుడో మేము అనుభవించిన విముక్తి భావం లాంటిది అది. ఆ, స్వేచ్ఛ! దాని సూచన చాలు, అది లభిస్తుందనే రేఖామాత్రపు ఆశ చాలు, మన ఆత్మలకు రెక్కలు వస్తాయి, కదూ?

''స్మశానంనుండి మేము ఉత్సాహంతో వచ్చినాము. కానీ, గట్టిగా వారం తిరగక ముందే, సారం లేని, అర్థం లేని, ఆయాసకర నిత్య జీవితం, యిటు నిషిద్ధం కానిదీ, అటు అనుమతించబడినది కానిదీ, యథాప్రకారంగా కొనసాగింది; అంతకు ముందుకంటె పరిస్థితు లేమీ మెరుగు కాలేదు. యెంతైనా, కాస్త ఆలోచిస్తే, మేము బేలికొవ్‌ను పూడ్చిపెట్టినప్పటికీ, గుల్లలో జీవించేవాళ్లు యింకా బోలెడు మంది వున్నారు, పుట్టబోయేవాళ్లు యింకా బోలెడుమంది వున్నారు.''

''అవును, నిజమే,'' అన్నాడు ఇవాన్ ఇవానిచ్, పైపు ముట్టించుకుంటూ.

''పుట్టబోయేవాళు యింకా బోలెడుమంది వున్నారు!'' పునశ్చరణం చేసినాడు బూర్కిన్.

హైస్కూలు టీచరు దొడ్డిలోనుండి బయటికి వచ్చినాడు. అతను పొట్టిగా, లావుగా వుండినాడు, బట్ట తలతోనూ, దాదాపు నడుముదాకా వున్న పెద్ద, నల్లని గడ్డంతోనూ.

అతను పైకి చూస్తూ, ''యేమి చంద్రుడు!'' అన్నాడు.

అర్ధరాత్రి దాటింది. గ్రామమంతా కుడివైపున కనిపిస్తూ వుండింది, పొడవైన వీధి మూడు మైళ్లదాకా వ్యాపించింది. అన్నీ ప్రగాఢ, ప్రశాంత నిద్రలో మునిగి పోయినాయి. ఒక చప్పుడు లేదు, ఒక అలికిడి లేదు, ప్రకృతి యింత ప్రశాంతంగా వుండడం నమ్మశక్యం కాదనిపించింది. వెన్నెల రాత్రిలో విశాలమైన గ్రామ వీధినీ, అందులోని యిండ్లనూ, గడ్డివాములనూ, నిద్రించే విల్లోచెట్లనూ చూస్తే, మన ఆత్మలను ప్రగాఢమైన శాంతి ఆవరిస్తుంది. సకల శ్రమనుండీ, బాధ్యతలనుండీ, దుఃఖంనుండీ రాత్రి నీడలచేత రక్షింపబడి, తన ప్రశాంతిలో, గ్రామం సౌమ్యంగా, విచారంగా, అందంగా కనపడుతుంది, నక్షత్రాలే గ్రామాన్ని దయార్ద్రంగా చూస్తు

న్నట్లున్నంటాయి, ప్రపంచంలో చెడ్డ అనేదే లేనట్లూ, అంతా మంచే అయినట్లూ అనిపిస్తుంది. యెడమ వైపున గ్రామం అంతమై, అక్కడనుండి పొలాలు వ్యాపించి నాయి; దూరంగా, కనుచూపు మేరదాకా వ్యాపించిన ఆ పొలాలు కూడా నిశ్చలంగా, నిశ్శబ్దంగా వున్నాయి, విశాలమైన మైదానం వెన్నెల వరదలో మునిగిపోయింది.

''అవును, నిజమే,'' అని మళ్లీ అన్నాడు ఇవాన్ ఇవానిచ్. ''మనం పట్టణాలలో, గాలి రాని యిరుకు గదులలో వుండడమూ, అక్కరకు రాని కాగితాలు రాయడమూ, పేకాట ఆడడమూ, యిదంతా కూడా గుల్లలో జీవించడం కాదా? కుక్షింభరుల మధ్యా, కుసంస్కారపు కోర్టుపకుల మధ్యా, పని లేని, మతి లేని ఆడవాళ్ల మధ్యా మన జీవితమంతా గడుపుతూ, నిత్యం చెత్త మాట్లాడుతూ, చెత్త వింటూ వుండడం, యిదంతా మన నత్తగుల్ల కాదా? యీ విషయాన్ని వివరించే మంచి కథ ఒకటి చెప్తాను, మీరు వినదలచుకుంటే....''

''నిద్రకు వేళైంది అనుకుంటాను, అది రేపటికి వుంచండి,'' అన్నాడు బూర్కిన్.

యిద్దరూ దొడ్డిలోకి పోయి, పండుకున్నారు. వాళ్లు గడ్డిలో పడక పొందించు కొని, నిద్రమత్తుకు లోబడుతుండగా, బయటినుండి సన్నని అడుగుల చప్పుడు వినవచ్చింది. దొడ్డికి అనతి దూరంలో యెవరో తిరుగుతూ వుండినారు; నాలు గడుగులు, తరువాత ఆగడం, మళ్లీ తేలికగా నాలు గడుగులు. కుక్కలు మొరిగినాయి.

''మ్యావ్రా షికారు అది,'' అన్నాడు బూర్కిన్.

అడుగులు తరువాత వినపడలేదు.

ఇవాన్ ఇవానిచ్ అటువైపు పొర్లుతూ అన్నాడు: ''మనుషులు చెప్పే అబద్ధాలు గుడ్లప్పగించి చూస్తూ, వింటూ వుండడమూ, తరువాత, ఆ అబద్ధాల నన్నిటినీ సహించినందుకు తిట్లు తినడమూ, అపచారాలూ, అవమానాలూ దిగమింగడమూ, నిజాయితీ గల స్వేచ్ఛా మానవుల పక్షాన నిలబడడానికీ, మాట్లాడడానికీ ధైర్యం లేకపోవడమూ, మనమే అబద్ధా లాడడమూ, చిరునవ్వులు ఒలకపోయడమూ, యివన్నీ యెందుకంటే, పట్టె డన్నం కోసమూ, కాస్త సుఖ జీవనం కోసమూ, యేదో ఒక దౌర్భాగ్యపు పదవి కోసమూ — ఛీఛీ, జీవితం నరకం!''

''యిది మరొక యితివృత్తం, ఇవాన్ ఇవానిచ్,'' అన్నాడు బడిపంతులు. ''యిక నిద్రపోదాం.''

పది నిముషాలలో బూర్కిన్ నిద్రపోయినాడు. కానీ ఇవాన్ ఇవానిచ్ నిట్టూరుస్తూ, గడ్డిమీద పొర్లుతూ వుండినాడు. తరువాత అతను లేచి, మళ్లీ బయటికి పోయినాడు, వాకిలి పంచన కూర్చొని, పైపు ముట్టించినాడు.

1898

# కుక్కను వెంటబెట్టుకున్న మహిళ

యెవరో కొత్త మనిషి — కుక్కను వెంటబెట్టుకున్న మహిళ — విహారపథంలో కనిపించిందని జనం అనుకుంటున్నారు. దిమిత్రీ దిమిత్రిచ్ గూరొవ్ యాల్టాకు వచ్చి పదైదు రోజు లైంది; ఆ వూరి పద్ధతులకు అలవాటుపడి, అతను కూడా కొత్త ఆగంతుకులలో ఆసక్తి కలిగించుకోసాగినాడు. అతను వెర్నె అరుబయులు హోటల్‌లో కూర్చొని వుండగా, విహారపథంలో టోపీ పెట్టుకొని నడుస్తూవుండిన యువతి కనిపించింది. ఆమెవెంట తెల్ల పొమెరేనియా కుక్క వుండింది.

తరువాత ఆమె మునిసిపల్ పార్కులోనూ, చౌకులోనూ అతనికి రోజూ పలుసార్లు యెదురైంది. ఆమె యెప్పుడూ ఒంటిగా వుండేది, అదే టోపీ పెట్టుకొని; ఆ కుక్క యెప్పుడూ వెంట వుండేది. ఆమె యెవరైందీ యెవరికీ తెలియదు; కేవలం ''కుక్కను వెంటబెట్టుకున్న మహిళ''గా జనం ఆమెను గురించి ప్రస్తావించేవాళ్ళు.

"ఆమె యిక్కడ భర్త లేకుండా, మిత్రు లెవరూ లేకుండా వుంటే, ఆమె పరిచయం చేసుకుంటే బాగనే వుంటుంది," అనుకున్నాడు గూరొవ్.

అతనికింకా నలభై నిండలేదు; కానీ అతనికి పన్నెండేండ్ల కూతురూ, యిద్దరు బడికి పోయే కొడుకులూ వుండినారు. కాలేజిలో రెండవ యేడులో వుండగా అతను మాటలకు లోబడి పెండ్లి చేసుకున్నాడు; అతని భార్య యిప్పుడు దాదాపు తనంత రెండంతలు వయసు వున్నట్లు కనపడుతుంది. ఆమె నల్లని కనుబొమలతో, యెత్తుగా, నిటారుగా, గంభీరంగా వుండేది, "ఆలోచనాశీలి"నని తన్ను గురించి తాను చెప్పుకునేది. ఆమె యెక్కువగా పుస్తకాలు చదివేది, ఉత్తరాలలో వ్యావహారిక రూపాలు వాడేది, భర్తను ద్మిత్రీ అనకుండా దిమిత్రీ అనేది. ఆమె అజ్ఞురాలు అనీ, సంకుచిత మనస్కు అనీ, అస్తవ్యస్తపు దుస్తుల మనిషి అనీ అతను మనసులో అనుకున్నా, ఆమెకు భయపడేవాడు, యింటివద్ద వుండడానికి అయిష్టపడేవాడు. అతను ఆమెను మోసగించడం ప్రారంభించి చాలా కాలమైంది. యిప్పు డతను పరస్త్రీలతో తిరిగేవాడు, అందువల్లనే స్త్రీలను గురించి నిరసనగా మాట్లాడేవాడు, వాళ్లను అధమ జాతి అనేవాడు.

బాధాకరమైన అనుభవంద్వారా నేర్చుకున్న గుణపాఠాల మూలంగా, వాళ్లను తన యిష్టం వచ్చినట్లు అనే హక్కు తనకు వుందని అతను అనుకునేవాడు; కానీ యీ "అధమ జాతి" లేకుండా అతను ఒక్క రోజు కూడా బతకగలిగేవాడు కాదు. పురుషుల మధ్య వున్నప్పుడు అతను యేమీ తోచక, యిబ్బందిపడేవాడు, వాళ్లతో యెప్పుడూ ముభావంగా, నిర్లిప్తంగా వుండేవాడు. కానీ స్త్రీల మధ్య అతను చాలా సాఫీగా వుండేవాడు; వాళ్లతో యేమి మాట్లాడవలసిందీ, యెలా ప్రవర్తించవలసిందీ అతనికి కచ్చితంగా తెలుసు; వాళ్ల సాహచర్యంలో ఆవగింజంత యిబ్బందిపడకుండా అతను మౌనంగా కూడా వుండగలిగేవాడు. అతని వాలకంలోనూ, వైఖరిలోనూ యేదో అనిర్వచనీయమైన సమ్మోహనత్వం వుండేది. అది స్త్రీలను ఆకర్షించి, వాళ్ల సానుభూతిని చూరగొనేది. యిది అతనికి తెలుసు. అతనే యేదో అదృశ్య శక్తిచేత వాళ్లవైపు ఆకర్షితు డయ్యేవాడు.

ప్రతి కొత్త పరిచయమూ మొదట నిత్య జీవితంలోకి అంత ఆహ్లాదకరమైన వైవిధ్యం ప్రవేశపెట్టి, మనోహరమైన తేలిక ప్రణయ కలాపంగా కనపడి, తరువాత, మర్యాదస్తుల మధ్య (ముఖ్యంగా, మనుషులు అంత అస్థిర మనస్కులుగా, అంత మందగమనులుగా వుండే మాస్కోలో) మహా జటిలమైన సమస్యగా అభివృద్ధి అయి, సహించరానంత సంకటకరమైన సన్నివేశానికి దారితీస్తుందని పదేపదే కలిగిన

బాధాకరమైన అనుభవం అతనికి నేర్పింది. కానీ ఆకర్షణీయమైన స్త్రీ కనిపించిన ప్రతిసారీ అతను యీ అనుభవమంతా మరిచిపోయేవాడు, అతనిలో జీవిత కాంక్ష ఉప్పొంగేది, హఠాత్తుగా అంతా సరళంగా, వినోదకరంగా కనిపించేది.

ఒక రోజు రాత్రి అతను పార్కులోని హోటల్‌లో భోజనం చేస్తూవుండగా ఆ టోపీ స్త్రీ మెల్లగా అడుగులు వేసుకుంటూ లోపలికి వచ్చి, పక్క టేబుల్‌వద్ద కూర్చుంది. ఆమె వాలకమూ, నడకా, దుస్తులూ, కేశాలంకరణా, అన్నిటినీబట్టి అతనికి అర్థమైంది, ఆమె ఉన్నత వర్గాలకు చెందినదనీ, వివాహిత అనీ, యాల్టాకు మొదటిసారి వచ్చిందనీ, అక్కడ ఒంటిగా వుందనీ, పొద్దుబోక అవస్థ పడుతున్న దనీ.... యాల్టాకు వచ్చేవాళ్ల అవినీతిని గురించిన కథలలో అతిశయోక్తులు చాలా వుంటాయి. వాటిలో అధికభాగం, చేతనైతే సంతోషంగా నీతిని ఉల్లంఘించేవాళ్ల కల్పితాలు అని అతనికి తెలిసినందున, అతను వాటిని లక్ష్యపెట్టలేదు. కానీ, ఆ స్త్రీ తనకు కొద్ది గజాల దూరంలో పక్క టేబుల్ వద్ద కూర్చున్నప్పుడు, యీ సులభ విజయాల కథయూ, కొండలలో షికార్ల కథలూ అతని మనసులో మెదలినాయి. సత్వర తాత్కాలిక ప్రణయం, తనకు పేరైనా తెలియని స్త్రీతో ప్రేమ కలాపం, కలగవచ్చుననే భావం అతని మనస్సును హఠాత్తుగా లోబరచుకుంది.

కుక్కవైపు చూస్తూ అతను చిటిక వేసినాడు, అది తనదగ్గరికి వచ్చినప్పుడు చూపుడు వేలు ఆడించినాడు. పామెరేనియా కుక్క మొరిగింది. గూరొవ్ మళ్లీ వేలు ఆడించినాడు.

ఆమె అతనివైపు చూసి, వెంటనే కండ్లు దించుకుంది.

''అది కరవదు,'' అని ఆమె సిగ్గుపడింది.

''యెముక ముక్క యివ్వనా?'' అని అడిగినాడు అతను. ఆమె అంగీకారంతో తల ఆడించగా, అతను హార్దిక స్వరంతో అన్నాడు: ''మీరు యాల్టాకు వచ్చి చాలా రోజు లైందా?''

''అయిదు రోజు లైంది.''

''నే నిక్కడ రెండవ వారం యీడుస్తున్నాను.''

కొద్ది నిముషాల సేపు యెవరూ మాట్లాడలేదు.

''రోజులు త్వరగా గడుస్తాయి, కానీ యిక్కడ బొత్తిగా పొద్దుబోదు,'' అన్నది ఆమె, అతనివైపు చూడకుండా.

''పొద్దుబోదనడం యిక్కడ మామూలు. బెలెవ్, జీజ్ద్ర లాంటి పాపిష్ఠి వూర్లలో పొద్దుబోదని యెవరూ ఫిర్యాదు చేయరు. కానీ వాళ్లు యిక్కడికి వచ్చి

'ఓ, యెంత నిర్జీవం! ఓ, యెంత దుమ్ము!' అంటారు. వాళ్ళు యే గ్రెనడానుండో వచ్చినట్లు మాట్లాడుతారు.''

ఆమె నవ్వింది. తరువాత, పూర్తిగా కొత్తవాళ్ళైనట్లు యిద్దరూ మౌనంగా భోంచేయసాగినారు. కానీ భోజనం తర్వాత హోటల్‌నుండి యిద్దరూ కలిసి బయటికి పోయి, స్వేచ్ఛా, సంతృప్తీ గలవాళ్లు, ఫలానా చోటికి పోవాలని గానీ, ఫలానా విషయం మాట్లాడాలని గానీ లేనివాళ్లు మాట్లాడే తేలిక, హాస్యపూరిత సంభాషణ ప్రారంభించినారు. వాళ్ళు తీరికగా అడుగులు వేస్తూ, సముద్రంమీద కనపడే వింత కాంతిని గురించి మాట్లాడుకుంటూ వెళ్లినారు. నీళ్ళు ఆహ్లాదకరమైన వూదా రంగులో వుండినాయి, నీళ్లమీద వెన్నెల బంగారు చారగా పడింది. పగలంతా వేడిగా వుండి, యిప్పుడు చాలా ఉక్కగా వుందని వాళ్ళు మాట్లాడుకున్నారు. గూరొవ్ తన్ను గురించి చెప్పినాడు, తాను మాస్కో వాసిననీ, నిజానికి తాను భాషాశాస్త్రవేత్త అయినా బాంకిలో పనిచేస్తున్నాననీ. ఒకప్పుడు తాను సంగీత నాటకాల కంపెనీలో పాడడానికి సాధనచేసి, తరువాత ఆ అభిప్రాయం వదలిపెట్టినాననీ, తనకు మాస్కోలో రెండు యిండ్లు వున్నాయనీ.... తరువాత ఆమెనుండి అతను తెలుసుకున్నాడు, ఆమె పీటర్స్‌బుర్గ్‌లో పెరిగిందనీ, యస్ పట్టణంలో పెండ్లిచేసుకుందనీ, రెండేండ్లుగా అక్కడ వుంటున్నదనీ, యాల్టాలో యింకా ఒక నెల వుంటుందనీ, తన భర్తకు కూడా విశ్రాంతి అవసరం గనుక అతను త్వరలో అక్కడికి రావచ్చుననీ. తన భర్త గుబెర్నియా కౌన్సిలు సభ్యుడైందీ, జేమ్‌స్ట్వో* బోర్డు సభ్యుడైందీ ఆమె బొత్తిగా చెప్పలేక, చెప్పలేనందుకు చాలా వినోదపడింది. ఆమె పేరు అన్నా సెర్గేయెవ్నా అని కూడా గూరొవ్ తెలుసుకున్నాడు.

తన గదికి తిరిగివచ్చిన తర్వాత అతను ఆమెను గురించి ఆలోచించినాడు, మరుదినం మళ్లీ ఆమెను కలుసుకుంటానని అతనికి నమ్మకంగా తోచింది. అది అనివార్యం. మంచంమీద పండుకుంటూ అతను అనుకున్నాడు, మొన్నమొన్నటిదాకా ఆమె తన కూతురులాగే బడికి పోతూ, పాఠాలు నేర్చుకుంటూ వుండిందని; ఆమె నవ్వులోనూ, కొత్తవానితో మాట్లాడే పద్ధతిలోనూ యెంత సిగ్గూ, బిడియమూ వున్నదీ అతనికి జ్ఞాపకం వచ్చింది — ఆమె ఒంటరిగా వుండడమూ, ఆమె పసిగట్టకుండా వుండజాలని ఒక నిత్య, రహస్య లక్ష్యంతో పురుషులు ఆమెను అనుసరించి, గమనించి, ఆమెతో మాట్లాడే సన్నివేశంలో ఆమె వుండడమూ బహుశా యిది మొదటిసారి కావచ్చు.

---

* స్థానిక స్వపరిపాలన సంస్థ. — సం.

ఆమె సన్నని, సుకుమారమైన మెడనూ, అందమైన ధూసరవర్ణపు కన్నులనూ అతను జ్ఞాపకం చేసుకున్నాడు.

''అయినా ఆమెలో యేదో విషాదకరమైంది వుంది,'' అనుకున్నాడు అతను, నిద్రలో మునుగుతూ.

## II

వాళ్లకు పరిచయమై వారం గడిచింది. ఆరోజు సెలవు దినం. యిండ్లలో ఉక్కగా వుండింది, కానీ బయట గాలికి దుమ్ము మేఘాలలాగా లేస్తూవుండింది, తలలమీద టోపీలు కొట్టుకపోతూ వుండినాయి. ఆ రోజు దగగాలిపే దినం; ఆన్నా సెర్గేయెవ్నా కోసం పండ్ల రసాలూ, ఐస్‌క్రీమూ తేవడానికి గూరొవ్ ఆరుబయలు హోటల్‌కు పదేపదే పోతూవుండినాడు. నేడి దుర్భరంగా వుండింది.

సాయంత్రం, గాలి తగ్గినాక, వాళ్లు వచ్చే స్టీమర్‌ను చూడడానికి రేవుకు వెళ్లినారు. ప్రయాణికులు దిగేచోట చాలామంది జనం వుండినారు. కొంతమంది, చేతులలో పూలతో, మిత్రులను కలుసుకుంటూ వుండినారు. నవనాగరికపు యాల్టా గుంపులో రెండు విశేషాలు స్పష్టంగా కనిపిస్తూవుండినాయి — వయసుముళ్లిన స్త్రీలు అందరూ వయసుకత్తెలలాగ దుస్తులు వేసుకోడానికి ప్రయత్నించినారు, మిలిటరీ జనరల్‌లు చాలామంది వున్నట్లుండింది.

సముద్రంలో అలలులేస్తూ వుండినందున స్టీమరు ఆలస్యంగా వచ్చింది, పొద్దు గుంకిన తర్వాత; రేవు పక్కన వచ్చి నిలవడానికి అది కొంతసేపు అటూయిటూ మళ్లవలసి వచ్చింది. ఆన్నా సెర్గేయెవ్నా తనకు తెలిసిన యెవరికోసమో వెదకుతున్నట్లు, బైనాకులర్సుగుండా స్టీమరునూ, ప్రయాణికులనూ కలయజూసింది; ఆమె గూరొవ్‌వైపు మళ్లినప్పుడు, ఆమె కన్నులు తడితో తళతళలాడినాయి. ఆమె చాలా యెక్కువగా మాట్లాడింది, పోలూ పొందూ లేని ప్రశ్నల వర్షం కురిపించింది, తాను తెలుసుకో గోరిందేమిటో వెంటనే మరిచిపోతూ వుండింది. తరువాత జనం రద్దీలో ఆమె తన బైనాకులర్సు పోగొట్టుకుంది.

నవనాగరికపు గుంపు విడిపోసాగింది, రూపురేఖలు గుర్తించడం అసాధ్యమైంది, గాలి బాగా తగ్గింది, స్టీమరులోనుండి యింకా యెవరి రాకకొరకో కాచుకున్నట్లు గూరొవూ, ఆన్నా సెర్గేయెవ్నా అక్కడ నిలుచుకున్నారు. ఆన్నా సెర్గేయెవ్నా మౌనంగా

వుండిపోయింది, సారిసారికీ తన చేతిలోని పూలు మూచూస్తూ, కానీ గూరొవ్ వైపు చూడకుండా.

"మంచి సాయంత్రంగా మారింది," అన్నాడు అతను. "యేం చేద్దాం? బండిలో షికారు వెళ్లవచ్చు."

ఆమె జవాబు చెప్పలేదు.

అతను ఆమెవైపు నిశ్చలంగా చూసినాడు, హఠాత్తుగా ఆమెను కౌగలించుకొని, పెదవులు ముద్దుపెట్టుకున్నాడు, పూల పరిమళమూ, తడీ అతన్ని చుట్టుముట్టినాయి, కానీ మరుక్షణం అతను భయంతో వెనక్కి తిరిగిచూసినాడు — తమ నెవరైనా చూసినారా?

"మీ గదికి వెళ్దాం పద," అతను మెల్లగా అన్నాడు.

వడివడిగా యిద్దరూ కలిసి నడిచి పోయినారు.

ఆమె గది ఉక్కగా వుండింది, జపాన్ దుకాణంలో కొన్న యేదో సెంటు వాసన వేస్తూవుండింది. గూరొవ్ ఆమెవైపు చూసి, అనుకున్నాడు: "జీవితం నిండా యెన్ని చిత్రమైన కలయికలు!" దిగులూ భయమూ లేని సహృదయులైన స్త్రీలు కామక్రీడచేత ప్రహర్ష చిత్తలై, యెంత స్వల్ప కాలికమైనదైనా తానిచ్చిన ఆనందానికి తనకు కృతజ్ఞత చూపిన స్త్రీలు అతనికి జ్ఞాపక మున్నారు. యిక మరి కొందరు వుండినారు — వాళ్లలో తన భార్య ఒకతె — వాళ్ల ఆలింగనాలు కపటంగా, కృత్రిమంగా, ఉన్మాదంగా, బోలెడు అనవసరపు మాటలతో కలిసి వుండేవి; యిదంతా వట్టి కామక్రీడ కానట్టూ, మోహావేశం కానట్టూ, అంతకంటె ముఖ్యమైన దేదో అయినట్టూ వుండేది వాళ్ల వాలకం. తరువాత, యిద్దరు ముగ్గురు నిర్లిప్తలైన సుందరాంగులు వుండినారు; వాళ్ల ముఖ లక్షణాలలో యేదో ఘాతుక భావం తారాడుతూ వుండేది, జీవితంనుండి అది యివ్వగలిగినదానికంటె యెక్కువ పిండుకోవాలనే దీక్షను వ్యక్తంచేస్తూ; వాళ్లు ప్రథమ యవ్వనం దాటినవాళ్లు, చపలచిత్తలు, పెత్తనందారీ బుద్ధులు, బొత్తిగా మెదడు లేనివాళ్లు. వాళ్లపట్ల గూరొవ్ వ్యామోహం చల్లబడిన తర్వాత వాళ్ల సౌందర్యం అతనికి యేవగింపు మాత్రమే కలిగించేది, వాళ్ల లోపలి దుస్తుల లేసులు అతనికి చేపల పొలుసులను గుర్తుకు తెచ్చేవి.

కానీ యిక్కడ యవ్వనంలోనూ, అనుభవ రాహిత్యంలోనూ వుండే పిరికితనమూ, అస్తవ్యస్తతా యింకా స్పష్టంగా వున్నాయి. ఆమె మనసులో ఆందోళన భావం వుంది, అకాలంలో యెవరో తలుపు తట్టినట్టు. ఆన్నా సెర్గేయెవ్నా, "కుక్కను వెంటబెట్టుకున్న మహిళ," యీ వ్యవహారాన్ని యేదో మహా ప్రత్యేకమైనదిగా, మహా

గురుతరమైనదిగా పరిగణిస్తున్నది, తాను పతిత అయినట్లు పరిగణిస్తున్నది; ఆ భావం అతనికి విడ్డూరంగా, మనశ్శాంతిహారిగా వుండింది. ఆమె ముఖ లక్షణాలు విచారపూరితంగా వున్నాయి, ముఖానికి యిరువైపులా వెంట్రుకలు దుఃఖమయంగా వ్రేలాడుతున్నాయి. ఆమె విచారకర ధ్యానముద్ర ధరించింది, పాతకాలపు వర్ణచిత్రంలోని పశ్చాత్తప్త పాపిలాగ.

"యిది మంచిది కాదు," అన్నది ఆమె. "మీకు యిక నామీద గౌరవం వుండదు."

టేబుల్‌మీద కర్బూజపండు వుండింది. గూరొవ్ ఒక ముక్క కోసుకొని నిదానంగా తినసాగినాడు. కనీసం ఒక అర్ధగంట మౌనంగా గడిచింది.

ఆన్నా సెర్గేయెవ్నా అనుతాప జనకంగా వుండింది, జీవితాన్ని చాలా కొద్దిగా చూసిన నిష్కల్మష, అమాయక స్త్రీయొక్క స్వచ్ఛతను వ్యక్తంచేస్తూవుండింది. టేబుల్‌మీద వున్న ఒకేఒక కొవ్వొత్తి వెలుగులో ఆమె ముఖం స్పష్టంగా కనపడలేదు, కానీ ఆమె హృదయం భారంగా వున్నట్లు స్పష్టంగా తెలుస్తూవుండింది.

"నాకు నీమీద గౌరవం యెందుకు ఆగిపోతుంది?" అని అడిగినాడు అతను. "నీవేమి మాట్లాడేదీ నీకే తెలియదు."

"భగవంతుడు నన్ను క్షమించుగాక! యిది దారుణం," అన్నది ఆమె. ఆమె కండ్లలో నీళ్లు నిండినాయి.

"ఆత్మ సమర్థన చేసుకోవలసిన అవసరం లేదు నీకు."

"ఆత్మ సమర్థన యెలా చేసుకోగలను? నేను దుష్టురాలిని, పతితను; నా మీద నాకే అసహ్యం కలుగుతున్నది, ఆత్మ సమర్థన చేసుకునే ఉద్దేశం నాకేమాత్రమూ లేదు. నేను మోసగించింది నా భర్తను కాదు, నన్నే. యిప్పుడే కాదు, చాలా కాలంగా నన్ను నేను మోసగించుకుంటున్నాను. నా భర్త నిజాయితీ పరుడు, యోగ్యుడు, సందేహం లేదు, కానీ జోహుకుంగాడు. అతను ఆఫీసులో యేమి చేస్తాడో నాకు తెలియదు, కానీ అతను జోహుకుంగాడని నాకు తెలుసు. నేనతన్ని పెండ్లాడినప్పుడు నాకు యిరవై యేండ్లు మాత్రమే, జీవితం యేమిటో తెలుసుకోవాలనే ఉత్సుకతతో నేను చచ్చిపోయినాను, నాకు మరింత ఉన్నతమైనదానిమీద కోరిక కలిగింది. యింతకంటె భిన్నమైన జీవితం మరొకటి వుండాలని మనసులో అనుకున్నాను, ఆ జీవితం నేను జీవించాలి.... నేను ఉత్సుకతతో దహించుకపోయినాను.... మీ కెప్పటికీ అర్థం కాదది; ప్రమాణం చేసి చెప్తున్నాను, నన్ను నేను నిగ్రహించుకోలేకపోయినాను, నన్నేదీ అరికట్టలేకపోయింది, నాకు ఒళ్లు బాగలేదని

నా భర్తతో చెప్పి, యిక్కడికి వచ్చినాను.... పిచ్చి పట్టినట్లు, దయ్యం పట్టినట్లు తిరగసాగినాను.... యిక యిప్పుడు సాదా మనిషినైనాను, పనికిమాలిన మనిషినైనాను, ప్రతి వాళ్లకూ యిప్పుడు నన్ను అసహ్యించుకొనే హక్కు వుంది.''

గూరొవ్ విన్నాడు, భరించరాని విసుగుతో. ఆ పసితనపు ఉచ్చారణా, పశ్చాత్తాపమూ, అంతా అంత అసందర్భంగా, అంత యెదురుచూడనిదిగా వుండింది. ఆమె కన్నులలో ఆ నీరు లేకపోతే, ఆమె హాస్యమాడుతున్నదనో, నటన చేస్తున్నదనో అనుకోవచ్చు.

అతను మృదువుగా అన్నాడు: ''నాకు అర్థం కావడంలేదు. యేమిటి నీకు కావలసింది?''

ఆమె అతని రొమ్మున ముఖం దాచుకొని, గట్టిగా అతనికి ఆనుకుంది.

''నన్ను నమ్మండి. నమ్మమని మిమ్మల్ని ప్రాధేయపడుతున్నాను,'' అన్నది ఆమె. ''జీవితంలో నిష్కపటమూ, పరిశుద్ధమూ అయినదంతా నేను ప్రేమిస్తాను, చెడ్డపని నాకు అసహ్యం, నేనేమి చేస్తున్నానో నాకు తెలియదు. మామూలు జనం అంటుంటారు, తాము సైతాను వలలో చిక్కినామని. యిప్పుడు నేను కూడా సైతాను వలలో చిక్కినానని అనగలను.''

''ఛీఛీ, యేమిటది!'' అని మెల్లగా అన్నాడు అతను.

నిశ్చలమైన, భయవిహ్వలమైన ఆమె కన్నులలోకి అతను నిలజూసినాడు, ఆమెను ముద్దుపెట్టుకున్నాడు, మెత్తని, ప్రేమార్ద్రమైన మాటలతో ఆమెను అనునయించినాడు. క్రమక్రమంగా ఆమె శాంతించి, తిరిగి ఉత్సాహం పొందింది. కాసేపట్లో మళ్లీ యిద్దరూ నవ్వుకుంటూ వుండినారు.

కొంతసేపు తర్వాత వాళ్లు బయటికి వెళ్లినారు. విహారపథంలో మనుషులు ఒక్క పిట్ట లేరు, పట్టణమూ, పట్టణంలోని సైప్రస్ చెట్లూ మరణించినట్లుండినాయి, కానీ సముద్రం బీచిమీద యెగిరిపడుతూ యింకా గర్జిస్తూవుండింది. ఏకాకి చేపల పడవ ఒకటి అలలమీద పడుతూ లేస్తూ వుండింది, పడవలోని దీపం నిద్రమత్తుతో మినుకుమినుకు మంటూ వుండింది.

వాళ్లు కొక గుర్రపుబండి దొరకగా, ఒరియాందకు పోయినారు.

''హాలులో యిప్పుడే నీ పేరు కనుక్కున్నాను,'' అన్నాడు గూరొవ్ ఆమెతో, ''బోర్డుమీద రాసిపెట్టినారు ఫన్ డీడెరిట్స్. నీ భర్త జర్మనా?''

''కాదు. వాళ్ల తాత జర్మన్ అనుకుంటాను. కానీ నా భర్త ఆర్థడాక్స్ మతస్థుడు.''

ఒరియాండలో బండి దిగి, వాళ్ళు చర్చికి కొస్త దూరంలో బెంచీమీద కూర్చున్నారు. వాళ్ళు మాటలు లేకుండా సముద్రంవైపు చూస్తూ వుండినారు. తెల్లవారు జాము పొగమంచులో యాల్టా లీలగా కనిపిస్తూ వుండింది, పర్వత శిఖరాలమీద తెల్లని మేఘాలు నిశ్చలంగా విశ్రమించినాయి. ఆకు అల్లాడలేదు, ఆకుతేళ్ళు కీచుకీచు మంటూవుండినాయి, రోకటిపాట లాంటి సముద్రపు సంద్ర గర్జ వాళ్ళకు వినిపిస్తూవుండింది, శాంతిని గురించి, మనందరి కోసమూ పొంచుకొనివున్న శాశ్వత శాంతిని గురించి, మాట్లాడుతూ. యాల్టాలూ, ఒరియాండలూ లేకముందు సముద్రం యిలాగే గర్జించింది, యిప్పుడూ గర్జిస్తున్నది, యిక ముందు మనం గతించిన తర్వాత కూడా యిలాగే నిర్లక్ష్యంగా సంద్రంగా గర్జిస్తూ వుంటుంది. యీ అనుస్యూతిలో, జీవ మరణాలపట్ల గల యీ పరమ నిర్లక్ష్యంలో, మన అంతిమ మోక్షంయొక్కా, మన గ్రహంమీది జీవస్రవంతియొక్కా, పరిపూర్ణతవైపు దాని నిరంతర గమనంయొక్కా రహస్యం వుండవచ్చు. ప్రాతఃకాంతిలో అంత అతిలోకంగా కనపడే ఒక యువతి పక్కన కూర్చొని, సముద్రమూ, పర్వతాలూ, మేఘాలూ, అనంతమైన ఆకాశమూ, యీ అన్నింటి దివ్య సౌందర్య దర్శనంచేత ప్రశాంతుడై, సమ్మోహితుడై గూరొవ్ తనలో అనుకున్నాడు: లోతుగా ఆలోచిస్తే, ప్రపంచంలో ప్రతిదీ నిజంగా సుందరమైనదే—ఉన్నత జీవిత లక్ష్యాలూ, మానవులంగా మన గౌరవమూ మనకు కనుమరు గైనప్పుడు మన ఆలోచనలూ, చేతలూ తప్ప ప్రతిదీ.

యెవరో వాళ్లను సమీపించినారు—వాచ్‌మన్ కావచ్చు. వాళ్లను చూసి అతను వెళ్లిపోయినాడు. యిందులో కూడా నిగూఢమైనదీ, మనోహరమైనదీ యేదో వుండింది. ఫియొదోసియానుండి వచ్చిన స్టీమరు, దీపాలు ఆరిపోయి, ఉషఃకాంతిలో రేవువద్దకు రావడం కనిపించింది.

''గడ్డిమీద మంచు వుంది,'' అన్నది ఆన్నా సెర్గేయెవ్నా, మౌనం వదలిపెట్టి.

''అవును. యింటికి పోయే వేళ అయింది.''

వాళ్లు పట్టణానికి తిరిగి పోయినారు.

ఆ తర్వాత వాళ్లు ప్రతిరోజూ మధ్యాహ్నం విహారపథంలో కలుసుకునేవాళ్లు, మధ్యాహ్నమూ, రాత్రీ కలిసి భోంచేసేవాళ్ళు, షికార్లు పోయేవాళ్లు, సముద్ర సౌందర్యాన్ని ఆస్వాదించేవాళ్లు. ఆమె నిద్రపట్టడం లేదనీ, గుండెదడ వస్తున్నదనీ ఫిర్యాదులు చేసేది, మళ్లీమళ్లీ అవే ప్రశ్నలు అడిగేది, ఒకసారి అసూయకూ, మరొకసారి అతను తన్ను నిజంగా గౌరవించడంలేదనే భయానికీ మార్చి మార్చి లోనయ్యేది. తరుచుగా, చౌకులోనో, పార్కులోనో యెవరూ కనిపించనప్పుడు, అతను

ఆమెను దగ్గరకు తీసుకొని, ఆవేశంతో ముద్దుపెట్టుకునేవాడు. బొత్తిగా యేమీ పని లేకపోవడమూ, పట్టపగలు పెట్టుకునే యీ ముద్దులూ, వాటివెంట వుండే దొంగ చూపులూ, యెవరికైనా తెలుస్తుందనే భయమూ, వేడీ, సముద్రపు వాసనా, పని లేని, కడుపు నిండిన, నవనాగరికపు మనుషులు నిత్యం వాళ్ల దృష్టి పథంలోకి వస్తూ పోతూ వుండడమూ యివన్నీ అతనికి కొత్త ఆయుస్సును యిచ్చినట్లుంది. ఆమె అందంగా వుందనీ, మహా ప్రలోభకరంగా వుందనీ అతను ఆమెతో చెప్పేవాడు, మహా ఆవేశంతో కామక్రీడకు పురికొనేవాడు, ఒక క్షణం వదలకుండా యెప్పుడూ ఆమె పక్కన వుండేవాడు. ఆమె యెప్పుడూ విచారంగా వుండేది, అతను ఆమెను గౌరవించడంలేదనీ, అణుమాత్రమూ ప్రేమించడంలేదనీ, ఆమెను సాదా స్త్రీగా పరిగణిస్తున్నాడనీ అతనినుండి ఒప్పుదలను రాబట్టడానికి యెప్పుడూ ప్రయత్నించేది. దాదాపు ప్రతి రాత్రీ వాళ్ళు పట్టణంనుండి బయటికి బండిలో షికారు వెళ్లేవాళ్ళు, ఒరియాందకో, జలపాతంవద్దకో, మరొక సౌందర్య స్థానంవద్దకో. ఈ యాత్రలు తప్పనిసరిగా కృతార్థంగా వుండేవి, ప్రతిదీ రాజససౌందర్యపు కొత్త అనుభూతులు సమకూర్చేది.

యీ కాలమంతా వాళ్లు ఆమె భర్త రాకను నిరీక్షిస్తూ వుండినారు. కానీ అతని కేదో కండ్ల జబ్బు వచ్చిందని తెలుపుతూ, ఆమెను సాధ్యమైనంత త్వరలో యింటికి రమ్మని అభ్యర్థిస్తూ భర్తవద్దనుండి ఆమెకు ఉత్తరం వచ్చింది. ఆన్నా సెర్గేయెవ్నా బయలుదేరడానికి తొందర తొందరగా సన్నాహాలు చేసుకుంది.

''నేను పోవడం మంచిది,'' అన్నది ఆమె గూరొవ్‌తో. ''విధి జోక్యం యిది.''

ఆమె యాల్టానుండి బండిలో బయలుదేరింది, రైలు స్టేషనుదాకా అతను వెంటపోయినాడు. బండి ప్రయాణం దాదాపు ఒకరోజంతా పట్టింది. ఆమె యెక్స్‌ప్రెస్ రైలు యెక్కి, రెండవ గంట మ్రోగిన తర్వాత యిలా అన్నది:

''యేదీ, మిమ్మల్ని మరొకసారి చూడనివ్వండి.... చివరి చూపు. ఆఁ, అదీ.''

ఆమె యేడ్వలేదు, కానీ దుఃఖపూరితంగా వుండింది, జబ్బు పడినట్లు కనపడింది, చెక్కిళ్లమీది కండరాలు టకటక లాడుతూ వుండినాయి.

''మిమ్మల్ని అనుకుంటుంటాను.... నిరంతరం అనుకుంటుంటాను,'' అన్నది ఆమె. ''దేవుని దయవల్ల మీకు శుభం కలుగుగాక! నన్ను గురించి దయగా అనుకోండి. మనం శాశ్వతంగా విడిపోతున్నాము. అదే మంచిది. యెందుకంటే, మన మసలు కలుసుకొని వుండకూడదు. సెలవు — దేవుని దయవల్ల మీకు శుభం కలుగుగాక!''

రైలు వేగంగా స్టేషన్ దాటిపోయింది, రైలు దీపాలు త్వరలో అదృశ్యమైనాయి,

ఒక నిముషం తర్వాత దాని శబ్దం కూడా అంతరించింది — యీ మధురమైన మైమరపును, యీ ఉన్మాదస్థితిని, వీలైనంత త్వరగా ముగించడానికి ప్రతిదీ కుట్ర పన్నుతున్నట్లు. గూరొవ్ ప్లాట్‌ఫారంమీద ఒంటరిగా నిలబడి, అంధకారమయమైన దూరంలోకి చూపులు నిగుడించి, ఆకుతేళ్ల కీచునాదమూ, టెలిగ్రాఫ్ తంతెల ఓంకారనాదమూ విన్నాడు — అప్పుడే మెలకువ వచ్చిన అనుభూతి పొందుతూ. అతను మనసులో అనుకున్నాడు, తన జీవితంలో కలిగిన అనేక ప్రణయకలాపాల లాంటిదే యిది మరొకటి అనీ, యిది కూడా ముగిసిందనీ, స్మృతి తప్ప యేమీ మిగలలేదనీ.... అతనికి మనస్సు సంచలించింది, దుఃఖం కలిగింది, కించిత్తు పశ్చాత్తాపం కలిగింది. యెంతైనా, మళ్లీ జీవితంలో తానెన్నడూ చూడబోని యీ యువతి తనతో నిజమైన సంతోషం పొందలేదు. ఆమెపట్ల తాను హార్దికంగా, అపేక్షగా వుండినాడు, కానీ తన మొత్తం ప్రవర్తనలో, తన కంఠస్వరాలలో, తన ఆలింగనాలలోనే ఒక వ్యంగ్య రేఖ వుండింది, అదృష్టవంతుడైన మగమహారాజుయొక్క అవజ్ఞా పూర్వకమైన ఆదరణ వుండింది; పైగా, తాను వయసులో ఆమెకంటె రెండింతలు పెద్దవాడు. తాను మంచివాడనీ, అసాధారణుడనీ, ఉదాత్తుడనీ ఆమె పట్టుబట్టి అనేది. అనగా తాను తన నిజమైన వ్యక్తిత్వంకంటె భిన్నంగా ఆమెకు కనపడినాడన్నమాట; ఒక్క మాటలో చెప్పాలంటే, తాను అనుకోకుండానే ఆమెను మోసగించినాడు....

గాలిలో హేమంత స్ఫూర్తి వుండింది, సాయంత్రం చలిగా వుండింది.

"నేను కూడా ఉత్తరాదికి వెళ్లే సమయం వచ్చింది," అనుకున్నాడు గూరొవ్, ప్లాట్‌ఫారంమీదనుండి బయటికి నడుస్తూ. "సమయం పూర్తిగా వచ్చింది!"

## III

అతను మాస్కో చేరేటప్పటికి చలికాలం ప్రారంభమౌతున్నట్లుండింది; స్టౌలు రోజూ వేడిచేస్తూవుండినారు, పిల్లలు బడికి పోడానికి నిద్రలేచేటప్పటికి యింకా చీకటిగా వుండేది, అందువలన నర్సు కాసేపు దీపం వెలిగించేది. చలి ప్రవేశించింది. మొదటి మంచు పడితే, మొదటిసారి మంచుబండిమీద షికారు పోయినప్పుడు, తెల్లని నేలా, తెల్లని మిద్దె కప్పులూ చూడడం హాయిగా వుంటుంది; స్వేచ్ఛగా, తేలికగా వూపిరి పీల్చుకుంటుంటే, యవ్వనపు రోజులు జ్ఞాపకం వస్తాయి. మంచుతో

తెల్లగా వున్న పురాతనపు లైమ్‌చెట్లూ, బర్చ్‌చెట్లూ ప్రసన్నంగా కనపడతాయి, సైప్రస్ చెట్లకంటె, పామ్‌చెట్లకంటె హృదయానికి సన్నిహితంగా వుంటాయి; వాటి కొమ్మలకింద పర్వతాల, సముద్రాల స్మృతి మనిషిని వెంటాడదు.

గూరొవ్ యెప్పుడూ మాస్కోలో జీవించినవాడు. అతను ఒక మంచి చలి రోజున మాస్కోకు తిరిగివచ్చి, ఫర్ లైనింగు గల చలికోటూ, మందం గ్లౌలూ ధరించి, పెత్రోవ్కా వీధిలో తీరికగా అడుగులు వేస్తూ నడిచినప్పుడూ, శనివారం సాయంత్రం చర్చి గంటల గణగణ విన్నప్పుడూ, అతని యిటీవలి ప్రయాణమూ, అతను చూసిన స్థలాలూ వాటి ఆకర్షణ కోల్పోయినాయి. క్రమక్రమంగా అతను మాస్కో జీవితంలో మునిగిపోయినాడు, ఆబగా రోజూ మూడు వార్తాపత్రికలు చదివేవాడు, ఒకవైపున మాస్కో వార్తాపత్రికలు చదవక పోవడం తన నియమం అని చెప్పుకుంటూ. మళ్లీ అతను రెస్టరెంటుల, క్లబ్బుల, విందుల, వినోదాల సుడిగుండంలో చిక్కుకున్నాడు. మళ్లీ అతను సుప్రసిద్ధ న్యాయవాదులూ, నటులూ తన యింటికి వస్తారనీ, మెడికల్ క్లబ్బులో తాను ఒక ప్రొఫెసర్‌తో పేకాట ఆడుతాననీ అనే గర్వకారకమైన స్పృహతో ఉబ్బిపోయినాడు.

ఒక నెలలో ఆన్నా సెర్గేయెవ్నా వట్టి అస్పష్ట స్మృతిగా వుంటుందనీ, ఆ కాంక్షాభారపు దరహాసంతో, ఆమెలాంటి యితర స్త్రీలలాగే, తనకు అప్పుడప్పుడు కలలో మాత్రం వస్తుందనీ అతను నమ్మినాడు. కానీ, యిప్పుడు నెల బాగా గడిచి పోయి, చలి కాలం నడికొనింది; అయినా, నిన్ననే ఆన్నా సెర్గేయెవ్నా విడిపోయినంత స్పష్టంగా వుంది అతని మనసులో అంతా. అతని స్మృతులు అంతకంతకూ గాఢమైనాయి. అతను తన పఠనాగారంలో వుండగా, సాయంత్రపు నిశ్చలత్వంలో, పాఠాలు చదువుకునే తన పిల్లల గొంతులు చెవులబడినప్పుడూ, రెస్టరెంటులో ఒక పాటో, జంత్ర నాదమో వినపడినప్పుడూ పొగగూట్లో గాలి గీపెట్టినప్పుడూ, అతనికి వెనకటివన్నీ తలపుకు వచ్చేవి: రేవువద్ద ప్రత్యూషఃకాలమూ, పొగమంచు చాటున పర్వతాలూ, ఫియొదోసియానుండి వచ్చే స్టీమరూ, ముద్దులూ. చాలాసేపు అతను తన గదిలో అటూయిటూ పచార్లు చేస్తూ, తన స్మృతులను చూసి చిరునవ్వు నవ్వుకునేవాడు, తరువాత స్మృతి పగటికలగా మారేది, అతని ఊహలో జరిగిందీ జరగబోయేదీ కలగలిసి పోయేవి. ఆన్నా సెర్గేయెవ్నా అతనికి కలలో రాలేదు, ఆమె యెప్పుడూ అతని వెంట వుండింది, నీడలాగా, అతను యెక్కడికి పోయినా అనుసరిస్తూ. అతను కండ్లు మూసుకుంటే, ఆమె సాక్షాత్తుగా యెదుట నిలబడినట్లుండేది, వాస్తవంగా ఆమె వుండినంతకంటె మనోహరంగా, పడుచుదిగా, కోమలంగా; వెనక్కి

చూసుకుంటే, అతనికి అతనే యాల్టాలో పున్నంతకంటె బాగా కనిపించేవాడు. సాయంత్రంపూట ఆమె బుక్‌షెల్ఫులలోనుండీ, పొయ్యివద్దనుండీ, గది మూలల నుండీ అతనివైపు చూసేది; ఆమె వూపిరి తీసుకోవడమూ, ఆమె దుస్తుల శ్రావ్యమైన సవసవా అతనికి వినిపించేవి. వీథుల్లో అతను స్త్రీలను కలయజూసేవాడు, ఆమె లాంటివా ళ్లెవరైనా కనిపిస్తారేమో అని....

తన స్మృతులు యెవరితోనైనా చెప్పుకోవాలని అతని కొక దుర్వారమైన కోరిక కలగసాగింది. తన ప్రేమను గురించి అతను యింట్లో మాట్లాడలేదు, యిక బయట తన మనసు విప్పడానికి యెవరున్నారు? తన యింట్లో అద్దె కున్నవాళ్లా, కాదు; బాంకిలో తన సహోద్యోగులా, కానేకాదు. యింతకూ చెప్పడానికి యేముందని? తనకు కలిగింది ప్రేమేనా? ఆన్నా సెర్గేయెవ్నాతో తనకు గల సంబంధాలలో అతిలోక సుందరమైన దేమైనా వుందా? కవితామయమైన దేమైనా వుందా? జ్ఞానదాయకమైనది గానీ, చివరకు వినోదకరమైనదిగానీ యేమైనా వుందా? ప్రేమను గురించీ, స్త్రీలను గురించీ అతను అస్పష్టమైన సూత్రాలు మాత్రం మాట్లాడ గలిగినాడు; అతని ఉద్దేశ మేమిటో యెవరికీ అర్థం కాలేదు. కానీ, అతని భార్య, తన నల్లని కనుబొమలు చిటచిటలాడిస్తూ; యిలా అన్నది:

''షోకిల్లా పాత్ర నీకు బొత్తిగా సరిపడదు దిమిత్రీ.''

ఒక సాయంత్రం, ప్రభుత్వోద్యోగి అయిన ఒక పేకాట మిత్రునితో కలిసి మెడికల్ క్లబ్బులోనుండి బయటికి వస్తూ, అతను వుండబట్టలేక యిలా అన్నాడు:

''యాల్టాలో నేను యెంత మనోహరమైన స్త్రీని కలుసుకున్నానో తెలుసా!''

ఉద్యోగి మంచుబండిలో యెక్కి, సరిగ్గా బయలుదేరే టప్పుడు కేకవేసినాడు:

''ద్మిత్రీ ద్మిత్రిచ్!''

''ఆఁ?''

''మీరన్నది నిజమే — చేప కాస్త కాటుబోయింది.''

యీ మాటలు, అంత మామూలువైనా, యెందువల్లనో గూరొవ్‌కు మంట పుట్టించినాయి, అవమానకరంగా, అసహ్యంగా కనిపించినాయి. యెంత ఆటవిక మర్యాదలు, యేం మనుషులు! యెంత వృథా అయిన సాయంత్రాలు, యెంత విసుగు కలిగించే నిస్సారపు దినాలు! ప్రాణంమీదికి వచ్చినట్లు పేకాడడమూ, చెడ తినడమూ, చెడ తాగడమూ, ఒకే విషయం గురించి యెడతెగకుండా మాట్లాడడమూ. యెవరికీ అక్కరకు రాని విషయాలలోనూ, చర్చించిన విషయాన్నే మళ్లీమళ్లీ చర్చించడంలోనూ మనిషికున్న కాలంలోనూ, శక్తిలోనూ అధిక భాగం వ్యయమై పోతున్నాయి;

వీటి కన్నిటికీ ఫలితంగా దక్కింది యేమిటంటే, యిలకరుచుకున్న అవిటి బతుకూ, కొరగాని చిల్లర విషయాల పరంపరా; వీటినుండి తప్పించుకొని పోడానికి మరొకచోటు లేదు; యిదంతా పిచ్చాసుపత్రిలోనో, జైలులోనో వున్నట్లుంది!

గూరొవ్‌కు ఆ వేడితో ఆ రాత్రంతా నిద్రపట్టలేదు, మరుదినం పగలంతా అతను తలనొప్పితో తిరిగినాడు. తరువాతి రాత్రిళ్లు కూడా అతనికి సరిగా నిద్రపట్టక, మంచంలో లేచి కూర్చొనేవాడు ఆలోచిస్తూ, లేదా గదిలో పచారుచేసేవాడు. అతనికి పిల్లలన్నా, బాంకన్నా వెగటు కలిగింది, యెక్కడికి పోవడానికీ, యేమి మాట్లాడడానికీ యిష్టం లేకపోయింది.

క్రిస్మస్ సెలవులు వచ్చినప్పుడు అతను సామాన్లు సర్దుకొని, ఒక యువకుని పనిమీద పీటర్స్‌బర్గ్‌కు పోతున్నానని భార్యతో చెప్పి, యస్ పట్టణానికి బయలుదేరినాడు. యేం చెయ్యాలని? అతనికే సరిగా తెలియదు. అతనికి తెలిసిందల్లా తాను ఆన్నా సెర్గేయెవ్నాను చూడాలి, ఆమెతో మాట్లాడాలి, వీలైతే సమావేశం కుదిరించుకోవాలి.

ప్రొద్దున్నే అతను యస్ చేరినాడు, హోటల్లో కెల్ల మంచి గది అద్దెకు తీసుకున్నాడు. దానిలో నేలమీద బూడిద రంగు రత్నకంబళి వుంది, టేబుల్‌మీద ధూళి నిండిన కలందాను వుంది, దానిమీద తల లేని ఆశ్వికుని బొమ్మ వుంది, చేతితో టోపీ యెత్తిపట్టుకొని. అతనికి కావలసిన సమాచారం హోటల్ నౌకరు చెప్పినాడు: ఫన్ డీడెరిత్స్‌కు స్తారొ గొంచార్నయ వీధిలో సొంత యిల్లు వుంది. అది హోటల్‌కు దూరం కాదు. అతను దర్జాగా, వైభవంగా జీవిస్తున్నాడు, అతనికి గుర్రపుబండ్లు వున్నాయి, పట్టణ మందరికీ అతను తెలుసు. అతని పేరును నౌకరు "ద్రిదిరిత్స్" అని ఉచ్చరించినాడు.

స్తారొ గొంచార్నయ వీధిలో గూరొవ్ మెల్లగా నడుచుకుంటూ వెళ్లి, ఆ యిల్లు కనుక్కున్నాడు. యింటికి యెదురుగా పొడవైన, బూడిద రంగు కంచె, కొయ్య పలకలది వుంది; పలకలమీద పదును పాటు పైకి వుండేటట్లు మేకులు దిగగొట్టబడినాయి.

ఆ యింటి కిటికీలవైపూ, కంచెవైపూ చూస్తూ గూరొవ్ అనుకున్నాడు: "యిలాంటి కంచె చాలు, యెవరికైనా పారిపోవా లనిపిస్తుంది."

ఆరోజు సెలవు గనుక, ఆమె భర్త యింట్లో వుండవచ్చునని అతను తర్కించుకున్నాడు. యేమైనా, తాను ఆ యింట్లోకి పోయి ఆమెను యిబ్బందిపెట్టడం అనుచితంగా వుంటుంది. చీటీ పంపిస్తే, ఆమె భర్త చేతుల్లో పడి, సర్వనాశనం

కలిగించవచ్చు. అన్నిటికంటె ఉత్తమమైన పని ఆమె కనిపించే అవకాశం కొరకు ఆ ప్రాంతంలో కాచుకోవడం. అతను అవకాశం కొరకు వీధిలో అటూయిటూ తిరుగుతూ, కంచెకు సమీపంలో తచ్చాడుతూ వుండినాడు. ఒక బిచ్చగాడు గేటులో ప్రవేశించినాడు, అతనిమీద కుక్కలు దాడిచేసినాయి. ఒక గంట తర్వాత మెల్లని అస్పష్టమైన పియానో ధ్వనులు అతని చెవుల బడినాయి. అన్నా సెర్గేయెవ్నా వాయిస్తూ వుండవచ్చు. హఠాత్తుగా తలవాకిలి తెరచుకొని, ఒక ముసలామె బయటికి వచ్చింది, పరిచితమైన తెల్ల పామెరేనియా కుక్క ఆమెవెంట వుండింది. గూరొవ్ కుక్కను పిలవడానికి ప్రయత్నించినాడు, కానీ అతని గుండె తీవ్రంగా కొట్టుకొంది, ఆ ఆందోళనలో అతనికి దాని పేరు జ్ఞాపకం రాలేదు.

అతను నడుస్తూ ముందుకు సాగినాడు, బూడిద రంగు కంచెను అంతకంతకూ యెక్కువగా ద్వేషిస్తూ. కోపంగా అతను అన్నా సెర్గేయెవ్నా తన్ను మరచిపోయిందనీ, బహుశా యిప్పటికి మరొకణ్ణి చూసుకొని వుంటుందనీ, పొద్దస్తమానం యీ పాపిష్ఠి కంచెను చూడవలసి వున్న యువతికి అంతకంటె సహజమైనది యేముంటుందనీ తనలో తాను అనుకోడానికి సిద్ధంగా వుండినాడు. అతను హోటల్‌కు తిరిగిపోయి తన గదిలో సోఫామీద కొంతసేపు పండుకున్నాడు, యేమి చేయడానికీ తోచక; తరువాత అతను భోజనం చేసినాడు, భోజనం తరువాత చాలా సేపు నిద్రపోయినాడు.

నిద్ర లేచి, చీకటిగా వున్న కిటికీలవైపు చూస్తూ అతను ''యెంత తెలివి లేని, శాంతి లేని వ్యవహారం,'' అనుకున్నాడు. అప్పటికి సాయంత్రమైంది. ''నిద్రంతా తీరింది. యేం చెయ్యాలి రాత్రికి?''

అతను మంచంమీద లేచి కూర్చున్నాడు. ఆ మంచంమీద కప్పిన చౌక, బూడిద రంగు రగ్గు ఆస్పత్రి దుప్పట్లను గుర్తుకు తెచ్చింది. ఆ కలతలో అతను తన్ను తాను భంగించుకో సాగినాడు:

''నీవూ, నీ కుక్కను వెంటబెట్టుకున్న మహిళా.... మంచి ప్రణయ వ్యవహారమే! నీ కష్టాలకు ప్రతిఫల మేమిటో చూడు.''

ఆ ఉదయం అతను స్టేషన్‌లో దిగినప్పుడు, స్థానిక నాటకశాలలో 'గెయ్‌షా' ప్రథమ ప్రదర్శన అని బ్రహ్మాండమైన అక్షరాలలో ప్రకటించే పోస్టర్ చూసినాడు. అది జ్ఞాపకం వచ్చి అతను లేచి, నాటకశాలకు దారితీసినాడు.

''ఆమె ప్రథమ ప్రదర్శనకు పోవడం యెంతైనా ప్రాయికం,'' అనుకున్నాడు అతను.

నాటకశాల నిండివుండింది. అది అప్పం చిన్న పట్టణాల నాటకశాల, దీపాల చుట్టూ పొగమంచు చేరుతూ వుండింది, గాలరీలోని జనం అస్తిమితంగా గోలచేస్తూ వుండినారు. ఫస్టుక్లాసులోని మొదటి వరుసలో స్థానిక షోకిల్లాలు తెర లేవడం కొరకు కాళ్లమీద కాచుకొని వుండినారు. గవర్నర్ బాక్సు ముందు సీటులో గవర్నర్ కూతురు కూర్చొని వుంది, మెడలో బోవా ధరించి; బాక్సు తెరల చాటున గవర్నరు వినయంగా దాక్కున్నాడు, చేతులు మాత్రం బయటికి కనిపించేటట్లు. తెర కదిలింది, ఆర్కెస్ట్రా తమ వాద్యాలు శ్రుతిపెట్టుకోడానికి చాలాసేపు పట్టింది. లోపలికి వచ్చి, తమతమ ఆసనాలలో కూర్చునే ప్రేక్షకులను గూరొవ్ కన్నులు ఉత్సుకతతో కలయ జూస్తూ వుండినాయి. ఆన్నా సెర్గేయెవ్నా కూడా లోపలికి వచ్చింది. ఆమె ఫస్టుక్లాసులోని మూడవ వరుసలో కూర్చుంది. గూరొవ్ చూపు ఆమెమీద పడినప్పుడు, అతని గుండె ఆగినట్లైంది, మెరుపులాగ అతనికి సుసుకు వచ్చింది, యావత్ప్రపంచంలోనూ తనకు యింతకంటె ఆత్మీయమైనవాళ్లూ, ప్రియతమమైనవాళ్లూ లేరని, తన ఆనందానికి యింతకంటె ముఖ్యమైనవాళ్లు లేరని. యీ చిన్న స్త్రీ, చిన్న పట్టణం జనంలో కలిసి పోయినది, యేవిధంగానూ అసాధారణమైనది కానిది, చేతిలో వెధవ బైనాకులర్స్ పట్టుకున్నది, యిప్పుడు తన జీవితమంతా ఆక్రమించింది, తన దుఃఖమూ, తన ఆనందమూ, తన సమస్త వాంఛా అయింది. దుర్బల, అపరిణత వయొలినిస్టులు గల దౌర్భాగ్యపు ఆర్కెస్ట్రానుండి వచ్చే ధ్వనులచేత జోకొట్టబడి, ఆమె యెంత అందంగా వుందా అని అతను అనుకున్నాడు.... అనుకుంటూ, కలలలో మునిగిపోయినాడు....

ఆన్నా సెర్గేయెవ్నావెంట గుండ్రని భుజాలూ, చిన్న పుస్తీలూ గల పొడవాటి యువకుడు వుండినాడు; ఆమె పక్కన కూర్చున్నాడు. అతను అడుగడుగునా తల ఆడిస్తూ, నిత్యం యెవరికో ఒకరికి నమస్కరిస్తున్నట్లు కనిపించినాడు. యితను ఆమె భర్త అయివుండాలి -- యాల్టాలో ఆమె, మంట పుట్టినప్పుడు, "జోహుకుంగాడు" అన్న మనిషి. అతని జండాకర్ర లాంటి ఆకారంలోనూ, పుస్తీలలోనూ, నడినెత్తిన వున్న కాస్త బట్టతలలోనూ నిజంగా సేవకుని దాస్యభావం కొంత వుండింది. అతను తియ్యని చిరునవ్వులు నవ్వుతూ వుండినాడు; కోటు కాజాలోవున్న యేదో విజ్ఞానశాస్త్ర సంఘపు బాడ్జి నౌకర్ల దుస్తులమీది నంబరు లాగ వుండింది.

మొదటి ఇంటర్వల్‌లో భర్త సిగరెట్టు కాల్చుకోడానికి బయటికి వెళ్లినాడు. ఫస్టుక్లాసు సీటులో కూర్చొని వుండిన గూరొవ్ ఆమె వద్దకు వెళ్లి, కంపిస్తున్న కంఠంతో, బలవంతపు చిరునవ్వుతో "నమస్తే", అన్నాడు.

ఆమె అతనివైపు కన్ను లెత్తి, పాలిపోయింది, భయంతో మళ్లీ అతనివైపు చూసింది, తన కన్నులనే నమ్మలేకపోయింది, చేతిలోని విసనక్రరసూ, బైనాకులర్లనూ అణగబట్టుకుంది, స్మృతిదప్పి పడిపోకుండా వుండడానికి ప్రయత్నిస్తున్నదని అర్థవౌ తున్నది. యెవరూ ఒక మాట కూడా మాట్లాడలేదు. ఆమె అక్కడే కూర్చొని వుంది; అతను ఆమె పక్కనే నిలబడి వున్నాడు, ఆమె యిబ్బంది వలన అస్థిమితుడై, కూర్చొనే సాహసం లేక. ఫిడేళ్లూ, వేణువులూ వాటికి పెట్టిన శ్రుతులలో పాడేస్తున్నాయి, వాతావరణంలో యేదో వ్యగ్రత వుండింది, అందరి కన్నులూ వాళ్లమీదనే వున్నట్లు. చివరకు ఆమె లేచి, వడివడిగా ఒక వాకిలివైపు నడిచింది. అతను ఆమెను అనుసరించినాడు, యిద్దరూ లక్ష్య రహితంగా కారిడర్లలోనూ, నిచ్చెనలలో పైకీ, కిందికీ తిరిగినారు; న్యాయశాఖ ఉద్యోగుల, హైస్కూలు టీచర్ల, సివిల్ ఉద్యోగుల దుస్తులలో వున్న రూపాలు, అన్నీ బాడ్జీలు ధరించినవి, మెరుపుల్లా కనిపించి పోతున్నాయి; స్త్రీలూ, గుంజలకు వ్రేలాడే కోట్లూ మెరుపుల్లా కనిపించి పోతున్నాయి; బస్సున గాలి వచ్చింది, సిగరెట్టు పీకల వాసనతో. గూరొవ్, గుండె ఉత్పాతంగా కొట్టుకుంటుండగా, అనుకున్నాడు:

''యీ మనుషు లందరూ, యీ ఆర్కెస్ట్రా దేనికోసం?...''

మరు నిముషంలో అతనికి హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది — ఆరోజు సాయంత్రం స్టేషన్‌లో అన్నా సెర్గేయెవ్నాను సాగనంపిన తర్వాత అతను అనుకున్నాడు, అంతా ముగిసిపోయిందనీ, తాము మళ్లీ యెప్పటికీ కలుసుకోమనీ. ముగింపు యిప్పుడు యెంత దూరాన వున్నట్లు కనపడుతున్నది!

చీకటిగా వున్న ఒక యిరుకు నిచ్చెనమీద ఆమె నిలబడింది; ఆ నిచ్చెనమీద ''అప్పర్ సర్కిల్‌కు దారి'' అనే బోర్డు వుంది.

''యెంతగా జడిపించినారు నన్ను!'' అన్నది ఆమె, బరువుగా వూపిరి తీసుకుంటూ, యింకా పాలిపోయి, సగం కొయ్యబారి. ''ఓ, యెంతగా జడిపించినారు! నేను దాదాపు చచ్చిపోయినాను! యెందుకు వచ్చినారు మీరు? యెందుకు వచ్చినారు చెప్పండి?''

''మరి, అన్నా,'' అన్నాడు అతను, మెత్తగా, వడివడిగా మాట్లాడుతూ. ''మరి, అన్నా.... నీవు అర్థం చేసుకోవాలి .... అర్థం చేసుకోడానికి ప్రయత్నించు....''

ఆమె అతనివైపు భయమూ, అభ్యర్థనా, ప్రేమా కలిసిన చూపు చూసింది, తరువాత నిశ్చలంగా అతనిమీద చూపు నిలిపింది, అతని రూపురేఖలు తన స్మృతిఫలకంమీద స్థిరంగా ముద్రించుకోడానికా అన్నట్లు.

"నేను చాలా బాధపడినాను," అంటూ ఆమె కొనసాగించింది, అతని మాటలు పట్టించుకోకుండా. "ప్రతి నిముషమూ మనసులో మీరే మెదిలేవాళ్లు, మరే ఆలోచనకూ తావు లేకుండా; మీ ఆలోచనలమీదనే బతికినాను. మరిచిపోడానికి ప్రయత్నించినాను — ఓ, యెందుకు వచ్చినారు మీరు, యెందుకు చెప్పండి?"

నిచ్చెన వద్ద పై అంతస్తుమీద యిద్దరు స్కూలు పిల్లలు సిగరెట్లు తాగుతూ, కిందికి చూస్తూ వుండినారు; గూరొవ్ వాళ్లను లక్ష్యపెట్టకుండా ఆన్నా సెర్గేయెవ్నాను దగ్గరకు లాక్కొని, ఆమె ముఖమూ, పెదవులూ, చేతులూ ముద్దుపెట్టుకోసాగినాడు.

"ఓ, యేమిటి మీరు చేసేది, యేమిటి మీరు చేసేది?" అంటూ భయసంభ్రమంతో ఆమె వెనక్కి తగ్గింది. "మనిద్దరికీ మతులు పోయినాయి. యీ రాత్రే వెళ్లిపొండి, యీ క్షణమే వెళ్లిపొండి.... భగవంతుని తోడుగా చెప్తున్నాను, మిమ్మల్ని ప్రాధేయపడుతున్నాను.... ఓ, యెవరో వస్తున్నారు!"

యెవరో మెట్లెక్కుతుండినారు.

"మీరు వెళ్లిపోవాలి," అంటూ ఆన్నా సెర్గేయెవ్నా గుసగుస చెప్పసాగింది. "వినండి ద్మీత్రీ ద్మీత్రిచ్. నేను మాస్కోకు మీవద్దకు వస్తాను. నేనెప్పుడూ సుఖపడలేదు, యిప్పుడు బాధపడుతున్నాను, నా కెప్పుడూ సుఖం వుండదు, యెప్పుడూ వుండదు! నా కింకా బాధ కలిగించకండి! నేను మాస్కోకు వస్తాను, మీవద్దకు, ప్రమాణంగా వస్తాను! యిప్పుడిక మనం విడిపోవాలి! నా ప్రేమ పెన్నిధివి కదూ, నా కరుణామూర్తివి కదూ, మనం విడిపోక తప్పదు."

ఆమె అతని చేయి నొక్కి, బిరబిర మెట్లు దిగిపోయింది, అడుగడుగునా వెనక్కి తిరిగిచూస్తూ; ఆమె నిజంగా బాధపడుతున్నదని ఆమె కన్నుల్లో కనపడింది. గూరొవ్ కొంచెం సేపు అక్కడే నిలబడినాడు, వింటూ. అంతా నిశ్శబ్దమైన తర్వాత, అతను తన చలికోటు కోసం పోయి, నాటకశాలనుండి వెళ్లిపోయినాడు.

## IV

ఆన్నా సెర్గేయెవ్నా అతన్ని చూడడానికి మాస్కోకు పోవడం ప్రారంభించింది. రెండు మూడు నెలల కొకసారి ఆమె యస్ పట్టణంనుండి వెళ్లిపోయేది; స్త్రీ వ్యాధుల నిపుణుని సంప్రదించడానికి పోతున్నానని భర్తతో చెప్పేది, భర్త నమ్మేవాడు, నమ్మకపోయేవాడు. ఆమె మాస్కోలో యెప్పుడూ 'స్లవ్యాన్స్కీ బజార్' హోటల్లో

దిగి, దిగిన మరుక్షణమే ఒక యెఱ్ఱ టోపీ మనిషిని గూరొవ్‌వద్దకు పంపేది. గూరొవ్ ఆమెవద్దకు వెళ్ళేవాడు. మాస్కోలో యెవరికీ యీ విషయం తెలియదు.

ఒక చలికాలం ఉదయం యథాప్రకారం అతను ఆమెను చూడడానికి పోయినాడు (వార్తాహరుడు ముందు రోజు సాయంత్రం అతని కోసం వచ్చినాడు, కానీ అతను యింట్లో లేడు). అతని కూతురు అతని వెంట వుండింది; ఆమె బడి ఆ దారిలోనే గనుక, అతను పనిలో పనిగా ఆమెను బడిదగ్గర వదలిపెట్టవచ్చు ననుకున్నాడు. సగం మంచూ సగం చినుకులూ బాగా పడినాయి.

గూరొవ్ కూతురుతో అన్నాడు: "సున్నకు పైన మూడు డిగ్రీలు వుంది, కానీ మంచు పడుతున్నది. యెందుకో తెలుసా? భూమికి ఆనుకొని మాత్రమే సున్నకు పైన వుంది, వాతావరణంలోని పైపొరలలో ఉష్ణోగ్రత భిన్నంగా వుంది."

"చలికాలంలో ఉరుములైనా వుండవేం నాన్నా?"

యిది కూడా అతను వివరించినాడు. అతను ఒకవైపున మాట్లాడుతూ, మరొకవైపున జ్ఞాపకం చేసుకుంటూ వుండినాడు, ఒక్క ప్రాణికి కూడా తెలియని, బహుశా యెన్నటికీ తెలియబోని సమావేశానికి తాను పోతున్నానని. తాను ద్వంద్వ జీవితం జీవిస్తున్నాడు — ఒకటి బహిరంగంగా, యెవరికి సంబంధించిందో వాళ్ళందరి యెదుటా జీవించేది, సాంప్రదాయిక సత్యంతో, సాంప్రదాయిక వంచనతో నిండినది, సరిగ్గా తన మిత్రుల, పరిచితుల జీవితాల లాంటిది; మరొకటి రహస్యంగా ప్రవహించేది. యేదో వింత, బహుశా కేవలం యాదృచ్ఛికమైన పరిస్థితుల పరంపర చేత, ముఖ్యమైనదీ, ఆసక్తికరమైనదీ, సారభూతమైనదీ ప్రతిదీ, దేన్ని గురించి తాను చిత్తశుద్ధిగా వున్నాడో, దేన్ని గురించి తాను ఆత్మవంచన చేసుకోడో ఆ ప్రతిదీ, తన జీవితపు గుజ్జు అయిన ప్రతిదీ, రహస్యంగా జరుగుతున్నది. కానీ తనలో బూటకమైనది ప్రతిదీ, తాసూ, తనలోని సత్యమూ దేనిలో దాక్కున్నారో ఆ పొట్టు అయిన ప్రతిదీ — బాంకిలో తన పనీ, క్లబ్బులో చర్చలూ, తన "అధమ జాతీ," భార్యతో కలిసి వార్షికోత్సవాలకు హాజరు కావడమూ — ఉపరితలంలో జరుగుతున్నది. తననుబట్టి అతను యితర్లను అంచనావేయ నారంభించినాడు, కనపడేదాన్ని యిక యెంతమాత్రమూ నమ్మకుండా, ప్రతి వ్యక్తియొక్క నిజమైన, ఒకేఒక ఆసక్తికరమైన జీవితం రాత్రి ముసుగులో, రహస్యంగా సాగుతుందని నిత్యం నమ్ముతూ. ప్రతి వ్యక్తి మనుగడా నిగూఢత చుట్టూ పరిభ్రమిస్తుంది; వ్యక్తిగత రహస్యాలకు ఉచితమైన గౌరవం గురించి సంస్కారవంతు లందరూ అంత గట్టిగా పట్టుబట్టడానికి ప్రధాన కారణం బహుశా అదే కావచ్చు.

బడి వాకిలివద్ద కూతురును వదలి, గూరొవ్ 'స్లవ్యాన్స్కీ బజార్'కు పోయినాడు. హాలులో అతను చలికోటు విప్పి, పై అంతస్తుకు పోయి, మెల్లగా తలుపు తట్టినాడు. ఆన్నా సెర్గేయెవ్నా అతనికి అత్యంత ప్రీతికరమైన బూడిదరంగు దుస్తు ధరించి, ప్రయాణంచేతా, సందిగ్ధ మనస్కృతచేతా నీరసించి, గత సాయంత్రంనుండి అతని కోసం నిరీక్షిస్తూ వుండింది. ఆమె పాలిపోయి వుండింది, చిరునవ్వు లేకుండా అతనివైపు చూసింది, కానీ అతను గదిలో అడుగు పెట్టీపెట్టకముందే అతని కౌగిట్లో వాలింది. వాళ్ల ముద్దు దీర్ఘంగా, చాలా సేపు సాగింది, చాలా యేండ్లగా వాళ్లు కలుసుకోనట్లు.

"బాగున్నావా?" అని అతను అడిగినాడు. "యేమైనా కొత్త సంగతులా?"

"ఆగు, ఒక నిముషంలో చెప్తాను.... ఊహూం, చెప్పలేను...."

ఆమె మాట్లాడలేకపోయింది, యేడుస్తూ. పక్కకు తిరిగి చేతిగుడ్డ కండ్లకు అద్దుకుంది.

"యేడుపంతా యేడ్చేసిందాకా ఆగుతాను," అనుకుంటూ అతను కుర్చీలో కూలబడినాడు.

అతను గంట నొక్కి టీ తెప్పించుకున్నాడు. అతను టీ తాగుతుండగా, ఆమె యింకా అక్కడ నిలబడే వుంది, కిటికీవైపు ముఖం తిప్పి. ఆమె హృదయ భారంచేత యేడ్చింది, తమ జీవితం యెంత దుఃఖభాజనమైందా అన్న బాధాకర స్పృహచేత యేడ్చింది; తాము ఒకరినొకరు చూసుకునేది రహస్యంగా మాత్రమే, లోకానికి చాటుగా మాత్రమే, దొంగలైనట్లు. తమది భగ్న జీవితం కాదా?

"యేడవాకు," అన్నాడు అతను.

తమ యీ ప్రేమ త్వరలో అంతం కాదనీ, యెప్పు డంతమయ్యేదీ యెవరికీ తెలియదనీ అతనికి స్పష్టంగా వుంది. ఆన్నా సెర్గేయెవ్నా తనను అంతకంతకూ ఆపేక్షగా ప్రేమిస్తున్నది, తనను ఆరాధిస్తున్నది, యెప్పుడో ఒకనాడు యీ ప్రేమ అంతం కాకతప్పదని ఆమెతో చెప్పడంలో అర్థం లేదు. నిజానికి ఆమె తన మాట నమ్మదు.

అతను దగ్గరికి పోయి ఆమె భుజాలు పట్టుకున్నాడు, తేలిక మాటలతో ఆమెను లాలించే ఉద్దేశంతో; కానీ అప్పుడే అతనికి అద్దంలో తన రూపం కనపడింది.

అతని తల అప్పుడే తెల్లబడడం ప్రారంభమైంది. గత కొద్ది యేండ్లలో అంతగా తాను వయసెక్కడం అతనికి చిత్ర మనిపించింది. తన చేతులకింద వున్న భుజాలు వెచ్చగా, జీవశక్తితో ప్రకంపిస్తూ వున్నాయి. యీ జీవంపట్ల, అంత

వెచ్చగా, అంత అతిలోకంగా వున్న, కానీ తన జీవంలాగే బహుశా త్వరలో వాడి, వాలిపోనున్న యీ జీవంపట్ల, అతనికి అనుతాపం కలిగింది. యెందు కామె తన్ను అంతగా ప్రేమించింది? స్త్రీలు యెప్పుడూ తనను తన నిజమైన వ్యక్తిత్వంకంటె భిన్నమైనవానిగా నమ్మినారు; వాళ్లు తనను గాక, తన్ను గురించి తమ మనసులో ఊహించుకున్న వ్యక్తిని ప్రేమించినారు, తమ యావజ్జీవితాలూ తాము అన్వేషించిన మనిషిని. తరువాత వాళ్ళు తమ పొరపాటును కనుక్కున్నప్పుడు, యథాప్రకారం ప్రేమిస్తూనే వుండినారు. వాళ్ళలో ఒక్కరూ తనతో సుఖపడలేదు. కాలం గడిచేకొద్దీ తాను ఒక స్త్రీ తరువాత మరొకరిని కలుసుకున్నాడు, ప్రతివొకరితోనూ సన్నిహితుడైనాడు, ప్రతివొకరితోనూ విడిపోయినాడు, కానీ యెప్పుడూ ప్రేమించలేదు. వాళ్లతో అతనికి నానా రకాల సంబంధాలు వుండినాయి, కానీ ప్రేమ యెప్పుడూ లేదు.

యిప్పుడు మాత్రమే, తల వెంట్రుకలు తెల్లబడినప్పుడు, అతనికి చక్కగా, పూర్తిగా, జీవితంలో మొదటిసారి ప్రేమ కలిగింది.

అతనూ, ఆన్నా సెర్గేయెవ్నా గాఢ సన్నిహితులలాగ, భార్యా భర్తలలాగ, ఆప్త మిత్రులలాగ పరస్పరం ప్రేమించుకున్నారు. విధి వాళ్లను ఒకరి కోస మొకరిని ఉద్దేశించినట్టుంది, మరి ఆమె కొక భర్తా, అతని కొక భార్యా యెందు కుండవలసి వచ్చిందో వాళ్ల కర్థం కాలేదు. చలి కాలంలో దేశాంతరాలకు వలసపోయే పక్షులు, పుంజూ, పెట్టా, పట్టుకొని వేరువేరు పంజరాలలో బంధింపబడినట్లుండినారు వాళ్ళు. గతంలోనూ, తమ వర్తమానంలోనూ వాళ్ళు ఒకరి మూలంగా ఒకరు సిగ్గుపడిన ప్రతిదానికీ ఒకరి నొకరు క్షమించుకున్నారు; యీ ప్రేమ తమను యిద్దరినీ మార్చినట్లు వాళ్లకు అనిపించింది.

యింతకు మునుపు, విచార సమయాలలో, తనకు యే వాదం మొదట తోస్తే ఆ వాదంతో తన్ను తాను ఓదార్చుకునేవాడు, కానీ యిప్పుడతనికి వాదాలు నిరుపయోగం, అతనికి ప్రగాఢమైన అనుతాపం కలిగింది, నిష్కపటంగా, ఆర్ద్రంగా వుండాలని కాంక్ష కలిగింది.

"యేడవాకు ఆన్నా," అన్నాడు అతను. "యేడుపంతా యేడ్చేసినావుగా, యిక ఆపు.... యిక కాస్త మాట్లాడుకుందాం, యేం చెయ్యాల్నో ఆలోచిద్దాం."

తరువాత వాళ్లు చాలా సేపు తమ పరిస్థితిని చర్చించినారు; దాక్కోవడాలకూ, వంచనకూ, వేరువేరు వూర్లలో వుండడానికీ, అంత దీర్ఘ కాలం కలుసుకోకుండా

వుండడానికీ అవసరం లేకుండా చేసుకోవడం యెలాగని ఆలోచించినారు. తాము యీ దుర్భరమైన శృంఖలాలు విదలించుకోవడం యెలాగ?

"యెలాగ? యెలాగ?" మళీ మళ్లీ అన్నాడు అతను, చేతులతో తల పట్టుకొని.

నిర్ణయం వ్రేలేడు దూరంలో వున్నట్లూ, ఆ తరువాత అందమైన కొత్త జీవితం ప్రారంభం కానున్నట్లూ వాళ్లకు అనిపించింది. అంతం యింకా చాలా చాలా దూరంలో వుందనీ, అత్యంత కష్టమైన, క్లిష్టమైన భాగం యిప్పుడే ప్రారంభ మౌతున్నదనీ వాళ్లిద్దరూ గుర్తించినారు.

1899

# పెండ్లికూతురు

I

అప్పుడే సాయంత్రం పదైంది, తోటమీద పున్నమ చంద్రుడు వెలుగుతూ వుండినాడు. షూమిన్‌ల గృహంలో అవ్వ మార్ఫా మిహైలొవ్నా యేర్పాటుచేసిన సాయంప్రార్థన అప్పుడప్పుడే ముగిసింది. ఒక నిముషం సేపు తోటలోకి జారుకుంది నాద్యా. భోజనశాలలో చల్లని భోజనం వడ్డించడమూ, ఆమె అవ్వ పెద్ద కుచ్చెగల సిల్కు గౌనులో టేబుల్ చుట్టూ తారాడుతూ వుండడమూ, మతగురువు ఫాదర్ అంద్రేయ్ ఆమె అమ్మ నీనా ఇవానొవ్నాతో మాట్లాడుతూ వుండడమూ, కృత్రిమ వెలుతురులో కిటికీగుండా అమ్మ చాలా పడుచుదిగా కనిపించడమూ నాద్యా చూడగలిగింది. అమ్మ పక్కన ఫాదర్ అంద్రేయ్ కొడుకు అంద్రేయ్ అంద్రేయిచ్ శ్రద్ధగా వింటూ నిలబడి వుండినాడు.

తోటలో చల్లగా, నిశ్చలంగా వుండింది, నల్లని నీడలు నేలమీద ప్రశాంతంగా పండుకొని వుండినాయి. చాలా దూరంనుండి, బహుశా పట్టణం బయటినుండి, కప్పల దూరపు బెకబెక వినవచ్చింది. గాలిలో ఆహ్లాదకరమైన మే మాసపు స్ఫూర్తి వుండింది. గుండెలనిండా గాలి పీల్చుకుంటే, యెక్కడో పట్టణానికి ఆవల చాలా దూరాన, ఆకాశంకింద, చెట్ల కొమ్మలపైన, పొలాలలోనూ, వనాలలోనూ వసంతం తన సొంత జీవితం ప్రారంభిస్తున్నదనే ఊహ వస్తుంది — మాయామయమైన, అతిలోక సుందరమైన జీవితం, సంపన్నమైన, పవిత్రమైన జీవితం, పాపులైన మానవులకు ప్రవేశం లేని జీవితం. యెవరికైనా యేడ్వాలనిపిస్తుంది దాన్ని చూస్తే.

నాద్యాకు యిప్పుడు యిరవైమూడు. పదారేండ్లు వచ్చినప్పటినుండి ఆమె పెండ్లిని గురించి గాఢంగా కలలు గంటూ వుండింది; చివర కిప్పుడామెకు అంద్రేయ్ అంద్రేయిచ్‌తో, భోజనశాలలో నిలబడివున్న యువకునితో, ప్రధానం జరిగింది. అతనంటే ఆమెకు యిష్టం, పెండ్లి జూలై యేడుకు నిర్ణయమైంది, కానీ ఆమెకు సంతోషం కలగలేదు; ఆమెకు సరిగా నిద్ర పట్టడంలేదు, ఆమెలోని ఉల్లాసమంతా నశించింది.... బేస్‌మెంటు వంటగదియొక్క తెరచిన కటికీలగుండా గోలా, కత్తుల గలగల శబ్దాలూ వస్తూవుండినాయి, వ్రేలగట్టిన బరువు మూలంగా మూతబడే తలుపు మాటిమాటికీ ధణామంటూ వుండింది. వేయించిన టర్కీకోడి వాసనా, మసాలా చెర్రీల వాసనా వస్తూ వుండినాయి. యివన్నీ యిలాగే, మార్పు లేకుండా శాశ్వతంగా కొనసాగుతా యనిపించింది.

యెవరో యింట్లోనుండి బయటికి వచ్చి, వాకిలి ముందరి వరండాలో నిలబడినారు. అతను అలెక్సాందర్ తిమొఫేయిచ్; అతన్ని అందరూ సాషా అనేవాళ్లు. అతను చూసిపోవడానికి సుమారు పది రోజుల క్రితం మాస్కోనుండి వచ్చినాడు. చాలా కాలం కిందట సన్నగా, బక్కగా, సుకుమారంగా వుండే మరీయా పెత్రోవ్నా అనే కులీన వితంతువు సహాయం కోసం నాద్యా అవ్వవద్దకు వస్తూవుండేది. ఆమెకూ ఆమెకూ దూరపు బంధుత్వం వుండేది. మరీయాకు సాషా అనే కొడుకు వుండినాడు. యెందుకో అతన్ని అందరూ మంచి కళాకారు డనేవాళ్లు. అతని తల్లి చనిపోయిన తర్వాత, నాద్యా అవ్వ, పుణ్యం వస్తుందని, అతన్ని మాస్కోలోని కొమిస్సారొవ్ పాఠశాలకు పంపింది. ఒకటి రెండేండ్ల తర్వాత అతను కళా పాఠశాలకు మారి, అక్కడ సుమారు పదైదేండ్లు వుండి, చివరకు వాస్తుశిల్ప శాఖలో చివరి పరీక్షల్లో దేకినాడు. అతను వాస్తుశిల్పిగా యెన్నడూ పనిచేయలేదు, మాస్కోలోని ఒక ముద్రణాలయంలో పని సంపాయించుకున్నాడు. దాదాపు ప్రతి వేసవీ, సాధారణంగా

తీవ్రంగా జబ్బుపడి, విశ్రాంతి కొరకూ, కోలుకోడానికీ అతను యిక్కడికి వచ్చి వుండేవాడు.

అతను గొంతుదాకా గుండీలు పెట్టుకున్న లాంగుకోటూ, అంచులు చీలిపోయిన చౌక కాన్వాసు షరాయీ ధరించినాడు, చొక్కా యిస్త్రీ చేయలేదు, మొత్తం అతని రూపమంతా రోతగా వుండింది. అతను వరిటిపోయి, చేరెడేసి కన్నులతో, పొడవైన, యెముకల వ్రేళ్లతో, పెంచిన గడ్డంతో, చామనచాయ శరీరంతో ఆకర్షణీయంగా వుండినాడు. షూమిన్‌ల యింట్లో అతనికి తన వాళ్లమధ్య వున్నట్లూ, సొంత యింట్లో వున్నట్లూ వుండేది. యిక్కడికి వచ్చినప్పుడు అతను వుండే గదికి సాషా గది అని చాలా కాలంగా పేరువచ్చింది.

వరండాలోనుండి అతను నాద్యాను చూసి, ఆమెవద్దకు పోయినాడు.

''యిక్కడ బాగుంది,'' అన్నాడు అతను.

''చాలా బాగుంది. శరదృతువుదాకా నీవు యిక్కడుండాలి.''

''అవును. వుండవలసే వుంటుం దనుకుంటాను. బహుశా సెప్టెంబర్‌దాకా మీతో కలిసివుంటాను.''

కారణ మేమీ లేకుండానే అతను నవ్వి, ఆమెపక్కన కూర్చున్నాడు.

''అమ్మను చూస్తూ యిక్కడ నిలుచుకున్నాను,'' అన్నది నాద్యా. ''యిక్కడ నుండి ఆమె యెంతో పడుచుదిగా కనిపిస్తుంది. మా అమ్మకు ఆమె బలహీనతలు వున్నాయనుకో, నాకు తెలుసు. అయినా ఆమె అద్భుతమైన మనిషి.''

''అవును, ఆమె చాలా మంచిది,'' అని సాషా అంగీకరించినాడు. ''తన పద్ధతిలో మీ అమ్మ చాలా మంచిదే, దయగలదే, కానీ... యెలా చెప్పాలో తెలియడం లేదు. యీ దినం ప్రొద్దున్నే నేను వంటగదిలోకి పోయినాను. నలుగురు నౌకర్లు నేలమీదనే నిద్రపోతున్నారు, మంచాలు లేవు, చింపిరి పాతలమీద పండుకున్నారు, కంపు, నల్లులు, బొద్దింకలు.... సరిగ్గా యిరవై యేండ్ల క్రితం వున్నట్లే వుంది, యేమీ మార్పు లేదు. అవ్వ నేమీ అనలే మనుకో, ఆమె ముసలిది — కానీ మీ అమ్మ, తన ఫ్రెంచి భాషతో, ఔత్సాహిక నాటకాలతో.... ఆమెకైనా అర్థం కావాలి.''

సాషా మాట్లాడేటప్పుడు, పొడవాటి యెముకల వ్రేళ్లు రెండు వినేవాళ్లవైపు యెత్తి పట్టుకోవడం అతనికి అలవాటు.

''యిక్కడ ప్రతిదీ నాకు చిత్రంగా కనపడుతుంది,'' అంటూ అతను చెప్పసాగినాడు. నేను దీనికి అలవాటు పడలే దేమో. యెవరూ యెప్పుడూ యే పనీ చేయరు! మీ అమ్మ మహరాణి లాగ షికారు వెళ్లడం తప్ప యేమీ చేయదు, అవ్వ

యేమీ చేయదు, నీవూ అంతే. నీ పెండ్లికొడుకు అంద్రేయ్ అంద్రేయిచ్ — అతనూ యేమీ చేయదు.''

యిదంతా నాద్యా నిరుడు విన్నది, అంతకు ముందటేడు కూడా విన్నట్లు ఆమెకు జ్ఞాపకం వచ్చింది. సాషా మనస్సు పనిచేసే మార్గం అదొక్కటే అని ఆమెకు తెలుసు. ఒకప్పుడు అది ఆమెకు వినోదం కలిగించేది, కానీ యిప్పుడెందు వల్లనో అది ఆమెకు చిరాకు కలిగించింది.

''అదంతా పాత చింతకాయ పచ్చడే. వినివిని వెగటైంది నాకు,'' అంటూ ఆమె లేచింది. ''కొత్త దేమీ తోచదా నీకు.''

నవ్వుతూ అతను కూడా లేచినాడు. యిద్దరూ యింట్లోకి పోయినారు. అందంగా, పొడవుగా, సన్నగా వున్న ఆమె అతని పక్కన నడుస్తుంటే, దాదాపు వెగటు కలిగించేటంత మంచి దుస్తులు వేసుకున్నట్లుగానూ, అంత ఆరోగ్యంగానూ కనిపించింది. ఆమెకే ఆ స్పృహ వుంది; అతని పట్ల ఆమెకు విచారం కలిగింది, యేదో తప్పు చేసిన భావం కలిగింది.

''నీవు చెత్త చాలా మాట్లాడుతావు,'' అన్నది ఆమె. నా అంద్రేయ్‌ని గురించి యిప్పుడే యేమన్నావ్ చూడు — అతన్ని గురించి నీకేమీ తెలియదు, నిజంగా!''

''నా అంద్రేయ్.... నీ అంద్రేయ్‌ని అలా వుంచు! నీ యవ్వనం నాకు జాలి కలిగించేది.''

వాళ్లు భోజనశాలలోకి పోయేటప్పటికి, ప్రతివొకరూ అప్పుడే భోజనానికి కూర్చుంటూ వుండినారు. నాద్యా అవ్వ — యింట్లో అందరూ ఆమెను ''అవ్వ'' అంటారు — దట్టమైన కనుబొమలూ, మీసకట్టూ గల, కండలు పెరిగిన సాదా వృద్ధురాలు, బిగ్గరగా మాట్లాడుతూ వుండింది. ఆమె కంఠమూ, మాట్లాడే పద్ధతీబట్టీ ఆమె ఆ యింటి నిజమైన యజమానురాలు అని తెలుస్తూ వుండింది. మార్కెట్‌లో ఆమెకు రెండు వరుసల అంగళ్ళు వుండినాయి, పాత స్తంభాల యిల్లూ, తోటా ఆమెవే. కానీ, సర్వనాశనంనుండి రక్షించమని ఆమె ప్రతి ఉదయం భగవంతుని ప్రార్థించేది. ఆమె కోడలు, నాద్యా అమ్మ అయిన నీనా ఇవానొవ్నా, లేత గోధుమరంగు జుట్టూ, బిగువు కంచుకమూ, కండ్లద్దాలూ, అన్ని ప్రేళ్లకూ రాళ్ల ఉంగరాలూ గల స్త్రీ; ఫాదర్ అంద్రేయ్, బక్క పలచని, పండ్లు లేని వృద్ధుడు, యెప్పుడూ యేదో మహా తమాషా అయినది చెప్పబోయేవాని లాగ కనిపించే వ్యక్తి; అతని కొడుకూ, నాద్యాకు కాబోయే భర్తా అయిన అంద్రేయ్ అంద్రేయిచ్, ఉంగరాల జుట్టు గల భద్రమైన, అందమైన యువకుడు, నటుని లాగో, కళాకారుని

లాగో కనిపించే వ్యక్తి — యీ ముగ్గురూ హిప్నటిజం గురించి మాట్లాడుతూ వుండినారు.

"నీ విక్కడ ఒక వారంలో లావౌతావు," అని అవ్వ సాషాతో చెప్పింది. "కానీ నీ వింకా బాగా తినాలి. యెలా వున్నావో చూడు!" ఆమె నిట్టూర్చింది. "ఘోరంగా వున్నావు, బైబిల్‌లోని లేచిపోయిన కొడుకులా వున్నావు, సరిగ్గా అలాంటివానివే నీవు."

"అతను జల్సా జీవితంతో పాడైనాడు," ఫాదర్ అంద్రేయ్ అన్నాడు, మాటలు నిదానంగా బయటికి వదలుతూ, కండ్లు మిలమిలలాడిస్తూ, "పందుల మేపడానికి అతన్ని పొలాలలోకి పంపినారు."

"మా నాన్నంటే నాకు ప్రాణం," అన్నాడు అంద్రేయ్ అంద్రేయిచ్ తండ్రిని భుజంమీద తట్టుతూ. "మంచివాడు. మా నాన్న మంచివాడు!"

యెవరూ యేమీ అనలేదు. సాషా హఠాత్తుగా పగలబడి నవ్వి, నాప్కిన్‌తో మూతి తుడుచుకున్నాడు.

"హిప్నటిజంలో మీకు నమ్మక ముందన్నమాట?" ఫాదర్ అంద్రేయ్ నీనా ఇవానొవ్నాను అడిగినాడు.

"నమ్ముతానని కచ్చితంగా చెప్పలేను," అన్నది నీనా ఇవానొవ్నా, గంభీరమైన, దాదాపు కఠినమైన ముఖ భంగిమ ధరిస్తూ. "కానీ ప్రకృతిలో నిగుఢమైనదీ, దుర్గ్రాహ్యమైనదీ చాలా వుందని నేను ఒప్పుకోవలసివుంది."

"నేను మీతో యేకీభవిస్తాను, కానీ మాకు భగవద్విశ్వాసం నిగూఢ రంగాన్ని గణనీయంగా కుదిస్తుందని చెప్పక తప్పదు."

రసం కారే పెద్ద టర్కీకోడిని టేబుల్‌మీద పెట్టినారు. ఫాదర్ అంద్రేయ్, నీనా ఇవానొవ్నా మాట్లాడుతూనే వుండినారు. ఆమె వ్రేళ్లలోని రాళ్లు తళతళ లాడినాయి, కండ్లలో నీరు తళతళలాడింది, ఆమె హృదయం ఆవేశభరితమైంది.

"మీతో వాదించే సాహసం నాకు లేదనుకోండి. కానీ జీవితంలో అపరిష్కృత సమస్యలు చాలా వున్నాయని ఒప్పుకుంటారు గదా," అన్నది ఆమె.

"లేవు, లేనే లేవు."

భోజనం తర్వాత అంద్రేయ్ అంద్రేయిచ్ ఫిడేలు వాయించినాడు, నీనా ఇవానొవ్నా పక్కవాద్యంగా పియానో వాయించింది. అతను పదేండ్ల క్రితం విశ్వవిద్యాలయంలో, భాషాశాస్త్రంలో ఉత్తీర్ణుడైనాడు, కానీ అతనికి ఉద్యోగమూ లేదు, నిశ్చితమైన ఒక వృత్తీ లేదు, యెప్పుడైనా ఒకసారి ధర్మకార్యార్థం యిచ్చే కాన్సర్టులలో

సంగీతం వాయించేవాడు. పట్టణంలో అతన్ని సంగీత విద్వాంసునిగా చెప్పుకునేవాళ్ళు.

అంద్రేయ్ అంద్రేయిచ్ వాయిస్తూవుండినాడు, అందరూ నిశ్శబ్దంగా వింటూ వుండినారు. టేబుల్‌మీద సమొవార్ మరుగుతూ వుండింది, సాషా ఒక్కడే టీ తాగుతూ వుండినాడు. సరిగ్గా పన్రెండు గంటలు కొట్టేటప్పుడు ఫిడేలు తంతె ఒకటి పుటుక్కుమన్నది. అందరూ నవ్వినారు, తరువాత కోలాహలంగా సెలవు తీసుకున్నారు.

కాబోయే భర్తకు నమస్తే చెప్పి, నాద్యా పై అంతస్తులో తానూ, తన తల్లీ వుండే గదులకు వెళ్ళిపోయింది (కింది అంతస్తులో అవ్వ వుండేది). కింది అంతస్తులో, భోజనశాలలో దీపాలు ఆర్పివేస్తూ వుండినారు, కానీ సాషా టీ తాగుతూ యింకా కూర్చునే వుండినాడు. అతను యెప్పుడూ, మాస్కో పద్ధతిలో, టీవద్ద చాలా సేపు కూర్చునేవాడు, వరుసగా ఆరేడు గ్లాసులు తాగేవాడు. నాద్యా బట్టలు మార్చుకొని, మంచంమీద పండుకొన్న తర్వాత చాలాసేపటికి నౌకర్లు టేబుల్ శుభ్రం చేయడమూ, అవ్వ తిట్టడమూ ఆమెకు వినిపించింది. చివరకు యిల్లు నిశ్శబ్దమైంది, కింది అంతస్తులో సాషా గదిలోనుండి అప్పుడప్పుడు వచ్చే పెద్ద దగ్గు తప్ప.

## II

నాద్యాకు మెలకువ వచ్చేటప్పటికి సుమారు రెండు గంటలై వుండాలి; యెందుకంటే, తెల్లవారుతూవుండింది. రాత్రి వాచ్‌మన్ గిలక దూరాన వినిపిస్తూ వుండింది. నాద్యాకు నిద్ర పట్టలేదు, ఆమె మంచం సుఖంగా పండుకోడానికి సాధ్యం కానంత మెత్తగా వున్నట్లుంది. యీ మేనెలలో గత రాత్రులన్నింటి లాగే నాద్యా మంచంమీద లేచి కూర్చొని ఆలోచనలలో మునిగిపోయింది. ఆలోచనలు గత రాత్రి లాగే వుండినాయి, రోకటి పాటగా, నిరర్థకంగా, పట్టు విడువకుండా — అంద్రేయ్ అంద్రేయిచ్ తన్ను ప్రేమించడమూ, పెండ్లి ప్రతిపాదన చేయడమూ, తాను అతన్ని అంగీకరించడమూ, క్రమక్రమంగా యీ మంచివాడైన, చురుకైన మనిషిని మెచ్చుకోవడమూ. కానీ, యెందువల్లనో, పెండ్లికి కక నెల మాత్రమే వుండనగా, ఆమెకు భయమూ, అశాంతీ కలగసాగినాయి, లీలగా విషాదకరమైనదేదో ఆమెకోసం పొంచుకొని వున్నట్లు.

"టిక్ — టాక్, టిక్ — టాక్," రాత్రి వాచ్‌మన్ సోమరితనంగా గిలక వాయిస్తూ వుండినాడు. "టిక్ — టాక్...."

పాతకాలపు పెద్ద కిటికీగుండా తోటూ, దాని కవతల విరగ బూసి, చలి గాలిలో మత్తుగా, నీరసంగా వున్న లైలాక్ పొదలూ కనిపిస్తూ వుండినాయి. దట్టమైన తెల్లని పొగమంచు నిశ్శబ్దంగా లైలాక్ పొదలను సమీపించింది, వాటిని ఆవరించే ఉద్దేశం వున్నట్లు. నిద్రమత్తులో వున్న కాకులు దూరపు చెట్లమీద కావుకావు మంటూ వుండినాయి.

''భగవంతుడా, యెందుకు నాకింత దుఃఖం కలుగుతున్నది?''

ఆడపిల్ల లందరికీ పెండ్లి ముందర యిలాగే వుంటుందా? లేక యిది సాషా ప్రభావమా? కానీ, సాషా ప్రతి యేడూ, కంఠపాఠం లాగా, యివే విషయాలు చెప్తున్నాడు, అతను చెప్పేది యెప్పుడూ యెంతో అమాయకంగా, వింతగా వుంటుంది. సాషాను గురించిన ఆలోచన యెందుకు తన్ను వదలకుండా వుంది? యెందుకు?

వాచ్‌మన్ గస్తీ తిరగడం యెప్పుడో మానుకున్నాడు. పక్షులు కిటికీకింద చెట్ల కొమ్మల్లో కిచకిచ మంటున్నాయి, తోటలోని పొగమంచు విరిసింది, వసంతపు సూర్యకాంతి అన్నిటికీ బంగారు పూత పూసింది, ప్రతిదీ చిరునవ్వులలో ఓలలాడిన ట్లుంది. కాసేపట్లో మొత్తం తోట సూర్య కిరణాల లాలనతో ఉజ్జీవితమైంది, మంచు బిందువులు చెట్ల ఆకులమీద రత్నాలలాగ తళతళలాడినాయి. నిర్లక్ష్యం చేయబడిన ముసలి తోట ఆ ఒక్క పూటకూ యవ్వనమూ, ఉల్లాసమూ పొందింది.

అవ్వ అప్పటికే నిద్రలేచింది. సాషా పెద్ద, కరకు దగ్గు దగ్గినాడు. కింది అంతస్తులో నౌకర్లు సమొవార్ తెచ్చి పెట్టడమూ, కుర్చీలు సర్దడమూ వినిపించింది.

గంటలు మందంగా గడచినాయి. నాద్యా లేచి చాలా సేపటినుండి తోటలో షికారు తిరుగుతున్నది. ఉదయం యింకా కాళ్లీడుస్తున్నది.

నీనా ఇవానొవ్నా కన్నీళ్లతో, చేతిలో సోడానీళ్ల గ్లాసుతో వచ్చింది. ఆమె ప్రేత దర్శన వాదాన్నీ, హోమియోపతినీ చేపట్టింది, పుస్తకాలు బాగా చదివేది, మత సందేహాల గురించి మాట్లాడడమంటే చెవికోసుకునేది; యీ అన్నిటిలోనూ యేదో ప్రగాఢమైన, నిగూఢమైన ప్రాముఖ్యం వుండక తప్పదని నాద్యా అనుకుంది. ఆమె తల్లిని ముద్దుపెట్టుకొని, ఆమె పక్కనే నడిచింది.

''అమ్మా, యెందుకు యేడుస్తున్నావ్?'' అని అడిగింది నాద్యా.

''రాత్రి ఒక పుస్తకం చదివినాను – ఒక వృద్ధుడూ, అతని కూతురూ వున్న కథ. వృద్ధుడు యేదో ఆఫీసులో పనిచేసేవాడు. తరువాత యేమైందో తెలుసా? వృద్ధుని పై అధికారి అతని కూతురును ప్రేమించినాడు. పుస్తక మింకా పూర్తి

చేయలేదు, కానీ యిప్పుడున్న చోట యేడుపు ఆపుకోలేకపోయినాను,'' అని నీనా ఇవానొవ్నా గ్లాసులోనుండి ఒక గుటక తాగింది. ''ప్రొద్దున్నే అది జ్ఞాపకం వచ్చి, మళ్లీ యేడ్చినాను.''

కాసేపు ఆగి నాద్యా అన్నది:

''యిటీవల కొద్ది రోజులుగా నాకు ఉత్సాహంగా లేదు. నాకు నిద్ర పట్టడంలే దెందుకు?''

''నాకు తెలియదు తల్లీ. నాకు నిద్ర పట్టకపోతే, గట్టిగా కండ్లు మూసుకొని — యిలాగ — ఆన్నా కరేనినా* యెలా వుండిందీ, యెలా మాట్లాడిందీ ఊహించు కుంటాను, లేదా చారిత్రకమైనదో, పాతకాలందో యేదో ఒకటి ఊహించుకోడానికి ప్రయత్నిస్తాను....''

తల్లికి అర్థం కాలేదనీ, అర్థం చేసుకునే శక్తి లేదనీ నాద్యాకు అనిపించింది. యీ భావం ఆమెకు మునుపెన్నడూ కలగలేదు. ఆమెకు భయం కలిగింది, దాక్కోవా లనిపించింది, ఆమె తన గదికి పోయింది.

రెండు గంటలకు అందరూ మధ్యాహ్న భోజనానికి కూర్చున్నారు. ఆ దినం బుధవారం, ఉపవాస దినం; అవ్వ అందరికీ మాంసం లేని పులుసూ, చేపలూ వడ్డించింది.

అవ్వను ఉడికించడానికి సాషా పులుసూ, మాంసమూ రెండూ తిన్నాడు. భోజనం పొడవునా అతను హాస్యోక్తులు చెప్పుతూ వుండినాడు. అతని హాస్యోక్తులు మరీ విపులంగా వుండి, యేదో నీతిని సూచించడానికి ఉద్దేశింపబడినవి; యేదైనా చమత్కారం చెప్పబోయేముందు అతను శవం వ్రేళ్లలాంటి పొడవైన, యెముకల వ్రేళ్లు పైకెత్తినప్పుడు యేమీ వినోదంగా వుండేది కాదు; యిక, అతను చాలా జబ్బుగా వున్నాడనీ, బహుశా చాలా కాలం బతక్కపోవచ్చుననీ అనే భావం మీ మనసుకు తోస్తే, మీకు అయ్యో పాపం అని యేడుపు వస్తుంది.

భోజనం తర్వాత అవ్వ విశ్రాంతి తీసుకోడానికి తన గదికి పోయింది. నీనా ఇవానొవ్నా కాసేపు పియానో వాయించి, తరువాత ఆమె కూడా వెళ్లిపోయింది.

సాషా తన మామూలు భోజనానంతర విషయానికి వస్తూ, అన్నాడు: ''ఓ, నాద్యా, నీవు నా మాట వింటేనా! నా మాట వింటేనా!''

---

* లేవ్ తొల్‌స్తోయ్ నవలలో కథానాయకురాలు. — సం.

ఆమె కండ్లు మూసుకొని, పాతకాలపు పెద్ద కుర్చీలో ముడుక్కొని కూర్చుంది; అతను గదిలో చప్పుడు కాకుండా అటూయిటూ పచారు చేస్తూ వుండినాడు.

"యెక్కడికైనా వెళ్లి చదువుకో," అన్నాడు అతను. విజ్ఞాన ప్రబుద్ధులూ, సాధు సత్తములూ అయినవాళ్లు మాత్రమే ఆసక్తికరమైనవాళ్లు, అవసరమైన వాళ్లు. అలాంటివాళ్లు యెంత యెక్కువగా వుంటే, అంత త్వరగా భూమిమీద రామరాజ్యం యేర్పడుతుంది. అప్పుడు యేదీ యిలా గుండదు, యీ మీ పట్టణంలో ప్రతిదీ తలకిందు లౌతుంది, ప్రతిదీ మారుతుంది, యింద్రజాలం లాగ. అద్భుతమైన గొప్ప భవనాలూ, అందమైన పార్కులూ, దివ్యమైన జలయంత్రాలూ, ఉత్తములైన మనుషులూ వుంటారు.... కానీ అది కాదు అసలు విషయం. అసలు విషయం యేమిటంటే, యిప్పుడున్నదే, యిలాంటి మంద వుండదు, ప్రస్తుత రూపంలోని ఆ దుర్గుణం అదృశ్య మౌతుంది, ప్రతి వ్యక్తికీ విశ్వాసం వుంటుంది, తాను యెందుకు జీవించేదీ తెలుస్తుంది, మందనుండి అండదండలు యెవరూ కోరరు. మంచి అమ్మాయివి కదూ, బంగారు కొండవు కదూ, యెక్కడికైనా వెళ్లిపో! యీ మురికి గుంట, నిర్జీవపు, కలుషిత జీవితం చాలునని అందరికీ చూపించు! కనీసం నీకు నీవు చూపించుకో!"

"పోలేను సాషా, నాకు పెండ్లి కాబోతున్నది."

"పెండ్లెందుకూ? కాకపోతే యేం?"

వాళ్లు తోటలోకి పోయి పచారు సాగించినారు.

"యేమైనా నాద్యా, నీ పనిలేని జీవితం యెంత అసహ్యమో, యెంత అవినీతో కాస్త ఆలోచించు. అర్థం చేసుకో," అంటూ సాషా కొనసాగించినాడు. "నీవూ, మీ అమ్మా, మీ అవ్వా పనిచేయకుండా బతకడానికి యితరులు మీకోసం పని చేయవలసివుందనీ, మీరు యితరుల జీవితాన్ని దిగమింగుతున్నారనీ నీకు కనపడదా? యిది శుభ్రమైనదా, యిది రోత కాదా?"

"నీవు చెప్పేది నిజమే," అని నాద్యా చెప్పాలనుకుంది, కానీ ఆమె కన్నులలో నీళ్లు తిరిగినాయి, మనసు కుంచించుకపోయింది. ఆమె తన గదికి వెళ్లిపోయింది.

సాయంత్రం అంద్రేయ్ అంద్రేయిచ్ వచ్చి, మామూలులాగే చాలాసేపు ఫిడేలు వాయించినాడు. అతను స్వభావతః మితభాషి; బహుశా, ఫిడేలు వాయించేటప్పుడు మాట్లాడవలసి వుండదు గనుక అతనికి దానిమీద యిష్టం కలిగిందేమో. పది

అయిన తర్వాత కాసేపటికి, యింటికి పోడానికి కోటు తొడుక్కొని, అతను నాద్యాను కౌగిట్లోకి తీసుకొని, ఆమె ముఖం మీదా, భుజాలమీదా, చేతులమీదా ఆవేశపూరితంగా ముద్దులు కురిపించినాడు.

"నా ప్రియతమా, నా ప్రేమమూర్తీ, నా అందాల రాశీ," అని అతను గుసగుసలాడినాడు. "ఓ, యెంత ఆనందంగా వుంది! యీ ఆనందంతో నాకు మతి చెడుతుం దనుకుంటాను!"

యిది కూడా ఆమెకు యెప్పుడో, చాలా చాలా కాలం కిందట విన్నట్లుంది, యేదో నవలలో చదివినట్లుంది, యిప్పుడెవరూ చదవని పాత, చింపిరి నవలలో.

భోజనశాలలో సాషా టేబుల్‌వద్ద కూర్చొని వుండినాడు, తన పొడవాటి అయిదు వేళ్ల కొనలమీద పొందించిన సాసర్‌తో టీ తాగుతూ. అవ్వ వైకుంఠం వేసుకుంటూ వుంది. నీనా ఇవానొవ్నా చదువుకుంటున్నది. దేవుని దీపం చిటపట లాడుతూ వుంది; ప్రతిదీ నిశ్చలంగా, భద్రంగా వున్నట్లుంది. నాద్యా సెలవు తీసుకొని, తన గదికి యెక్కిపోయింది. మంచంమీద పండుకున్న మరుక్షణమే ఆమెకు నిద్రపట్టింది. గత రాత్రిలాగే, తొలి వేకువ రేకతో ఆమెకు మెలకువ వచ్చింది. ఆమె నిద్రపోలేకపోయింది, గుండెమీద యేదో భారమైనది, అశాంతికరమైనది వుండింది. ఆమె మంచంమీద లేచి కూర్చొని, మోకాళ్లమీద తల పెట్టుకుంది, కాబోయే భర్తను గురించీ, తన పెండ్లిని గురించీ ఆలోచిస్తూ.... యే కారణంవల్లనో ఆమెకు జ్ఞాపకం వచ్చింది, తన తల్లి ఆమె భర్తను ప్రేమించలేదనీ, యిప్పు డామెకు యే ఆస్తీ లేదనీ, అవ్వమీద, ఆమె అత్తమీద, పూర్తిగా ఆధారపడిందనీ. యెంత ప్రయత్నించినా నాద్యాకు అర్థం కాలేదు, యెందుకు తాను తల్లిని యేదో ప్రత్యేకమైన, అసాధారణమైన వ్యక్తిగా భావించిందీ, ఆమె సాధారణ, అసంతుష్ట స్త్రీ అని తాను యెందుకు గమనించలేకపోయిందీ.

కింది అంతస్తులో సాషా కూడా మేల్కొని వుండినాడు — అతని దగ్గు ఆమెకు వినిపిస్తూ వుండింది. చిత్రమైన, అమాయకమైన జీవి, అతని కలలలో, ఆ అద్భుతమైన పార్కులలోనూ, దివ్యమైన జలయంత్రాలలోనూ, యేదో అసంబద్ధమైనది వుంది, అనుకుంది నాద్యా. కానీ అతని అమాయకత్వంలో, అతని అసంబద్ధతలోనే, అందమైనది యెంతో వుంది; యెంత వుందంటే, తాను చదువుకోడానికి వెళ్లిపోవాల్నా అని ఆలోచించిన క్షణంలోనే తన హృదయమంతా, తన యావత్తు జీవం ఉత్సాహకరమైన చల్లదనంలో మునిగిపోతుంది, తనకు ఆనందంతో తన్మయత్వం కలుగుతుంది.

"ఆలోచించకపోవడం మంచిది...." గుసగుస అనుకుంది ఆమె. "దాన్ని గురించి ఆలోచించకపోవడం మంచిది."

"టిక్ — టాక్," అంటూ దూరాన రాత్రి వాచ్‌మన్ గిలక వాయించినాడు. "టిక్ — టాక్.... టిక్ — టాక్...."

## III

జూన్ మధ్యలో సాషా హఠాత్తుగా విసుగు భరించలేక, మాస్కోకు తిరిగిపోవాలని అనడం ప్రారంభించినాడు.

"యీ వూర్లో నేను వుండలేను," అన్నాడు అతను విచార కంఠంతో. "కొళాయిలు లేవు, మురుగు కాల్వలు లేవు! యిక్కడ భోజనం కూడా తినలేకున్నాను — వంటగది వర్ణన కందనంత రోతగా వుంది...."

"యిక కాస్త ఆగు, లేచిపోయిన కొడుకా," అవ్వ గుసగుస చెప్పింది. "యేడవ తేదీన పెండ్లి వుంది."

"నేను ఆగనే లేను!"

"సెప్టెంబర్ దాకా వుంటా నన్నావుగా."

"యిప్పుడు వుండాలని లేదు. పోయి పని చేయాలి."

వేసవి చల్లగా, వర్షాలు పడుతూ వుండింది, చెట్లు యెప్పుడూ నీళ్లోడుతూ వుండినాయి, తోట విచారకరంగా, విరసంగా వుండింది; అక్కడినుండి వెళ్లిపోయి, పని చేసుకోవాలనే కోర్కె కలగడం చాలా సహజం. కిందా, పైనా అన్ని గదులలో నుండీ అపరిచిత స్త్రీ కంఠాలు వినవస్తూ వుండినాయి, అవ్వ గదిలో కుట్టు మిషను గరగరలాడుతూ వుండింది. యిదంతా పెండ్లికూతురు దుస్తుల సంరంభంలో భాగం. చలికాలం కోట్లే నాద్యాకు ఆరు వుంటాయి; అందులో అన్నిటికంటె చౌకది మూడు వందల రూబుళ్లు అయింది, అని అవ్వ ఆడంబరంగా చెప్పుకుంది. యీ గోల అంతా సాషాకు చిర్రెత్తించింది. అతను మూతి ముడుచుకొని, తన గదిలో కూర్చున్నాడు. కానీ, ఆగేటట్లు అతన్ని ఒప్పించినారు, జూలై మొదటి తేదీలోపల పోనని అతను మాట యిచ్చినాడు.

కాలం త్వరత్వరగా గడిచింది. సెంట్ పీటర్స్ దినం నాడు మధ్యాహ్న భోజనం తర్వాత అంద్రేయ్ అంద్రేయిచ్ నాద్యాను మాస్కో వీధికి తీసుకపోయినాడు — యువ దంపతుల కోసమని చాలా కాలంగా అద్దెకు తీసుకొని, ఫర్నిష్ చేసిపెట్టిన యింటిని

మరొకసారి చూడడానికి. అది రెండంతస్తుల యిల్లు; యింతవరకు పై అంతస్తు మాత్రమే ఫర్నిష్ చేయబడింది. తళతళ మెరిసే నేలతో, పార్కెట్ లాగ కనిపించే టట్లు రంగువేయబడిన హాలులో బెంట్‌వుడ్ కుర్చీలూ, పెద్ద పియానో, ఫిడేలుకు మ్యూజిక్ శ్టాండూ వుండినాయి. గది పెయింటు వాసన వేస్తూవుండింది. గోడమీద గిల్టు ఫ్రేములో ఒక పెద్ద వర్ణచిత్రం వుండింది – పగిలిపోయిన హాండిల్ గల నేరేడు రంగు వాజ్ పక్కన ఒక దిగంబర సుందరి చిత్రం.

''జగన్మోహనమైన చిత్రం,'' అన్నాడు అంద్రేయ్ అంద్రేయిచ్ ''యిది షిష్మచెవ్‌స్కీది.''

తరువాతది డ్రాయింగురూము. దానిలో ఒక రౌండు టేబులూ, ఒక సోఫా తళతళలాడే నీలం గుడ్డలు గల కుర్చీలూ వుండినాయి. సోఫాకు పైన, తన మెడల్స్ అన్నీ ధరించి, పొడవాటి టోపీ పెట్టుకున్న ఫాదర్ అంద్రేయ్‌ది ఎన్‌లార్జి చేయబడిన ఫోటో వుండింది. వాళ్లు సైడ్‌బోర్డు గల భోజనశాలలోకి పోయినారు, అక్కడినుండి పడకగదిలోకి కోయినారు. యిక్కడ, మసక వెలుతురులో, పక్కపక్కన రెండు మంచాలు వుండినాయి. యిక్కడ జీవితం కలకాలం ఆనందమయంగా వుండడమూ, తద్భిన్నంగా వుండజాలకపోవడమూ సహజవిషయంగా భావించినవాళ్లు ఫర్నిష్ చేసిన ట్లుంది పడక గది. అంద్రేయ్ అంద్రేయిచ్ నాద్యాను గదులగుండా తీసుకపోయినాడు, ఆమె నడుము చుట్టూ వున్న తన చేతిని ఒక క్షణం కూడా తీయకుండా. ఆమెకు నీరసం కలిగింది, తప్పు చేసిన భావం కలిగింది, యీ గదులమీదా, మంచాలమీదా, కుర్చీలమీదా ద్వేషం కలిగింది, యిక దిగంబర సుందరిని చూసి వెలపరం కలిగింది. యిప్పు డామెకు స్పష్టంగా అర్థమైంది, తన కిక అంద్రేయ్ అంద్రేయిచ్‌మీద ప్రేమ లేదనీ, బహుశా తానెప్పుడూ అతన్ని ప్రేమించలేదనీ. కానీ యిది యెలా చెప్పాల్నో ఆమెకు తెలియదు, యెవరితో చెప్పాల్నో తెలియదు, అసలు యెందుకు చెప్పాల్నో తెలియదు, దాన్ని గురించి రేయింబగలూ ఆలోచించినా అణుమాత్రమూ తెలియలేదు.... అతను తన నడుము చుట్టూ చేయి వేసినాడు, తనతో అంత దయగా, అంత నమ్రంగా మాట్లాడినాడు, అతని గృహంలో తిరుగుతూ అంత సంతోషంగా వున్నాడు. కానీ ఆమెకు కనపడిందంతా వెకిలితనం, మతిలేని, ముసుగులేని, భరించలేని వెకిలితనం; ఆమె నడుము చుట్టూ వున్న అతని చేయి ఆమెకు చల్లగా, బిగువుగా, యినప కొక్కెం లాగ వుండింది. యే క్షణంలోనైనా ఆమె పారిపోడానికి సిద్ధంగా వుంది, వెక్కివెక్కి యేడ్వడానికి సిద్ధంగా వుంది, కిటికీలోనుండి దూకడానికి సిద్ధంగా

వుంది. అంద్రేయ్ అంద్రేయిచ్ ఆమెను స్నానాలగదిలోకి తీసుకపోయినాడు, గోడలోకి దించిన కొళాయిని చేత్తో తాకినాడు, నీళ్లు ముందుకు దూకినాయి.

"యేమంటావ్ దీన్ని?" అంటూ అతను నవ్వినాడు. "నూరు బకెట్ల నీళ్లు పట్టే తొట్టి పెట్టించినాను, మన స్నానాల గదిలో కొళాయి నీళ్లు వుండేటట్లు."

వాళ్లు కాసేపు పెరట్లో అటూయిటూ నడిచి, తరువాత బయటికి వీధిలోకి పోయి, బండి యెక్కినారు. దుమ్ము దట్టమైన మేఘాలలా లేచింది, వర్షం వచ్చేటట్లు కనపడింది.

"చలిగా వుందా?" అని అడిగినాడు అంద్రేయ్ అంద్రేయిచ్ దుమ్ముకు కండ్లు చిట్లిస్తూ.

ఆమె జవాబు చెప్పలేదు.

కాసేపుండి అతను అన్నాడు: "యేమీ పనిచేయనందుకు సాషా నిన్న నన్ను నిందించడం జ్ఞాపకముందా? అత ననేది నిజమే. నేను యే పనీ చేయను, యే పనీ నాకు చేతకాదు. యెందు కిది ప్రియా? టోపీకి బిళ్ల తగిలించుకొని ఒక్క రోజు ఆఫీసుకు పోవడమనే ఆలోచనే నాకు వెలపరం పుట్టిస్తుం దెందుకు? లాయర్లనూ, లాటిన్ టీచర్లనూ, మునిసిపల్ కౌన్సిలర్లనూ నేను భరించలే నెందుకు? ఓ, రష్యా మాతా, రష్యా మాతా! పనిచేయనివాళ్లనూ, నిరర్థక జీవులనూ యెంతమందిని నీ రొమ్ముమీద భరిస్తున్నావు! దీర్ఘ బాధిత దేశమా, యెంతమంది నాలాంటివాళ్లు!"

తన నిర్వ్యాపారత్వాన్ని యుగలక్షణంగా గమనించి, దాన్ని గురించి సిద్ధాంతీకరించినాడు అతను.

"మన పెండ్లైనాక పల్లెపట్టులకు పోయి వుందాం ప్రియా," అంటూ అతను చెప్పుకపోయినాడు. "అక్కడ పనిచేద్దాం. కాస్త భూమి కొందాం, తోటా, కాలువా వుండేది, కష్టం చేద్దాం, జీవితాన్ని గమనిద్దాం.... ఓ, యెంత మనోహరంగా వుంటుందో అది!"

అతను తలమీదనుండి టోపీ తీసివేసినాడు, గాలికి తల వెంద్రుకలు ఊగినాయి. ఆమె అతని మాటలు వింటున్నంతసేపూ తన మనసులో యిలా అనుకుంటూ వుండింది: "భగవంతుడా, నేను యింటికి పోవాలి! ఓ, భగవంతుడా!" సరిగ్గా నాద్యా యింటికి చేరేముందు వాళ్లు ఫాదర్ అంద్రేయ్‌ని కలుసుకున్నారు.

"అదుగో, మా నాన్న!" అన్నాడు అంద్రేయ్ అంద్రేయిచ్ సంతోషంగా, అంటూ టోపీ వూపినాడు. బండివానికి డబ్బు లిచ్చేస్తూ అతను అన్నాడు: "నాకు మా నాన్నంటే ప్రాణం, నిజంగా ప్రాణం. మంచివాడు మా నాన్న! చాలా మంచివాడు!"

నాద్యా చికాకుగా, అస్పష్టంగా యింట్లోకి పోయింది. యిక సాయంత్రమంతా అతిధులు వుంటారనీ, వాళ్లతో మాట్లాడవలసి వుంటుందనీ, చిరునవ్వులు నవ్వవలసి వుంటుందనీ, ఫిడేలు వినవలసి వుంటుందనీ, రకరకాల చెత్త సంభాషణ వినవలసి వుంటుందనీ, యెంతసేపూ పెండ్లిని గురించే మాట్లాడవలసి వుంటుందనీ ఆమె మరిచిపోలేకుండా వుంది. తన సిల్కు దుస్తులలో గంభీరంగా, ఆడంబరంగా వున్న అవ్వ సమొవార్* పక్కన కూర్చొని వుంది, అతిధుల ముందర యెప్పుడూ వున్నట్లే గర్విష్ఠిగా కనిపిస్తూ. ఫాదర్ అంద్రేయ్ తన నిగూఢ దరహాసంతో లోపలికి వచ్చినాడు.

"మిమ్మల్ని ఆరోగ్యంగా చూసే ఆనందమూ, సజ్జనాశ్వాసమూ నాకు లభించినాయి," అన్నాడు అతను అవ్వతో. అతను మనస్ఫూర్తిగా అంటున్నాడో, హాస్యమాడుతున్నాడో చెప్పడం కష్టం.

## IV

కిటికీ తలుపులమీదా మిద్దె కప్పుమీదా గాలి మోదుతూ వుండింది. గాలి గీ పెట్టడమూ, పొగగూడు మూల్గే జాలి పాటా వినిపిస్తూ వుండినాయి. రాత్రి పంద్రెండు దాటింది. యింట్లో అందరూ పండుకున్నారు, కానీ యెవ్వరూ నిద్రపోలేదు; కింది అంతస్తునుండి ఫిడేలు వినిపిస్తున్నదనే భావం నాద్యాను వదలిపెట్టలేదు. బయటనుండి పెద్ద ధ్వని వినపడింది, యే తలుపో కీళ్లూడి యెగిరిపడి వుండాలి. ఒక నిముషం తర్వాత నీనా ఇవానొవ్నా లోపలి గౌనుతో గదిలోకి వచ్చింది, చేతిలో కొవ్వొత్తి పట్టుకొని.

"యేమిటా శబ్దం నాద్యా?" అని అడిగింది ఆమె.

నాద్యా అమ్మ, ఒంటి జడగా అల్లిన జుట్టుతో, పిరికి చిరునవ్వుతో, యీ తుఫాను రాత్రి మామూలుకంటె యెక్కువ వయసుదిగా, అనాకర్షణీయంగా, పొట్టిగా కనిపించింది. నాద్యాకు జ్ఞాపకం వచ్చింది, మొన్నమొన్ననే తాను తన తల్లిని అసాధారణ వ్యక్తిగా భావించడమూ ఆమె వాడే మాటలకు తాను గర్వించడమూ. యిప్పుడెంతగా తల బ్రద్దలు కొట్టుకున్నా ఆ మాట లేమిటో ఆమెకు గుర్తురాలేదు — గుర్తువచ్చినవి దుర్బలంగా, కృతకంగా వున్నాయి.

---

* నీళ్ళు మరిగించి, టీ తయారుచేసేందుకు రష్యాలో వాడుక చేసే పాత్ర. — సం.

పొగగూట్లో కీచు గొంతులు పాడినట్లుంది, "అయ్యో, దేవుడా!" అనే మాటలు కూడా గుర్తుపట్టవచ్చు. నాద్యా మంచంమీద లేచి కూర్చొని, బలవంతంగా జుట్టు పీక్కుంటూ యేడ్చింది.

"అమ్మా, అమ్మా!" అన్నది ఆమె యేడుస్తూ. "నేను యెంత హింస—అనుభవిస్తున్నానో నీకు తెలియదు! నిన్ను వేడుకుంటున్నాను, ప్రాథేయపడుతున్నాను — నన్ను వెళ్లిపోనీ!"

"యెక్కడికి?" అన్నది నీనా ఇవానొవ్నా దిగ్భ్రాంతితో. ఆమె మంచంమీద ఒక వార కూర్చుంది. "యెక్కడికి పోవాలని?"

నాద్యాకు దుఃఖం కట్టలు తెంచుకొని వచ్చింది. యేడ్పుతో, నోట మాట రావడం సాధ్యం కాలేదు.

"యీ వూరినుండి నన్ను వెళ్లిపోనీ," అన్న దామె చివరకు. "పెండ్లి జరక్కూడదు, జరగదు, నామాట నమ్ము. ఆ మనిషిమీద నాకు ప్రేమ లేదు. అతన్ని గురించి మాట్లాడడమే నాకు అసహ్యం."

"వద్దు తల్లీ, వద్దు," అన్నది నీనా ఇవానొవ్నా గబగబా, భయంతో దిక్కు తోచక. "వూరుకో. నీకిప్పుడు మనస్సు బాగలేదు. కాసేపుంటే పోతుంది. యిలాంటిది తరుచు జరిగేదేలే. అంద్రేయ్‌తో తగవులాడి వుంటావు. ప్రేమికుల కీచులాటలు ముద్దులలో ముగుస్తాయి."

"పోమ్మా పో, వెళ్లిపో!" అంటూ నాద్యా యేడ్చింది.

కాసేపాగి నీనా ఇవానొవ్నా అన్నది: "నిజమే. నిన్నటిదాకా నీవు చిన్నపిల్లవు. యిప్పుడేమో పెండ్లికూతురువు. ప్రకృతి నిత్య పరిణామశీలమైనది. రేపీపాటికి నీకు తెలియకుండానే తల్లివౌతావు, తరువాత ముసలిదానివౌతావు, నాలాగే ఒక చిలిపి కూతురుతో."

"అమ్మా, నీవు మంచిదానివి, తెలివిగలదానివి, మరి నీవు సుఖపడడం లేదు," అన్నది నాద్యా. "నీ వెప్పుడూ సుఖపడలేదు — నీ వెందు కిలాంటి మామూలు మాటలు మాట్లాడుతావు? యెందుకమ్మా, యెందుకు చెప్పు?"

నీనా ఇవానొవ్నా మాట్లాడడానికి ప్రయత్నించింది, కానీ నోట మాట రాలేదు. ఆమె యేడుస్తూ తన గదికి వెళ్లిపోయింది. మళ్లీ పొగగూట్లో కీచు గొంతులు మూల్గినాయి, నాద్యా హఠాత్తుగా జడుసుకుంది. ఆమె మంచంమీదనుండి యెగిరి, తల్లి గదిలోకి పరుగెత్తింది. నీనా ఇవానొవ్నా, యేడ్పుతో కండ్లు వాచి, మంచంమీద పండుకొని వుంది, నీలం దుప్పటి కప్పుకొని, చేతుల్లో పుస్తకం పట్టుకొని.

''నేను చెప్పేది వినమ్మా,'' అంటూ మొదలుపెట్టింది నాద్యా. ''ఆలోచించు, నన్ను అర్థంచేసుకోడానికి ప్రయత్నించు, నిన్ను ప్రాధేయపడుతున్నాను! మన జీవితం యెంత నిస్సారంగా, యెంత అవమానకరంగా వుందో ఆలోచించు. నా కండ్లు తెరవబడినాయి, నా కిప్పు డంతా కనపడుతున్నది. నీ అంద్రేయ్ అంద్రేయిచ్ యేమిటి? అతను కాస్తైనా తెలివిపరుడు కాదమ్మా. భగవంతుడా, ఓ, భగవంతుడా! ఆలోచించమ్మా, అసలు అతనొక మొద్దు!''

నీనా ఇవానొవ్నా యెగిరి కూర్చుంది.

''నీవూ, మీ అవ్వా నన్ను చిత్రహింస పెడుతున్నారు,'' అన్నది ఆమె వెక్కుతూ. ''నాకు బతకాలని వుంది! బతకాలని వుంది,'' అంటూ ఆమె పదేపదే రొమ్ము బాదుకుంది. ''నాకు స్వేచ్ఛ వుండనివ్వరా మీరు? నేనింకా వయసులో వున్నాను, నాకు బతకాలని వుంది, మీరు నన్ను ముసలిదాన్ని చేసేసినారు!''

ఆమె దుఃఖభారంతో యేడ్చింది, పందుకొని దుప్పటికింద పొర్లుతూ, అనుతాప జనకమ్మైన, అర్థంలేని అల్పప్రాణిలా కనిపించింది. నాద్యా తిరిగి తన గదికి పోయి దుస్తులు వేసుకొని, తెల్ల వారడానికి కిటికీవద్ద కాచుకొని కూర్చుంది. తెల్లవార్లూ ఆమె ఆలోచిస్తూ అక్కడ కూర్చుంది; బయట యెవరో కిటికీ తలుపు తట్టుతున్నట్లూ, యీల వేస్తున్నట్లూ వుండింది.

ప్రొద్దున అవ్వ ఫిర్యాదుచేసింది, గాలికి ఆపుల్ పండ్లన్నీ రాలిపోయినాయనీ, పాత ప్లమ్ చెట్టు కూలిపోయిందనీ. అది మబ్బులు పట్టిన, కాంతి లేని, ఆనందం లేని ఉదయం, ప్రొద్దుననుండే దీపాలు వెలిగించుకోవా లనిపించే దుర్దినం. చలిగా వుందని అందరూ ఫిర్యాదుచేసినారు, కిటికీ తలుపులమీద చినుకులు టపటప మంటూ వుండినాయి. ఉదయ భోజనం తర్వాత నాద్యా సాషా గదిలోకి పోయి, ఒక పలుకు లేకుండా, మూలనున్న కుర్చీ ముందర మోకాళ్ళమీద కూలబడి, చేతులతో ముఖం కప్పుకుంది.

''యేమిటి సంగతి?'' సాషా అడిగినాడు.

''నే నిలా బతకలేను, బతకలేను!'' అని అరిచింది ఆమె. ''యిన్నాళ్ళూ యిక్కడ యెలా బతకగలిగినానో తెలియడం లేదు, బొత్తిగా తెలియడం లేదు! నా భావి భర్తమీద నాకు అసహ్యం కలుగుతున్నది, నామీది నాకు అసహ్యం కలుగుతున్నది, యీ నిర్వ్యాపారత్వపు, నిస్సారపు జీవిత మంతటిమీదా అసహ్యం కలుగుతున్నది....''

"ఆగు, ఆగు...." అంటూ సాషా అడ్డుపడినాడు. ఆమె దేన్నిగురించి మాట్లాడేదీ అతని కింకా తెలిసి రాలేదు. "వూరుకో.... అంతా సర్దుకుంటుందిలే...."

"యీ జీవితంమీద నాకు ద్వేషం," అంటూ నాద్యా కొనసాగించింది. "యిక్కడ యింకొక్క రోజు భరించలేను! రేపు వెళ్లిపోతాను. నన్ను నీతో తీసుకపో నీకు పుణ్యముంటుంది."

సాషా దిగ్భ్రాంతితో ఒక క్షణం సేపు ఆమెవైపు తేరిచూసినాడు. చివరకు అసలు విషయం అతని బుర్ర కెక్కింది; అతను పసి పిల్లలాగ ఆనందించినాడు, సంతోషం పట్టలేక నృత్యం చేసినట్లు చేతులు వూపుతూ, వదులు స్లిప్పర్లలో యెగురుతూ వుండినాడు.

"అద్భుతం!" అన్నాడు అతను, చేతులు రుద్దుకుంటూ "భగవంతుడా, యిది యెంత అద్భుతం!"

ఆమె అతనివైపు రెప్ప లార్పకుండా నిలజూసింది, కన్ను లింత చేసుకొని చూసింది, ప్రేమ భరితంగా సమ్మోహితురాలి లాగ చూసింది, అతను తక్షణం యేదో ముఖ్యమైనది, మహా విలువైనది చెప్తాడనే నిరీక్షణతో చూసింది. అతనింకా ఆమెతో యేమీ అనలేదు. కానీ, యేదో నూతనమైనది, అపారమైనది, తానింతకు మునుపెన్నడూ యెరగనిది అప్పటికే తన కన్నుల ముందు ఆవిష్కృతవౌతున్నట్లు ఆమెకు అనిపించింది; ఆమె నిరీక్షణతో అతనివైపు చూసింది, దేనికైనా సిద్ధపడి, మృత్యువుకైనా సరే.

కాసేపుండి అతను అన్నాడు: "నేను రేపు వెళ్తున్నాను. నన్ను సాగనంపడానికి నీవు స్టేషన్‌కు రావచ్చు. నీ సామాన్లు నా పెట్టెలో పెట్టుకుంటాను, నీకు టికెట్టు కొంటాను. మూడవ గంట కొట్టినప్పుడు రైల్లోకి యెక్కు, యిద్దరం వెళ్లిపోదాం. మాస్కోదాకా నావెంట రా! తరువాత ఒక్కతెవే పీటర్స్‌బుర్గ్‌కు పో. పాస్‌పోర్టు వుందా?"

"ఆ."

"నీవు దీనికెప్పుడూ చింతపడవు — యెప్పుడూ పశ్చాత్తాపపడవు, నాకు తెలుసు!" అన్నాడు సాషా ఉబలాటంతో. "వెళ్లిపోయి చదువుకో, తరువాత పరిస్థితులు తమ దారిన తాము నడుస్తాయి. నీవు నీ జీవితం తలకిందులు చేసిన వెంటనే ప్రతిదీ మారుతుంది. అన్నిటికంటె ముఖ్యమైనది నీ జీవితాన్ని తలకిందులు చేయడం, తక్కినదేదీ ముఖ్యమైనది కాదు. అయితే, రేపు వెళ్లిపోతున్నా మన్నమాట?"

"ఓ, తప్పక! దేవునితోడు!"

తాను ప్రగాఢంగా సంచలించిపోయినాననీ, తన హృదయం యెన్నడూ యింత భారంగా లేదనీ నాద్యా ఊహించుకుంది; యిప్పుడు, వెళ్లిపోడానికి ముందు, తాను బాధపడతాననీ, వ్యథా పూర్ణమైన ఆలోచనలు తన్ను హింసిస్తాయనీ ఆమె నమ్మింది. కానీ పైకి పోయి మంచంమీద వాలిన మరుక్షణమే ఆమెకు నిద్ర పట్టింది; కన్నీటి చారల ముఖంతో, పెదవులమీద చిరునవ్వుతో బాగా సాయంత్ర మైందాకా ఆమె గాఢంగా నిద్రపోయింది.

## V

బండికోసం పంపినారు. నాద్యా టోపీ, కోటూ ధరించి, పై అంతస్తుకు పోయింది, తల్లినీ, యింత కాలం తనది అయిన ప్రతిదాన్నీ చివరిసారి చూడడానికి. ఆమె తన గదిలోకి వెళ్లి, యింకా వెచ్చగా వున్న తన మంచం పక్కన నిలబడింది, తరువాత మెత్తగా తల్లి గదిలోకి పోయింది. నీనా ఇవానొవ్నా నిద్రపోతూ వుండింది; ఆమె గది నిశ్శబ్దంగా వుండింది. తల్లిని ముద్దుపెట్టుకొని, ఆమె వెంట్రుకలు సర్ది, నాద్యా ఒకటి రెండు నిముషాలు నిలబడింది.... తరువాత ఆమె మెల్లగా కిందికి దిగిపోయింది.

వర్షం కుండ పోతగా పడుతూ వుండింది. గుర్రపుబండి నీళ్లోడుతూ వాకిటి ముందు నిలబడివుంది.

నౌకరు సామాను బండిలో పెట్టేటప్పుడు, ''నీకు తావు లేదు నాద్యా,'' అన్నది అవ్వ. ''యీ వానలో నువ్వతన్ని సాగనంపా లేమిటి! యింటి దగ్గర వుంటే మంచిది. చూడు యెలాంటి వానో!''

నాద్యా యేదో చెప్పడానికి ప్రయత్నించింది, కానీ చెప్పలేకపోయింది. సాషా ఆమెను బండిలోకి యెక్కించి, ఆమె మోకాళ్లమీద రగ్గు కప్పినాడు. యిప్పు డతను ఆమె పక్కన కూర్చున్నాడు.

''సెలవు! దేవుడు నిన్ను కాపాడుగాక!'' వరండాలోనుండి అవ్వ కేకవేసింది. ''మాస్కోకు పోతూనే ఉత్తరం రాయడం మరిచిపోకు సాషా!''

''సరే అవ్వా, సెలవు!''

''మేరీ మాత నిన్ను కాపాడుగాక!''

''యేమి వాన!'' అన్నాడు సాషా.

నాద్యాకు యిప్పుడు మాత్రమే యేడుపు వచ్చింది. తాను నిజంగా వెళ్లి

పోతున్నానని యిప్పుడు మాత్రమే ఆమెకు తెలిసివచ్చింది — యింతవరకు ఆమె పూర్తిగా నమ్మని విషయం అది, అవ్వతో సెలవు తీసుకునేటప్పుడు కూడా, తన తల్లి పక్కన నిలబడినప్పుడు కూడా. సెలవు పట్టణమా! అన్నీ ఒక్క పెట్టున ఆమెకు తలపుకు వచ్చినాయి — అంద్రేయ్, అతని తండ్రీ, కొత్త యిల్లూ, వాజ్ పక్కన దిగంబర సుందరీ. కానీ, యివన్నీ యిప్పుడిక ఆమెకు భయం కలిగించలేదు, దిగులు పుట్టించ లేదు, అవన్నీ అమాయకపు చిల్లర విషయాలైనాయి, గతంలోకి దూరదూరంగా తిరోగమిస్తున్నాయి. వాళ్ళు రైలుపెట్టెలో యెక్కినాక రైలు బయలుదేరినప్పుడు, యీ గత మంతా, అంత పెద్ద, అంత ముఖ్యమైన గతమంతా, చిన్న ఉండగా ముడుచుకపోయింది; అపారమైన భవిష్యత్తు, యిప్పటిదాకా కంటికి సరిగా కనిపించనిది, ఆమె యెదుట నిలబడింది. వర్ష బిందువులు కిటికీలమీద టపటపమన్నాయి. పచ్చని పొలాలూ, పరుగెత్తే టెలిగ్రాఫ్ స్తంభాలూ, తంతెలమీద పకులూ తప్ప యేమీ కనిపించడంలేదు. హఠాత్తుగా ఆమె సంతోషంతో ఉక్కిరిబిక్కిరైంది. తాను స్వేచ్ఛ పొందబోతున్నానని, చదువుకోబోతున్నానని, ఆమెకు జ్ఞాపకం వచ్చింది. ఆమె నవ్వింది, యేడ్చింది, దేవుని ప్రార్థించింది.

''ఆపు, ఆపు,'' అన్నాడు సాషా చిరునవ్వుతో. ''ఆపు, ఆపు!''

## VI

ఆకురాలు కాలం గడిచింది, ఆతరువాత చలికాలం గడిచింది. నాద్యాకు యిప్పుడు యింటి బెంగ పట్టుకుంది. అమ్మా, అవ్వా రోజూ ఆమెకు తలపుకు వస్తున్నారు; సాషా కూడా. యింటినుండి వచ్చే ఉత్తరాలు వైరాగ్యంగా, దయగా వుండినాయి, అన్నిటినీ క్షమించినట్లూ, విస్మరించినట్లూ కనిపించింది. మే పరీక్షలు పాసైన తర్వాత ఆమె ఉత్సాహంగా, సంతోషంగా యింటికి బయలుదేరింది; దారిలో, సాషాను చూడడానికి మాస్కోలో ఆగింది. అతను సరిగ్గా నిరుటిలాగే వుండినాడు — పెంచిన గడ్డంతో, చిందరవందర జుట్టుతో, అదే పాతకాలపు పొడవు కోటూ, కాన్వాసు పంట్లామూ తొడుక్కొని, యెప్పటిలాగే అందమైన చేరెడేసి కన్నులతో. కానీ అతను జబ్బుగా, దిగులుగా కనిపించినాడు, మరింత వయసెక్కి, మరింత చిక్కిపోయినాడు, నిరంతరం దగ్గుతూ వుండినాడు. నాద్యాకు అతను సాదాగా కనిపించినాడు.

"అదే, నాద్యానే!" అని అరిచినాడు అతను, సంతోషంతో నవ్వుతూ. "నా బంగారు, నా వరాల మూట!"

వాళ్లు ప్రింటింగు ప్రెస్‌లో కూర్చున్నారు, పొగాకు పొగల మధ్యా, వూపి రాడనివ్వని యింకి, పెయింటు వాసనల మధ్యా. తరువాత వాళ్లు అతని గదికి పోయినారు. అది కూడా పొగ వాసనతో నిండి, చెత్తా, చెదారంతో గలీజుగా వుండింది. టేబుల్‌మీద, చల్లని సమొవార్ పక్కన, పగిలిన ప్లేటులో నల్లని కాగితం ముక్క ఒకటి వుండింది; టేబుల్ నిండా, కింద నేల నిండా చచ్చిన యీగలు పడి వుండినాయి. యిక్కడుండిన ప్రతిదీ తెలియజేస్తూ వుండినాయి, సాషా తన ప్రైవేటు జీవితం గురించి బొత్తిగా శ్రద్ధ వహించడం లేదనీ, శరీర సుఖంపట్ల పూర్తి యేవగింపుతో, నిత్య అపరిశుభ్రతలో జీవిస్తున్నాడనీ. యెవరైనా అతని వ్యక్తిగత సంతోషం గురించీ, ప్రైవేటు జీవితం గురించీ అతనితో మాట్లాడివుంటే, అతన్ని ప్రేమించేవాళ్ళు యెవరైనా వున్నారా అని అడిగివుంటే, దాని అర్థ మేమిటో అతనికి తెలిసి వుండేది కాదు, నవ్వి వూరక వూండేవాడు.

"అంతా సక్రమంగా గడిచింది," అంటూ నాద్యా గబగబా చెప్పింది. "ఆకురాలు కాలంలో అమ్మ నన్ను చూడడానికి పీటర్స్‌బుర్గ్‌కు వచ్చింది. అవ్వకు కోపం లేదని అమ్మ చెప్పింది; కానీ యెప్పుడూ నా గదిలోకి పోయి, గోడలమీద సిలువ గుర్తు వేస్తూవుంటుందట."

సాషా ఉల్లాసంగా కనపడినాడు, కానీ దగ్గుతూ జీరగొంతుతో మాట్లాడినాడు. నాద్యా అతనివైపు చూస్తూ, అతనికి నిజంగా తీవ్రమైన జబ్బులో వున్నాడా, లేక అది తన భ్రమేనా అని తర్కించుకుంటూవుండింది.

"సాషా, సాషా, నీవు జబ్బుగా వున్నావు!" అన్నది ఆమె.

"నేను బాగున్నాను. కాస్త సుస్తీగా వుంది — పెద్ద దేమీ కాదులే...."

"నీవు డాక్టర్ దగ్గరి కెందుకు వెళ్లవు సాషా?" అడిగింది ఆమె ఆందోళనగా. "ఆరోగ్యం గురించి యెందుకు శ్రద్ధ తీసుకోవు? సాషా, నా ప్రియమైన సాషా," ఆమె గొణిగింది, ఆమెకు కండ్లలో నీళ్లు పొంగినాయి, యే కారణం వల్లనో అంద్రేయ్ అంద్రేయిచ్, వాజ్ పక్కన వున్న దిగంబర సుందరీ, తన చిన్నతనం లాగే యెంతో దూరాన వున్నట్లు యిప్పుడు కనపడే తన యావత్తు గతమూ ఆమె మనోనేత్రం ముందు ప్రత్యక్షమైనాయి. నిరుటిలాగ సాషా ప్రజ్ఞాశాలిగా, తెలివిపరుడుగా, ఆసక్తికరంగా కనిపించనందుకు ఆమెకు యేడుపు వచ్చింది. "సాషా, ప్రియమైన సాషా, నీవు చాలా జబ్బుగా వున్నావు. నీవు యింత పాలిపోకుండా, యింత చిక్కి

పోకుండా వుండడానికి నేను యివ్వరానిది యేదీలేదు. నేను నీకు చాలా రుణపడివున్నాను. నా బంగారు సాషా, నీవు నాకు యెంత చేసినావు! నీ వూహ కందదు. యిప్పుడు నా జీవితంలోకెల్లా నీవు అత్యంత ఆప్తునివి, అత్యంత ప్రేమపాత్రునివి.''

వాళ్లు అలాగే కూర్చున్నారు, తెగ మాట్లాడుతూ. యిప్పుడు, పీటర్స్‌బుర్గ్‌లో ఒక చలికాలం గడిపిన తర్వాత, ఆమెకు అనిపించింది, అతను చెప్పే ప్రతిదానిలోనూ, అతని చిరునవ్వులో, మొత్తం అతనిలో యేదో పాతబడినది, పాత కాలంది, ముగిసి పోయినది, బహుశా ఒక కాలు స్మశానంలో వున్నది, అనుభూతి వస్తున్నట్లు ఆమెకు అనిపించింది.

''యెల్లుండి నేను వోల్గనదిమీద విహారం వెళ్తున్నాను,'' అన్నాడు సాషా. ''తరువాత యెక్కడికైనా వెళ్లి కుమీస్* తీసుకుంటాను. కుమీస్ వాడి చూడా లనుకుంటున్నాను. ఒక మిత్రుడూ, అతని భార్యా నావెంట వస్తున్నారు. భార్య అద్భుతమైన మనిషి. వెళ్లి చదువుకొమ్మని ఆమెతో చెప్తూనే వున్నాను. ఆమె తన జీవితం తలకిందులు చేయాలని నా కోరిక.''

మాట్లాడేదంతా అయిపోయినాక వాళ్లు స్టేషన్‌కు పోయినారు. సాషా ఆమెకు టీ యిప్పించి, ఆపుల్ పండ్లు కొనిపెట్టినాడు. రైలు బయలుదేరినప్పుడు, అతను చిరునవ్వుతో చేతిగుడ్డ వూపుతూ ప్లాట్‌ఫారంమీద నిలబడివున్నప్పుడు, అతని కాళ్లు చూసి ఆమె గ్రహించింది, అతను యెంతో జబ్బుగా వున్నాడనీ, చాలా రోజులు బతికే అవకాశం లేదనీ.

నాద్యా తన సొంత వూర్లో మధ్యాహ్నం దిగింది. స్టేషన్‌నుండి ఆమె బండ్లో యింటికి పోతుండగా, వీధులు అనుచితమైనంత విశాలంగా వున్నట్లూ, యిండ్లు చాలా చిన్నవిగా, పొట్టిగా వున్నట్లూ కనిపించినాయి ఆమెకు. వీధులు దాదాపు నిర్మానుష్యంగా వుండినాయి, ఆమెకు కనిపించిందల్లా పురాతనపు చలికోటులో వున్న జర్మన్ పియానో ట్యూనర్. యిండ్లమీద ధూళి పొర కప్పినట్లుంది. యిప్పుడు నిజంగా ముసలిదై, యెప్పటిలాగే లావుగా, అనాకర్షణీయంగా వున్న అవ్వ నాద్యా చుట్టూ చేతులు వేసి, ముఖం నాద్యా భుజంమీద ఆనించి, చాలా సేపు యేడ్చింది, వూడలాక్కోవడం సాధ్యం కానట్లు. నీనా ఇవానొవ్నా కూడా బాగా వయసెక్కింది, పూర్తిగా అనాకర్షణీయంగా తయారై, మనిషి కుదించుకపోయినట్లు కనిపించింది, కానీ యెప్పటిలాగే ఆమె బిగువు కంచుకం ధరించింది, యెప్పటిలాగే వేళ్లలో రాళ్లు మెరుస్తూవుండినాయి.

---

* గుర్రపు పాలు. — సం.

"నా బంగారు," అంటూ ఆమె మనిషంతా కంపించింది. "నా బంగారు కొండ!"

తరువాత వాళ్లు కూర్చొని మౌనంగా యేడ్చినారు. గతం తిరుగు లేకుండా గతించిందని అవ్వా, అమ్మా గుర్తించినట్లు సులభంగా అర్థమైంది. వాళ్ల సామాజిక స్థానమూ, తొలుతటి గౌరవమూ, తమ యింటికి అతిథులను ఆహ్వానించే హక్కూ గతించినాయి. బరువు బాధ్యతలు లేని సుఖ జీవితం మధ్యలో, ఒక రాత్రి పోలీసులు యింట్లో చొరబడి, యిల్లు గాలించి, యింటి యజమాని ఆఫీసు డబ్బు దొంగిలించడమో, ఫోర్జరీయో చేసినాడని కనుక్కుంటే యెలా వుంటుందో అలా వుండింది వాళ్లకు — బరువు బాధ్యతలు లేని సుఖ జీవితానికి శాశ్వతంగా వీడ్కోలు!

నాద్యా పై అంతస్తుకు పోయి, అదే మంచమూ, గంభీరమైన తెల్లని తెరలు గల అదే కిటికీ, కిటికీగుండా చూస్తే సూర్యకాంతిలో మునిగి ఉల్లాసంగా, జీవంతో కోలాహలంగా కనపడే అదే తోట దృశ్యమూ చూసింది. ఆమె టేబుల్‌ను తాకింది, కూర్చుంది, పగటి కలలో మునిగింది. ఆమె బాగా భోంచేసింది, భోజనం తర్వాత రుచిగల గట్టి క్రీమ్‌తో టీ తాగింది, కానీ యేదో వెలితిగా వుంది, గదులు ఖాళీగా వున్నట్లున్నాయి, కప్పు చాలా కిందుగా వున్నట్లు ఆమెకు తోచింది. రాత్రి ఆమె పండుకొని, దుప్పటి కప్పుకున్నప్పుడు, యీ వెచ్చని, అతి మెత్తని మంచంలో పండుకోవడంలో యేదో అపహాస్యమైనది వుండింది.

నీనా ఇవానొవ్నా కాసేపు గదిలోకి వచ్చి, తప్పుచేసినవాళ్ల లాగ, పిరికిగా, దొంగ చూపులు చూస్తూ కూర్చుంది.

"నాద్యా, యెలా వున్నావు?" ఆమె అడిగింది. "సంతోషంగా వున్నావా? నిజమైన సంతోషం?"

"అవునమ్మా".

నీనా ఇవానొవ్నా లేచి, నాద్యామీదా, కిటికీమీదా సిలువ గుర్తు వేసింది.

"నేను భక్తురాలి నైనాను, చూస్తున్నావు గదూ," అన్న దామె. "నేను వేదాంతం అధ్యయనం చేస్తున్నాను, యెప్పుడూ ఆలోచిస్తూ వుంటాను.... యిప్పుడు నాకు చాలా విషయాలు అరటిపండు వొలిచిపెట్టినట్లు స్పష్టంగా వున్నాయి. అత్యంత ముఖ్యమైన విషయం యేమిటంటే జీవితాన్ని స్ఫటికంగుండా చూడడం."

"అమ్మా, అవ్వ నిజంగా యెలా వుంది?"

"బాగనే వున్నట్లుంది. నీవు సాషాతో కలిసి వెళ్లిపోయినాక, అవ్వ నీ టెలిగ్రాం చదివినప్పుడు, అక్కడికక్కడే కింద పడింది. తరువాత మూడు రోజులు కదలకుండా

మంచంలో పడివుంది. ఆ తరువాత ప్రార్థనలూ, యేడుపులూ ప్రారంభించింది. కానీ యిప్పుడు బాగనే వుంది.''

ఆమె లేచి గదిలో పచారు చేయడం ప్రారంభించింది.

''టిక్—టాక్, టిక్—టాక్,'' అంటూ వాచ్‌మన్ వాయించినాడు.

''అసలు విషయం యేమిటంటే, జీవితాన్ని స్ఫటికంగుండా చూడడం,'' అన్నది ఆమె. ''అనగా, మన చైతన్యంలో జీవితం దాని సూక్ష్మ మూలకాలుగా విభజింపబడాలి, యేడు మూల వర్ణాలుగా విభజింపబడినట్లు, యిక ప్రతి మూలకమూ విడివిడిగా పరిశీలింపబడాలి.''

నీనా ఇవానొవ్నా యింకా యేమి చెప్పిందో, యెప్పుడు వెళ్లిపోయిందో నాద్యాకు తెలియదు; ఆమె కాసేపట్లోనే నిద్రపోయింది.

మే గడిచింది, జూన్ వచ్చింది. నాద్యా మళ్లీ యింటి జీవితానికి అలవాటుపడింది. అవ్వ సమొవార్ దగ్గర కూర్చొని, టీ పోస్తూ, పెద్ద నిట్టూర్పులు విడుస్తూ వుండేది. నీనా ఇవానొవ్నా సాయంత్రం పూట తన వేదాంతం గురించి మాట్లాడేది. ఆమె యింకా పరాధీన లాగే బతికేది, కొద్ది కొపెక్కులు కావలసి వచ్చినా, అవ్వను అడగవలసి వుండేది. యింటినిండా యీగలు వుండినాయి, కప్పు అంతకంతకూ కిందికి వస్తూ వుండినట్లుండింది. ఫాదర్ అంద్రేయ్, అంద్రేయ్ అంద్రేయిచ్ యెదురౌతారనే భయంతో అవ్వా, నీనా ఇవానొవ్నా బయటికి వెళ్లేవాళ్లు కాదు. నాద్యా తోటలోనూ, వీధుల్లోనూ తిరిగేది, యిండ్లనూ, కాంతి లేని కంచెలనూ చూస్తూ; చాలా కాలంగా పట్టణం ముసలిదౌతున్నదనీ, దాని కాలం తీరి యిప్పుడది తన అంతం కొరకో, లేక యేదైనా కొత్తదీ, పడుచుదీ అయినదాని ప్రారంభం కొరకో కాచుకొని వున్నదనీ ఆమెకు అనిపించింది. ఓ, యీ కొత్త, స్వచ్ఛ జీవితం ప్రారంభమైతే! అప్పుడు నేరుగా ముందుకు పోవచ్చు, విధిని ధైర్యంగా యెదిరించవచ్చు, మనం చేసింది ఒప్పు అనే విశ్వాసం కలిగివుండవచ్చు, ఉల్లాసంగా, స్వేచ్ఛగా వుండవచ్చు! యీ జీవితం యెప్పుడో ఒకసారి రాకతప్పదు. అవ్వ యిల్లు నిశ్శేషమయ్యే కాలం, నలుగురు నౌకర్లు ఒక గదిలో, బేస్‌మెంటులో, మురికి మధ్య జీవించే యేకైక పద్ధతి గల అవ్వ యిల్లు నిశ్శేషమయ్యే కాలం, వస్తుంది — అవును, యీ యింటి మట్టు లేకుండాపోయి, దీనిని అందరూ మరిచిపోయి, యిది జ్ఞాపక మున్న వాళ్లు యెవరూ లేని కాలం వస్తుంది. నాద్యాకు వుండిన ఒకేఒక అపకర్షణ యేమిటంటే, ఆమె తోటలో షికారు తిరిగేటప్పుడు, ''అదుగో పెండ్లికూతురు!'' అని కేకలు వేస్తూ, కంచెమీద బాదే పక్కయింటి చిన్న కుర్రవాళ్లు.

సరాతొవ్‌నుండి, సాషావద్దనుండి ఉత్తరం వచ్చింది. అతను తన నిర్లక్ష్యపు,

వంకరటింకర దస్తూరిలో రాసినాడు, వోల్గమీద తన విహారం సంపూర్ణంగా కృతార్థమైందనీ, కానీ సరాతొవ్‌లో కాస్త జబ్బు చేసిందనీ, గొంతు పోయిందనీ, గత పక్షం రోజులుగా ఆస్పత్రిలో వున్నాననీ. దీని అర్థమేమిటో ఆమెకు బోధపడింది; ఆమెకు మనసులో దుశ్శంక కలిగింది, దాదాపు నమ్మకం లాంటిది. యీ అనుమానమూ, అసలు సాషానే గురించిన ఆలోచనా తనను వెనుకటిలాగ చలింప జేయడం లేదని ఆమె కలతపడింది. బతకాలనీ, పీటర్స్‌బుర్గులో వుండాలనీ ఆమెకు కాంక్ష కలిగింది, సాషాతో తన మైత్రి గతానికి చెందినట్లూ, ఆ గతం ప్రియతమమైనదైనా యిప్పుడు చాలా దూరపుదైనట్లూ ఆమెకు అనిపించింది. ఆ రాత్రంతా ఆమెకు నిద్ర పట్టలేదు, ప్రొద్దున కిటికీవద్ద కూర్చుంది, యేదో వినపడడానికి కాచుకున్నట్లు. నిజంగానే కంఠ ధ్వనులు కిందనుండి వినపడినాయి — అవ్వ గబగబా యెవరినో యేదో అంటున్నది. తరువాత యెవరో యేడ్చినారు.... నాద్యా కిందికి దిగిపోయి చూసేటప్పటికి అవ్వ ప్రార్థన చేస్తూ గదిలో ఒక మూల నిలబడివుంది, ఆమె ముఖంమీద కన్నీటి చారలు వుండినాయి. టేబుల్‌మీద ఒక టెలిగ్రాం వుండింది.

నాద్యా చాలాసేపు గదిలో అటూయిటూ పచారుచేస్తూ అవ్వ యేడుపు విన్నది, తరువాత టెలిగ్రాం తీసుకొని చదివింది. నిన్న ఉదయం, సరాతొవ్‌లో, అలెక్సాండర్ తిమొఫేయిచ్, అనగా సాషా, క్షయతో మరణించినాడని అందులోవుంది.

మృతుని కొరకు ప్రార్థన యేర్పాటు చేయడానికి అవ్వా, నీనా ఇవానొవ్నా చర్చికి పోయినారు. నాద్యా ఆలోచిస్తూ చాలాసేపు యింట్లో ఆ గదిలోకీ, యీ గదిలోకీ తిరిగింది. ఆమెకు స్పష్టంగా తెలిసివచ్చింది, తన జీవితం సాషా కోరినట్లు తలకిందులుగా తిప్పబడిందనీ, తానిక్కడ ఒంటరిదనీ, పరాయిదనీ, అవాంఛనీయ అనీ, తనకు కావలసిం దిక్కడ యేమీ లేదనీ, గతం చించివేయబడిందనీ, కాల్చి, బూడిదను గాలికి వెదజల్లినట్లు అదృశ్యమైందనీ. ఆమె సాషా గదిలోకి పోయి, అక్కడ నిలబడింది.

"సెలవు సాషా," అన్నది ఆమె. జీవితం ఆమె ముందు పరుచుకొని వుంది, కొత్త, అపారమైన, విశాలమైన జీవితం; యీ జీవితం, యింకా అస్పష్టంగా, నిగూఢంగా వున్నా, ఆమెను సైగలతో పిలిచింది, ముందుకు లాగింది.

ఆమె మేడమీదికి పోయి తన సామాన్లు సర్దుకుంది, మరుదినం ఉదయం తన కుటుంబంతో సెలవు తీసుకొని, వూరు వదలింది, ఉల్లాసంగా, మహా ఉత్సాహంగా — యెప్పటికీ తిరిగిరాననే నమ్మకంతో.

1903

పాఠకులకు మనవి

ఈ పుస్తకం గురించిగానీ, దీని పేర్పూ కూర్పూ గురించిగానీ మీ అభిప్రాయాలనూ మీ సలహాలనూ భావిప్రచురణల సహాయార్థం మాకు పంప ప్రార్థన. మా చిరునామా:

Progress Publishers
21, Zubovsky Boulevard,
Moscow, USSR

మా ప్రచురణలు దొరికే చోట్లు:

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
ఏలూరు రోడ్
విజయవాడ – 2.

విశాలాంధ్ర బుక్ హౌస్
సుల్తాన్ బజార్
హైదరాబాద్

